(2) ఛాం 8-24-1 యోవై భూమా తదమృతం।

(3) నజాయతే మ్రియతే వా విపశ్చిత్

(4) ఛాం 15-1 న చ పునరావర్తతే।

(5) ఛాం 7-1-3 తరతి శోకమాత్మవిత్ ।

(6) బృ 6-4-23 శాంతో దాంత ఉపరతః తితిక్షుః సమాహితః శ్రద్ధావిత్తో భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యేత్ ।

(ఈ) తస్మాత్ యథోక్త సాధన సంపత్త్యనంతరం బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా।

## బ్రహ్మ జిజ్ఞాసా శబ్దాఽర్థ విచారః

17 (అ) (1) తై 3-1 యతోవా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి ।

(2) ఛాం 8-24-1 ఎయ్యది వ్యవహారాతీతమో, (లేక) సంపూర్ణమో, అది నిత్యమైనది

(3) కఠ 3-1 జ్ఞాన స్వరూపునకు పుట్టుక చావు లేదు

(4) ఛాం 15-1 ముక్తుఁడు తిరిగి జన్మించడు

(5) ఛాం 7-1-3 ఆత్మ నెరిగినవాఁడు శోకముఁ బొందడు.

(6) బృ 6-4-23 శాంతుఁడు, దాంతుఁడు ఉపరతుఁడు (విధి పూర్వకముగా సన్యసించినవాఁడు) ద్వంద్వముల సహించినవాఁడు, మనస్సమాధానము సేయగల్గిన వాఁడు గురు వేదాంత వాక్యమందు విశ్వాసము గలవాఁడునై యుండి తన దేహేంద్రియములంతటను బ్రహ్మమునుఁ జూచుచున్నాడు

(ఈ) కావున పై తెల్పిన సాధన సంపత్తి కల్గిన తర్వాత బ్రహ్మ జిజ్ఞాస చేయతగినది

## బ్రహ్మ జిజ్ఞాసా శబ్దార్థ విచారము

17 (అ) బ్రహ్మ జిజ్ఞాసకు ముఖ్యమైన ఆధార శ్రుతులేవన

(1) తై 3-1 దేనివలన నీ భూతములు పుట్టుచున్నవో, పుట్టినవి దేనిచేత జీవించుచున్నవో, దేనిలో తిరిగి (ప్రళయమందు) ప్రవేశించుచున్నవో, దానిని గురించి తెలియఁగోరుము అదియే బ్రహ్మము

(2) ఛాం 8-7-3 సోఽన్వేష్టవ్యః, స విజిజ్ఞాసితవ్యః ।

(3) బృ 6-5-6 ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిధిధ్యాసితవ్యః ।

(అ) బ్రహ్మణో జిజ్ఞాసా బ్రహ్మజిజ్ఞాసా । బహ్మ చ వక్ష్యమాణ లక్షణం "జన్మాద్యస్య యతః ఇతి । అత ఏవ న । బ్రహ్మ శబ్దస్య జాత్యాద్యర్థాన్తరం ఆశంకితవ్యం । బ్రహ్మణ ఇతి కర్మణి షష్ఠీ, న శేషే । జిజ్ఞాస్యాపేక్షత్వాత్ జిజ్ఞాసాయాః, జిజ్ఞాస్యాన్తరా నిర్దేశాచ్చ ।

(ఇ) పూర్వపక్షః — నను శేష షష్ఠీ పరిగ్రహేఽపి బ్రహ్మణో జిజ్ఞాసాకర్మత్వం నవిరుధ్యతే, సంబంధ సామాన్యస్య విశేష నిష్ఠత్వాత్ ।

(2) ఛాం 8-7-3 దహరాకాశమైన బ్రహ్మము వెదుకఁ దగినది అదియే తెలిసికొనఁదగినది

(3) ఓసీ ఆత్మయే చూడఁదగినది వినదగినది చింతింపఁ దగినది ధ్యానింపఁదగినది

(అ) బ్రహ్మయొక్క జిజ్ఞాస—బ్రహ్మజిజ్ఞాస, బ్రహ్మ యన ముందు జెప్పఁబోవుచున్న లక్షణము కలది— (2-వ సూత్రము) "జగత్తుయొక్క జన్మాదులు దేనినుండి కల్గునో యది బ్రహ్మ అని అందుకనే బ్రహ్మ శబ్దమునకు బ్రాహ్మణుఁడని, చతుర్ముఖుఁడని, ఇత్యాది జాతాద్యర్థములని శంకింపఁబనిలేదు (బ్రహ్మజిజ్ఞాస పద సమాసము ఏమన) బ్రహ్మశబ్దమునకు కర్మార్థమునందు (ద్వితీయా విభక్త్యర్థమందు ను-కూర్చి-గురించి) షష్ఠీవిభక్తి ప్రయోగము కాని సంబంధ (శేష) షష్ఠీ విభక్త్యర్థము చెప్ప కూడదు 'తెలిసికొనవలయు నను నిచ్ఛ యను నర్థమిచ్చు "జిజ్ఞాసా పద ముపయుక్త మగుటచేత జిజ్ఞాసకు జిజ్ఞాస్య వస్తువపేక్షితము ఇచట జిజ్ఞాస్యమగు మరొక వస్తువు నిర్దేశింపఁబడక పోవుటచేత "బ్రహ్మనుగూర్చిన జిజ్ఞాస" యని కర్మణి షష్ఠీ చెప్పవలెను

(ఇ) పూర్వపక్షిః - ఓయీ! సంబంధ సామాన్య (శేష) షష్ఠిని (బ్రహ్మ సంబంధమైన జిజ్ఞాస అని) పరి గ్రహించినను 'బ్రహ్మను గురించిన జిజ్ఞాస' యని యర్థము చెప్పకొనుట విరుద్ధము కాదు "సంబంధ సామాన్యమున, విశేష సంబంధముగూడ నవగతము కావచ్చును సంబంధ సామాన్యము విశేషమునం దుండును గదా!

(ఈ) సమాధానమ్ — ఏవమపి ప్రత్యక్షం బ్రహ్మణః కర్మత్వముత్సృజ్య సామాన్యద్వారేణ పరోక్షం కర్మత్వం కల్పయతో వ్యర్థః ప్రయాసః స్యాత్ ।

(ఉ) పూర్వపక్షః — నవ్యర్థః । బ్రహ్మాశ్రితాశేష విచార ప్రతిజ్ఞానార్థత్వాత్ ఇతిచేత్ ।

(ఊ) సమాధానం — న । ప్రధాన పరిగ్రహే త దపేక్షితానాం అర్థాక్షిప్తత్వాత్ । బ్రహ్మహి జ్ఞానేన ఆప్తు మిష్టతమత్వాత్ ప్రధానం ।

(ఋ) తస్మిన్ ప్రధానే జిజ్ఞాసాకర్మణి పరిగృహీతే, యై ర్జిజ్ఞాసితై ర్వినా బ్రహ్మ జిజ్ఞాసితం న భవతి, తా న్యర్థాక్షిప్తా న్యేవేతి న పృథక్ సూత్రయితవ్యాని । యథా రాజాఽసౌ గచ్ఛతీత్యుక్తే సపరివారస్య రాజ్ఞో గమన ముక్తం భవతి, తద్వత్ ।

(ఈ) సమాధానము - అయినను ప్రత్యక్షముగా బ్రహ్మకు నున్నకర్మత్వమును వదలి 'సామాన్యము ద్వారా పరోక్ష కర్మత్వ కల్పనము వృథా ప్రయాస యగును

(ఉ) పూర్వపక్షము - ఇది వ్యర్థ ప్రయాసముగాదు బ్రహ్మ సంబంధమైన 'జిజ్ఞాస యనగా బ్రహ్మయొక్క- లక్షణ, ప్రమాణాద్య శేషవిచారముల జిజ్ఞాసయని యర్థము చేకూరుట వలన

(ఊ) సమాధానము - అట్లుగాదు బ్రహ్మను ప్రధానముగాఁ జేసి దానిని విచారించు మని సెప్పుటలోనే, దాని సంబంధమైన యన్ని విషయముల విచారము సైతము ప్రాప్తించుట వలన జ్ఞానముచేతఁ బొందుట యందిష్టతమ మయినది బ్రహ్మము ప్రధానము కాన కర్మార్థము యుక్తం బగు

(ఋ) ప్రధానమగు బ్రహ్మము జిజ్ఞాసా క్రియకు కర్మగా గ్రహింపబడగా బ్రహ్మమును గురించి యని యొప్పుకొనినచో ఏ ముఖ్యమైన జిజ్ఞాసిత విషయములు లేకుండ బ్రహ్మ జిజ్ఞాసితము కాదో, అవి యన్నియు అర్థాత్సిద్ధము లగుటంచేసి వేరుగా మరియొక సూత్రనిర్మాణము సేయ నవసరముండదు

ఉదా ఈరాజు పోవుచున్నా డన పరివారముతోఁ గూడిన రాజుయొక్క గమనము చెప్పఁబడినట్లే యగును (అట్లే యిచట 'బ్రహ్మ జిజ్ఞాస యనగా బ్రహ్మము గురించియు బ్రహ్మసంబంధమైన యితగ విషయముల గురించియు, జిజ్ఞాస యని విపులార్థము ప్రాప్తించును )

(ఋ) శ్రుత్యనుగమాచ్చ—

(1) తై 3-1 యతో వా ఇమాని భూతాని జాయన్తే: యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి।

(2) ఛాం 8-7-3 సవిజిజ్ఞాసితవ్యః

(3) బృ 6-5-6 ఆత్మా వారే ద్రష్టవ్యః ఇత్యాద్యాః శ్రుతయః 'తద్విజిజ్ఞాసస్వ 'తద్బ్రహ్మేతి' ఇతి ప్రత్యక్షమేవ బ్రహ్మణో జిజ్ఞాసాకర్మత్వం దర్శయన్తి। తచ్చ కర్మణి షష్ఠీ పరిగ్రహే సూత్రేణానుగతం భవతి। తస్మాత్ బ్రహ్మణ ఇతి కర్మణి షష్ఠీ।

## 4 జిజ్ఞాసా శబ్దాఽర్థ విచారః

18 జ్ఞాతుమిచ్ఛా జిజ్ఞాసా। అవగతి పర్యంతం జ్ఞానం 'సన్' వాచ్యాయాః ఇచ్ఛాయాః కర్మ ఫల విషయత్వాదిచ్ఛాయాః। జ్ఞానేనహి ప్రమాణేన అవగంతుమిష్టం బ్రహ్మ। బ్రహ్మావగతిర్హి పురుషార్థః। నిశ్శేష సంసార బీజాఽవిద్యాద్యనర్థ నిబర్హణాత్। తస్మాత్ బ్రహ్మ విజిజ్ఞాసితవ్యం।

(ఋూ) ఈక్రింది శ్రుతుల ననుసరించుటవలనఁగూడ కర్మణి షష్ఠినే చెప్పవలయును

1 తై 3-1 దేనివలన నీ భూతములు పుట్టుచున్నవో, దేనిచే పుట్టినవి జీవించుచున్నవో, దేనియందు ప్రలయ కాలమున ప్రవేశించుచున్నవో దానిని తెలియుము అదియే బ్రహ్మ యని

2 ఛాం 8-7-3 ఆ (దహరాకాశమందున్న) బ్రహ్మమే తెలియఁదగినది.

3 బృ 6-5-6 ఓసీ, చూడఁదగినది ఆత్మయే ఈ మున్నగు శ్రుతులు "దానిని తెలియుము" "అదియే బ్రహ్మ యని ప్రత్యక్షముగా బ్రహ్మకు జిజ్ఞాసలో కర్మత్వమునుఁ జూపుచున్నవి ఆ కర్మణి షష్ఠిని గ్రహించినపుడే శ్రుతి బోధితమైన బ్రహ్మయొక్క కర్మత్వము సూత్రముతో ననుగతమగును కావున బ్రహ్మణః అనునది కర్మణి షష్ఠియే

## 4 జిజ్ఞాస' శబ్దార్థ విచారము

18 తెలిసికొనుటకై యుండు కోరిక "జిజ్ఞాస" (యని సంస్కృతపదము) (జ్ఞా అవబోధనే-జ్ఞా + సన్ = జిజ్ఞా + సన్ = జిజ్ఞాసా — వ్యాకరణములో సన్ ప్రత్యయము చేర్చిన కోరుట కోరికయను నర్థంబు చేకూరును పిపాసా= త్రాగుటకు కోరిక, జిగమిషా = వెళ్లుటకు కోరిక, బుభుక్షా = తినుటకు కోరిక ) 'సన్' వాచ్యమైన కోరికకు కర్మ యేదన, ఇచ్ఛకు ఫలమే విషయ మగుటవలన బ్రహ్మావగతి (సాక్షాత్కార) పర్యంతమగు జ్ఞానమే కర్మయగును.

బ్రహ్మప్రసిద్ధతా

19 (అ) పూర్వపక్షః - తత్పునర్బ్రహ్మ ప్రసిద్ధం అప్రసిద్ధం వాస్యాత్? యది ప్రసిద్ధం నజిజ్ఞాసితవ్యం, అథ అప్రసిద్ధం నైవశక్యం జిజ్ఞాసితుం ఇతి

(ఆ) సమాధానం - ఉచ్యతే - అస్తితావన్నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావం సర్వజ్ఞం సర్వశక్తి సమన్వితం బ్రహ్మ। బ్రహ్మశబ్దస్యహి వ్యుత్పాద్యమానస్య నిత్యశుద్ధ త్వాద యోఽర్థాః ప్రతీయన్తే। బృంహతేర్ధాతోః అర్థానుగమాత్। సర్వస్యాత్మత్వాచ్చ బ్రహ్మాస్తిత్వ ప్రసిద్ధిః। భగ-10-39 నతదస్తి వినా యత్స్యాత్ మయాభూతం చరాచరం।

సర్వోహ్యాత్మాస్తిత్వం ప్రత్యేతి, ననాహమస్మీతి। యది హినాత్మాస్తిత్వ ప్రసిద్ధిః స్యాత్ సర్వోలోకోనా హమస్మీతి ప్రతీయాత్। ఆత్మాచ బ్రహ్మ

జ్ఞానమనెడి ప్రమాణముతో తెలియుట కిష్టమైనది బ్రహ్మ. బ్రహ్మానుపొందుటయే పురుషార్థము కదా ! ఏలన, పూర్తిగా సంసార బీజమైన అవిద్యాదుల నాశము చేయునట్టిది (బ్రహ్మజ్ఞానము) కావున బ్రహ్మయే తెలియఁదగినట్టిది

## బ్రహ్మప్రసిద్ధత్వము

19 (అ) పూర్వపక్షము - బ్రహ్మము ప్రసిద్ధమైనదా, అప్రసిద్ధమైనదా ? ప్రసిద్ధమైనచో తెలిసికొనవలసిన పనిలేదు అటులకాక, అప్రసిద్ధమైనచో తెలిసికొనుటకు శక్యముకానిది యగును అని

(ఆ) సమాధానము - చెప్పఁబడుచున్నది నిత్యము శుద్ధము బుద్ధము స్వతంత్ర స్వభావమై సర్వమును తెలిసిన సమస్తశక్తితోఁగూడిన బ్రహ్మ (ప్రసిద్ధమై) యున్నది. 'బ్రహ్మ శబ్దమునకు వ్యుత్పత్తిచే నిరవధిక మహాత్వము గలదని యర్థము ప్రాప్తించుటవలన నిత్య శుద్ధత్వాదులు ప్రకటితమగుచునే యున్నవి 'బృంహతి ధాతువువల్ల బ్రహ్మశబ్దము సిద్ధించును (బృహి వృద్ధౌ-లట్ బృంహతి = వృద్ధియగుచున్నది) మరిన్ని ప్రతివానికి ఆత్మయగుటవలన బ్రహ్మ యున్నట్లు ప్రసిద్ధి యగుచున్నది

"గీత 10-39 నేను లేకుండాయున్న చరాచర మెట్టిదియు లేదు

ప్రతియొక్కఁడు తానున్నట్లే తలంచునుగాని తాను లేనట్లు తలచుటలేదు ఆత్మాస్తిత్వము ప్రసిద్ధమే కానిచో ప్రతివాఁడును 'నేనులే' నని భావించవలసివచ్చును (అటుల

బృ 4-5-10 అయమాత్మా బ్రహ్మ

(ఇ) పూర్వపక్షః — యదిలోకే బ్రహ్మఆత్మత్వేన ప్రసిద్ధమస్తి తతోజ్ఞాత మేవేతి అజిజ్ఞాస్యత్వం పునరాపన్నం

(ఈ) సమాధానం — న। తద్విశేషం ప్రతి విప్రతిపత్తేః।

20 విప్రతిపత్తయః నవ విధాః

1 "దేహమాత్రం చైతన్యవిశిష్టం ఆత్మా ఇతి ప్రాకృతా జనా లోకాయతికాశ్చ ప్రతిపన్నాః।

2 "ఇంద్రియాణ్యేవ చేతనాని ఆత్మా' ఇత్యపరే।

3 "మనః ఇత్యన్యే।

4 "విజ్ఞాన మాత్రం క్షణికం' ఇత్యేకే।

లోకానుభవము లేదుగాన ఆత్మాస్తిత్వము సుప్రసిద్ధము) ఆత్మయే బ్రహ్మ

బృ 4-5-10 ఈ యాత్మయే బ్రహ్మ

(ఇ) పూర్వపక్షము - లోకములో బ్రహ్మ ఆత్మరూపమున ప్రసిద్ధమైయున్నచో (బ్రహ్మము) సర్వులకుఁ దెలియఁబడినదే యగుటచే (అట్టిదానిని తిరిగి) తెలియఁగోరుట (బ్రహ్మజిజ్ఞాసా) యనునది కుదరకపోవుట తిరిగి ప్రాప్తించుచున్నదే!

(ఈ) సమాధానము - అటులగాదు దాని విశేషరూపమును గురించి (ఆత్మ యేది? ఎట్టిది? అనుదానిని గురించి) విరుద్ధ భావము లుండుటచేత (జిజ్ఞాస్యమే)

20 విపరీత భావములు తొమ్మిది విధములు

1 చైతన్యముతోకూడిన దేహమే యాత్మ యని మందబుద్ధులు లోకాయతికులు (చార్వాకులు)ను తలంచుచున్నారు వీరు దేహాత్మవాదులు

2 చేతనములైన నింద్రియములే యాత్మ యని కొందరు లోకాయతికులలో మరియొక తెగవారు వీరు ఇంద్రియాత్మవాదులు

3 మనస్సే యాత్మ యని "మానసాత్మ వాదులు లోకాయతికులలో నింకొక తెగవారు

4 క్షణికమైన విజ్ఞానమే యాత్మ యని కొందరు బౌద్ధులలో యోగాచారుల మత మిది క్షణిక విజ్ఞానవాదులు

5 "శూన్యం" ఇత్యపరే।

6 "అస్తి దేహాది వ్యతిరిక్తః సంసారీ కర్తా భోక్తా" ఇత్యపరే।

7 "భోక్తైవ కేవలం నకర్తా" ఇత్యేకే।

8 "అస్తి తద్వ్యతిరిక్తః ఈశ్వరః సర్వజ్ఞః సర్వశక్తిః" ఇతి కేచిత్।

9 "ఆత్మా స భోక్తుః" ఇత్యపరే।

ఏవం బహవోవిప్రతిపన్నాః యుక్తివాక్య తదాభాస సమాశ్రయాస్సంతః।

21 తత్రావిచార్య యత్కించిత్ ప్రతిపద్యమానో నిశ్శ్రేయసాత్ ప్రతిహన్యేత, అనర్థంచ ఇయాత్।

5 శూన్యమే యాత్మ యని కొందరు బౌద్ధులలో మాధ్యమికుల మత మిది—శూన్యాత్మవాదులు

6 దేహాదులకు సంబంధింపనివాఁడై సంసారియై కర్తయు భోక్త (అనుభవించు) యునగు నట్టిది యాత్మ యని కొందరు వైశేషిక మతము భోక్త్రాత్మవాదులు

7 ఆత్మ కేవలము భోక్తయే కాని కర్తగాదు, అని కొందరు సాంఖ్యుల మత మిది కేవల భోక్త్రాత్మ వాదులు

8 అన్నిటికంటె వ్యతిరేకుఁడై సర్వజ్ఞుడై సర్వశక్తి మంతుఁడైన యీశ్వరుఁడే యాత్మ యని సేశ్వర సాంఖ్యులు యోగుల మతము

9 భోక్తయు (అకర్తయు సాక్షియు) నగు జీవునకు ఆ ఈశ్వరుడు ఆత్మ = స్వరూపము అని అద్వైతులు—వేదాంత వాదము ఇది సిద్ధాంతము

ఈ విధముగా ననేకులు యుక్తులను, వాక్యములను, తదాభాసలను వారి వారి మతముల కనుకూలముగాఁ గల్పించు కొనుచు భిన్నాభిప్రాయులగుచున్నారు

21 అందు బాగుగా విచారింపక పైన తెలుపఁబడిన భిన్నభిన్న మతములలో నేదియో నొకదానిని స్వీకరించిన వాడు నిశ్శ్రేయస్సు (మోక్షము) నుండి అడ్డగింపబడును మరియు అనర్థమునుఁ బొందఁగలడు

22 తస్మాత్ బ్రహ్మ జిజ్ఞాసోపన్యాసముఖేన వేదాంత వాక్యమీమాంసా, తదవిరోధితర్కోపకరణా, నిశ్శ్రేయస ప్రయోజనా ప్రస్తూయతే।

2 జన్మాద్యధికరణమ్

23 అవతారికా బ్రహ్మజిజ్ఞాసితవ్యమితి ఉక్తమ్। కిం లక్షణం పునస్తద్బ్రహ్మ? ఇత్యతః ఆహ భగవాన్ సూత్రకార ।

2 సూ జన్మాద్యస్యయతః।

పదవిభాగః— జన్మాది+అస్య+యతః ।

పూరణవాక్యం—జన్మాది అస్య యతః కారణాత్ భవతి, తత్కారణం బ్రహ్మ।

వృత్తిః — అస్య జగతః జన్మ స్థితి లయాః యస్మాద్భవన్తి, తద్బ్రహ్మ।

పంచావయవాః।

1 విషయః—బ్రహ్మణో లక్షణం। విషయశ్రుతిః— "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశంతీతి తద్బ్రహ్మ' తై 3-1

22 కావున "బ్రహ్మజిజ్ఞాస" ను గురించి యుపన్యసింపుచు, వేదాంతవాక్య మీమాంసా శాస్త్రము, ఉపనిషద్వాక్యముల కవిరుద్ధములైన యుక్తుల సహాయము గలదై, మోక్ష మొక్కటియే ప్రయోజనముగా గలదై, (వ్యాసాచార్యునిచే) ఆరంభింపఁబడుచున్నది

2 జన్మాద్యధికరణము

23 అవతారిక— బ్రహ్మ విచారింపఁదగినదని చెప్పఁబడినది పూర్వ సూత్రమందు ఆ బ్రహ్మయొక్క లక్షణ మెట్టిది? అనగా, సూత్రకారుఁడైన భగవాన్ బాదరాయణాచార్యులవారు చెప్పుచున్నారు

**2 సూ— జన్మాద్యస్యయతః**

పదవిభాగము— (1) జన్మాది+అస్య+యత
జన్మాదులు, దీనికి, ఎవనివల్లనో

2 జన్మ + ఆద్యస్య + యతః పుట్టుక ఆద్యుడైన చతుర్ముఖునికి, ఎవనివల్లనో (ఇది సమంజసముకాదు)

పూరణవాక్యము— జన్మాదులు, ఈప్రపంచమునకు ఏకారణమువల్లనో, ఆకారణము బ్రహ్మ యగును

వృత్తి— ఈ జగత్తునకు పుట్టుక, ఉనికి, నాశనములు ఎవనినుండి యగునో అది బ్రహ్మము

పంచావయవములు —

(1) విషయము - బ్రహ్మయొక్క లక్షణము, శ్రుతివాక్యము తైత్తిరీయములో, "ఎవనివలన నీ భూతములు పుట్టుచున్నవో, ఈపుట్టినవి ఎవనిచేత, జీవించుచున్నవో, ఎవనిగురించి తిరిగి లయించుచున్నవో, అది బ్రహ్మ"

2 సంశయః — అద్వితీయబ్రహ్మణః శ్రుత్యుక్త లక్షణ మస్తివా ? నవా ?

3 పూర్వపక్షః — బ్రహ్మణో లక్షణం నస్యాత్, అద్వితీయత్వాత్ । లక్షణం తు లక్ష్యాద్యన్యం భవేత్, పృథివ్యాః గంధాదివత్ । అద్వితీయ బ్రహ్మణో లక్షణం సాధితుం నయుక్తం । జగజ్జన్మాదిశ్రుతివాక్యం జగత్పుర స్కృత్యోక్తం, నతు బ్రహ్మ విషయం । తస్మాత్ బ్రహ్మ నవిచారితవ్యం అలక్షణత్వాత్ ।

4 సిద్ధాంతః—పరమార్థతః బ్రహ్మ అద్వితీయం । వ్యవహారతః తస్య బ్రహ్మణః జగజ్జన్మాది లక్షణం ఘటతే యత్ శ్రుత్యా ఉపదిశ్యతే । ఉపాదాన నిమిత్తోభయ కారణం బ్రహ్మణ స్తటస్థ లక్షణం—సత్యజ్ఞానానందాదికం బ్రహ్మణ స్స్వరూప లక్షణం—తస్మాత్ బ్రహ్మ నూనం జిజ్ఞాసి తవ్యం

5 సంగతిః — పూర్వసూత్రే బ్రహ్మజిజ్ఞాసితవ్య మిత్యుక్తం అద్వితీయ బ్రహ్మ అలక్షణత్వాత్ నవిచారితవ్య మితి—ఆక్షేప సంగతిః ।

2 సంశయము - అద్వితీయమైన బ్రహ్మకు శ్రుతి వాక్యమందుఁ బేరొకని లక్షణము (జగజ్జన్మాది లక్షణము) కలదా ? లేదా ?

3 పూర్వపక్షము - బ్రహ్మకు లక్షణముండుటకు వీలు లేదు ఏలన, దాని కద్వితీయత్వ మున్నదికదా లక్షణము లక్ష్యముకన్న వేరుగా నుండవలెనుకదా ఎట్లన, భూమికి గంధాది లక్షణము వేరుగా నున్నట్లు అద్వితీయ బ్రహ్మకు లక్షణము సాధించుట వీలుకాని పని శ్రుతివాక్యములోనున్న జగజ్జన్మాది వాక్యము జగత్తును గురించి చెప్పిన వాక్యముగాని, బ్రహ్మను గురించి చెప్పిన వాక్యముగాదు కాన బ్రహ్మ విచారణీయము కాదు ఏలన లక్షణరహితము గాన

4 సిద్ధాంతము —— పరమార్థముగా బ్రహ్మ అద్వితీయమే వ్యవహారముగా, బ్రహ్మకు జగజ్జన్మాది లక్షణము చెల్లును అదియే శ్రుతివాక్యము చెప్పుచున్నది ఉపాదాన నిమిత్త ఉభయకారణత్వము బ్రహ్మకు తటస్థలక్షణమై యున్నది సత్యము, జ్ఞానము ఆనందము అనునవి బ్రహ్మకు స్వరూపలక్షణములు కాన బ్రహ్మ నిశ్చయముగా జిజ్ఞాసింప (విచారింప) తగినదై యున్నది

5 సంగతి - పూర్వసూత్రమందు బ్రహ్మ విచారింప తగినదని చెప్పఁబడినది అద్వితీయ బ్రహ్మ, లక్షణరహిత మగుటచే, విచారింప తగదేమో యని ఆక్షేప సంగతి ప్రాప్తించుచున్నది

24 జన్మాది ' శబ్దవిచార

(అ) జన్మోత్పత్తిరాది రస్యేతి తద్గుణ సం విజ్ఞానః బహువ్రీహి ।

(ఆ) జన్మస్థితి భంగం సమాసార్థః । జన్మనశ్చాదిత్వం, శ్రుతి నిర్దేశాపేక్షం వస్తువృత్తాపేక్షంచ । శ్రుతి నిర్దేశ స్తావత్ ।

"యతోవా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభి సంవిశన్తి ' తై 3-1

ఇత్యస్మిన్ వాక్యే జన్మ స్థితి ప్రలయానాం క్రమదర్శనాత్ । వస్తువృత్తమపి జన్మనాలబ్ధ సత్తాకస్య ధర్మిణః, స్థితి ప్రలయ సంభవాత్ ।

25 ' అస్య ' శబ్దవిచారః

అస్యేతి ప్రత్యక్షాది సన్నిధాపితస్య ధర్మిణః ఇదమా నిర్దేశః, షష్ఠీ జన్మాది సంబంధార్థా ।

26 ' యతః శబ్దవిచారః

(అ) 'యతః' ఇతి కారణనిర్దేశః । అస్య జగతో నామరూపాభ్యాం వ్యాకృతస్య అనేకకర్తృ భోక్తృ

## 24 జన్మాది శబ్దవిచారము

జన్మ = ఉత్పత్తి ఆది = మొదలు, అస్యేతి = దీనికిఁగాఁగా 'జన్మాది యనఁబడునని తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి సమాసము

(అ) 'జన్మాది' యను సమస్తపదమునకు జన్మ, స్థితి, లయములు అర్థము శ్రుతి నిర్దేశము ననుసరించియు, వస్తువృత్తము ( ధర్మము )ను గమనించుటచేతను జన్మము మొట్టమొదటిదిగా గ్రహింపఁబడుచున్నది శ్రుతి నిర్దేశ మెట్టిదన, "దేనివలన నీ భూతములు పుట్టుచున్నవో, పుట్టినవి దేనివలన జీవించుచున్నవో ప్రళయమున దేనిలో ప్రవేశించుచున్నవో ' ఈ వాక్యమందు జన్మ, స్థితి లయముల క్రమముఁగన్పడుటచేత వస్తు ధర్మము కూడ, మొదట జన్మము కల్గినదానికే స్థితి నాశములు సంభవించుట వలన

## 25 'అస్య శబ్దవిచారము

"అస్య = దీనియొక్క' అని ప్రత్యక్షముగా దగ్గరనున్న దానియొక్క ( ఈ జగత్తునకు సంబంధించిన ) 'ఇది యని నిర్దేశము అనగా—ఈ ( కన్పడు ) జగత్తుకు సంబంధించిన జన్మ మున్నగునవి యనుటయే—షష్ఠీ విభక్తి—'ఇదం' అనుదానికి జన్మాది సంబంధార్థము

## 26 యతః శబ్దవిచారము

యత = దేనివలన నయితే—అనుటచేత నిది కారణమును దెల్పుచున్నది నామరూపములతో బహిః ప్రకటితమై అనేకులగు కర్తలతోడను, భోక్తలతోడనుఁ గూడియున్న,

సంయుక్తస్య, ప్రతినియత దేశకాల నిమిత్త క్రియాఫలాశ్రయస్య మనసాఽప్యచింత్యరచనా రూపస్య జన్మ స్థితి భంగం, యతః సర్వజ్ఞాత్ సర్వ శక్తేః కారణాత్ భవతి, తద్బ్రహ్మేతి వాక్య శేషః।

(ఆ) అన్యేషామపి భావ వికారాణాం త్రిష్వేవ అన్తర్భావః ఇతి జన్మస్థితి నాశానాం ఇహ గ్రహణం। యాస్క పరిపఠితానాం తు "జాయతేఽస్తి' ఇత్యాదీనాం గ్రహణే, తేషాం జగతః స్థితి కాలే సంభావ్య మానత్వాత్, మూలకారణాత్ ఉత్పత్తి స్థితి నాశాః జగతో న గృహీతాః స్యుః ఇత్యాశంక్యేత। తన్మాశంకీతి యోత్పత్తి ర్బ్రహ్మణః, తత్రైవ స్థితిః ప్రలయశ్చ తఏవ గృహ్యన్తే।

ప్రతి కర్మను గూర్చి నియతములగునట్టి దేశము, కాలము, నిమిత్తము క్రియ, ఫలము గలిగిన మనస్సుచే గూడఁ జింతించుటకు శక్యముగాని రచనా విశేషముతోఁ గూడిన యీ జగత్తు యొక్క జన్మ స్థితి లయములు ఏకారణము నుండి వచ్చుచున్నవో యనినప్పుడు ఆ కారణము సర్వజ్ఞము, సర్వశక్తిమంతము అయియుండవలెనని తేలుచున్నది కావున సూత్రాంతమందు "తద్బ్రహ్మ-ఇతి యని వాక్య శేషము చేర్చవలెను (అంతట వాక్యము పూర్ణమైన దగును ఆ కారణము బ్రహ్మయే యని తాత్పర్యము )

(అ) ఇతర భావ వికారములు (జన్మ, స్థితి, లయములు గాక—పెరుగుట, పండుట, కుళ్ళుట మున్నగునవి) కూడ జన్మ, స్థితి లయము లను మూడింటిలో నంతర్భూతములై యున్నవని గ్రహింపనగును యాస్కాచార్యుని నిరుక్త శాస్త్రములో పఠింపఁబడిన ఆరు వికారములు ( పుట్టు చున్నది, ఉన్నది, పెరుగుచున్నది పండుచున్నది, ఎండు చున్నది, నశించుచున్నది అను షడ్భావ వికారములు (జగత్తు యొక్క స్థితికాలమందే కన్పట్టునవి గాన సూత్రములో జగదంతఃపాతి వస్తువుల ( పంచభూతములకు—సూర్యాదు లకు ఇత్యాది ) యుత్పత్తి స్థితిలయములకు మాత్రమే బ్రహ్మము కారణమని భాసించునుగాని, సాక్షాత్ జగత్ యొక్క యుత్పత్తి స్థితి లయములకు బ్రహ్మము కారణమని భాసించక పోవచ్చునను శంక కలుగకుండుటకై జగత్తు యొక్క యుత్పత్తి యే బ్రహ్మమువలన నయినదో, యా బ్రహ్మ మందే స్థితియు ప్రలయము గూడ జరుగుచున్నవని యుత్పత్తి స్థితి లయములు మాత్రము గ్రహింపబడినవి

(ఇ) న యథోక్త విశేషణస్య జగతో యథోక్త విశేషణం ఈశ్వరం ముక్త్వా అన్యతః ప్రధానాత్ అచేతనాత్ అణుభ్యః అభావాత్, సంసారిణో వా ఉత్పత్త్యాది సంభావయితుం శక్యం। న చ స్వభావతః - విశిష్ట దేశ కాల నిమిత్తానాం ఇహ ఉపాదానాత్ ।

(ఈ) ఏతదేవానుమానం సంసారి వ్యతిరిక్తేశ్వరాస్తిత్వాది సాధనం మన్యన్తే ఈశ్వరకారణినః

(ఉ) ఆక్షేపణం—నన్విహాపి తదేవోపన్యస్తం జన్మాది సూత్రే ।

(ఇ) పూర్వమందుఁ జెప్పఁబడిన విశేషణములుగల ( నామ రూప వ్యాకృతాదులు–26 (అ) లో చెప్పబడినవి ) జగత్తుయొక్క యుత్పత్త్యాదులు, పైన తెల్పిన – సర్వజ్ఞత్వాది విశేషణములు గల నీశ్వరునిదప్పించి, మరియొక విధము నుండి అనగా అచేతనమైన ప్రధానమునుండి ( కపిలత సాంఖ్యుల మూలప్రకృతినుండి ) గాని అణువులనుండి ( వైశేషికుల పరమాణువులనుండి ) గాని అభావము ( బౌద్ధుల శూన్యము ) నుండిగాని, సంసారి ( హిరణ్యగర్భుని ) ( పూర్వ మీమాంసికుల ముప్పది ముగ్గురు దేవతల ) నుండిగాని సంభవించినవని ( పుట్టినవని ) చెప్పుటకు శక్యముకాదు మరియు కేవల స్వభావము ' నుండి పుట్టినట్లు కూడ చెప్పవీలులేదు ఏలన ప్రతికార్యమునకు విశేషమైన దేశ, కాల నిమిత్తములున్నట్లు అకారణముగా నేదియు పుట్టుక యున్నట్లు కనప్పటుటచేత

(ఈ) ఇట్లు ( అనుమానము ) యుక్తిచే ప్రదర్శింప ( యథోక్త విశేషణములతోఁగూడిన జగత్తునకు యథోక్త విశేషణములతోఁ గూడిన యీశ్వరుని వలననే యుత్పత్తి స్థితి లయములు గలుగుననుట — యుక్తివాదము ) నీ యుక్తినే ప్రధానముగా జేసికొని యీశ్వర కారణవాదులగు నైయాయికులు సంసారికంటె భిన్నమగు పరమేశ్వరుని యస్తిత్వమును నిరూపించుచున్నారు

(ఉ) ఆక్షేపణము—''జన్మాది సూత్రములోఁ జెప్పఁబడినది మేము సెప్పు యుక్తుల నాశ్రయించినదేగాని శ్రోతది కాదని—నైయాయిక వాదము—( అనగా బ్రహ్మసూత్రములకు అనుమానమే ప్రమాణమగుచున్నదని — యాక్షేపణ )

(ఊ) సమాధానం—న । వేదాంతవాక్యకుసుమ గ్రథనార్థత్వాత్ సూత్రాణాం । వేదాంతవాక్యాని హి సూత్రైరుదాహృత్య విచార్యన్తే । వాక్యార్థవిచారణాధ్యవసాన నిర్వృత్తాహి బ్రహ్మావగతిః । నానుమానాది ప్రమాణాన్తర నిర్వృత్తా ।

(ఋ) సత్సు తు వేదాంత వాక్యేషు జగతో జన్మాది కారణ వాదిషు, తదర్థ గ్రహణ దార్ఢ్యాయ, అనుమానమపి వేదాంతవాక్యా విరోధి ప్రమాణం భవన్ ననివార్యతే। శ్రుత్యైవ చ సహాయత్వేన తర్కస్య అభ్యుపేతత్వాత్ ।

(ౠ) తథాహి— "శ్రోతవ్యో మంతవ్యః" బృ 2–4–5 ఇతి శ్రుతిః । 'పండితో మేధావీ గంధారానేవోపసంపద్యేత, ఏవమేవాహాచార్యవాన్ పురుషో వేద' ఛాం 6–14–2 ఇతి చ పురుష బుద్ధి సాహాయ్య మాత్మనో దర్శయతి ।

(ఊ) సమాధానం—అట్లు కాదు వేదాంత వాక్యములనెడి పూలను కూర్చి మాలగా గ్రుచ్చు దారములే బ్రహ్మ సూత్రములు వేదాంతవాక్యములే సూత్రములచేత నుదహరింపఁబడుచున్నవి వేదాంతవాక్య, తదర్థ విచారణ వలనఁ గలిగెడు నిశ్చయ జ్ఞానముచేకదా బ్రహ్మసాక్షాత్కార ప్రాప్తి అనుమానాది (యుక్తులు, తర్కములు, ఉపమానములు ఇత్యాది) ప్రమాణాంతరములచే బ్రహ్మసాక్షాత్కారము కలుగదు

(ఋ) జగత్తు యొక్క జన్మాదికారణములు తెల్పు వేదాంతవాక్యములు (చాలా) యుండగా, వాని యర్థమును గ్రహించు దార్ఢ్యమునకై అనుమానము (యుక్తి) వేదాంత వాక్యములకు విరోధము లేనిదైనచో ప్రమాణమగుచు త్రోసివేయఁబడదు శ్రుతి కూడ తర్కమును సహాయముగా గొనుటకు నొప్పుకొనుటవలన (యుక్తి యనగా క్రమబద్ధమైన పురుషబుద్ధి)

(ౠ) అటుల యున్న శ్రుతులు— "ఆత్మయే విన తగినది తర్కించ (మననముచేయ) తగినది' బృ 2-4-5 అని శ్రుతి "పండితుఁడున్నూ తెలివిగలవాఁడునునైన వాఁడు గంధారదేశమును తిరిగి చేరునో యెట్లు, (దొంగ లొకని కండ్లుమూతలు గట్టి దూరదేశములకుఁ గొంపోయి యతని సర్వస్వ మపహరించి వదలివేయగా పండితుఁడు, మేధావియు నగు నాతడు బుద్ధిసహాయమున విచారించుచు తిరిగి యింటికి చేరెనని ఛాందోగ్యములో నాఖ్యాయిక) ఇటులనే పురుషుఁడు ఉత్తమాచార్యవంతుడు బ్రహ్మను

## 27 ధర్మ బ్రహ్మజిజ్ఞాసా ప్రమాణాని

(అ) న ధర్మజిజ్ఞాసా యామివ శ్రుత్యాదయ ఏవ ప్రమాణం బ్రహ్మజిజ్ఞాసాయాం । కిం తు శ్రుత్యాదయః అనుభవాదయశ్చ యథాసంభవ మిహ ప్రమాణం, అనుభవావసానత్వాత్, భూతవస్తువిషయత్వా చ్చ బ్రహ్మ జ్ఞానస్య ।

(ఆ) కర్తవ్యేహి విషయే నానుభవాపేక్షాఽస్తీతి శ్రుత్యధీన మేవ ప్రామాణ్యం స్యాత్ ।

(ఇ) పురుషా ధీనాత్మ లాభత్వాచ్చ కర్తవ్యస్య । కర్తు మకర్తుం అన్యథా వా కర్తుం శక్యం లౌకికం వైదికం చ కర్మ । యథాఽశ్వేన గచ్ఛతి, పద్భ్యాం, అన్యథావా నవాగచ్ఛతీతి ।

తెలియగలఁడని బుద్ధి సహాయ మాత్రను గ్రహించుటకు నావశ్యకముగా పై శ్రుతులు తెలుపుచున్నవి

## 27 ధర్మ బ్రహ్మ జిజ్ఞాసల ప్రమాణములు

(అ) ధర్మజిజ్ఞాసయందు శ్రుతులు మాత్రమే ప్రమాణమగునట్లు, బ్రహ్మజిజ్ఞాసయందు కాజాలవు బ్రహ్మజిజ్ఞాసయందు శ్రుతులున్నూ అనుభవాదులు కూడ వీలుననుసరించి (నెప్పుడెప్పు డవసరమో యప్పుడప్పుడు) ప్రమాణమగుచుండును ఎందుకన, బ్రహ్మజిజ్ఞాస అనుభవమే యవసానముగా గలదగుటవలన మరియు, బ్రహ్మజ్ఞానము భూతవస్తు విషయమగుటవలన (సిద్ధమైన బ్రహ్మవస్తువును గురించినదగుటచేత)

(ఆ) కర్తవ్యవిషయమందు (ధర్మజిజ్ఞాసతో కూడిన కర్మకాండయందు) అనుభవాపేక్షము లేదు కావున (శ్రుతి యెట్లు చెప్పునో యట్లు చేయవలసినదే) — శ్రుత్యధీనమే ప్రామాణ్యమగును

(ఇ) చేయవలసిన కర్మ (కర్తవ్యవిషయము) యాగాదులు చేయువానిపై నాధారపడియుండును అందువలననే, లౌకిక వైదికకర్మములు చేయుటకుఁగాని, చేయకుండుటకుఁగాని మరియొకవిధముగా చేయుటకుగాని శక్యములగు గుఱ్ఱముమీదగాని, కాలినడకనగాని, మరియొక విధముగా గాని పోగలడు లేక అసలే పోకుండ గూడ నుండ వచ్చును అటులనే లౌకిక వైదికకర్మలు కూడ—

(ఈ) తథా - అతిరాత్రే షోడశినం గృహ్ణాతి - నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి। ఉదితేజుహోతి అనుదితే జుహోతి । ఇతి

(ఉ) విధిప్రతిషేధాశ్చ అత్రార్థవంతః స్యుః వికల్పో త్సర్గాపవాదాశ్చ। వ్రీహిభిర్యవైర్వాయజేత । నహింస్యాత్ । ఆహవనీయే జుహోతి । అగ్నీషోమీయం పశుమాలభేత । అశ్వస్య పదే పదే జుహోతి ।

(ఊ) న తువస్త్వేవం, నైవం అస్తి నాస్తీతివావికల్ప్యతే। వికల్పనాస్తు పురుష బుద్ధ్యపేక్షాః ।

(ఋ) నవస్తు యాథాత్మ్య జ్ఞానం పురుషబుద్ధ్యపేక్షం। కింతర్హి? వస్తుతంత్రమేతత్। నహిస్థాణావేకస్మిన్ పురుషోఽన్యోవేతి తత్త్వజ్ఞానం భవతి। తత్ర పురుషోఽన్యోవేతి మిథ్యాజ్ఞానం। స్థాణురేవేతి తత్త్వజ్ఞానం వస్తుతంత్రత్వాత్। ఏవం భూత వస్తు విషయాణాం ప్రామాణ్యం వస్తు తంత్రమ్।

(ఈ) అతిరాత్రమను క్రతువునందు గ్రహమును (సోమ పానపాత్రను) (షోడశి యని దాని పేరు) గ్రహింపవచ్చును లేక గ్రహింపకపోవచ్చును మరియొకచోట సూర్యోదయము తర్వాత హోమము చేయవచ్చును తత్పూర్వము హోమము చేయవచ్చును (ఇటుల వైకల్పిక విధులు గలవు)

(ఉ) ఇటులనే కర్మకాండలో విధులు, నిషేధములు అటులనే వికల్పములు ఉత్సర్గములు (సామాన్య ధర్మములు) అపవాదములు సార్థకములగును వడ్లచేతఁగాని, యవలచే గాని యజింపుము (వైకల్పికవిధి) హింసచేయరాదు (ఉత్సర్గనిషేధవిధి) ఆహవనీయాగ్నియందు హోమము చేయవలెను (ఉత్సర్గవిధి) అగ్నిషోమ క్రతువునందు పశువును హింసింపవలెను (అపవాద విధి) అశ్వముయొక్క పాద పాదమందు హోమము సేయవలె (క్రమవిధి)

(ఊ) పై తెల్పిన వికల్పాదులు సిద్ధవస్తు విషయమందు కుదురఁజాలవు "ఈవస్తు విట్టిది, ఇట్టిదికాదు' అనిగాని ఉన్నది లేదు అనిగాని, వికల్పముల కిచట తావులేదు వికల్పములు కర్తయొక్క బుద్ధి నపేక్షించి యుండగలవు

(ఋ) వస్తువుయొక్క యాథాత్మ్యము (నిజరూప తత్త్వాదులు) పురుషునియొక్క బుద్ధి నపేక్షించి యుండదు మరి ఇది వస్తుతంత్రము కాబట్టి ఉదా ఒకానొక మోడునుఁ (చీకటిపడు సమయమందు) జూచి, "ఇది పురుషుఁడా లేక మరొకటియా? 'యనునది నా రాతిగుండునుఁ గూర్చిన తత్త్వజ్ఞానము (యథార్థజ్ఞానము) కాదు అచ్చట "ఇది

తత్రైవం సతి బ్రహ్మజ్ఞానమపి వస్తుతంత్రమేవ భూతవస్తు విషయత్వాత్ ।

(ఋ) ఆక్షేపః — నను భూతవస్తుత్వే బ్రహ్మణః ప్రమాణాంతర విషయత్వమేవేతి వేదాంతవాక్యవిచారణా ఽనర్థికైవ ప్రాప్తా ?

(ౠ) సమాధానం — న । ఇంద్రియా విషయత్వేన, సంబంధాగ్రహణాత్ । శ్రుతిరత్ర —

కఠ — పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః
తస్మాత్ పరాఙ్ పశ్యతి, నాంతరాత్మన్ ।

(ఌ) స్వభావతో బహిర్విషయ విషయాణీంద్రియాణి, న బ్రహ్మవిషయాణి । సతి హీంద్రియ విషయత్వే బ్రహ్మణః, ఇదం బ్రహ్మణా సంబద్ధం కార్యమితి గృహ్యేత । కార్యమాత్రమేవతు గృహ్యమాణం కిం బ్రహ్మణా సంబద్ధం,

పురుషుఁడా, ఇతరుఁడా?' యను భావము మిథ్యాజ్ఞాన మందురు "ఇది కొయ్యమోడే' యనుట తత్త్వజ్ఞానం బగును ఏలన, అట్టి జ్ఞానము వస్తుతంత్రం బగుటవలన (ఉన్నవస్తు వున్నట్లుగాఁ దెలియుట వస్తుతంత్రము — అన్యముగాఁ దెలియుట పురుషతంత్రము) ఈవిధముగా, భూత వస్తు విషయముల (భూత = సిద్ధమైన) ప్రామాణ్యము వస్తుతంత్రమే ఇది యిట్లుండఁగా, బ్రహ్మజ్ఞానము కూడ వస్తుతంత్రమే ఏలన, భూత (సిద్ధమైన) వస్తువిషయ మగుట వలన

(ఋా) ఆక్షేపణ — ఏమండీ! బ్రహ్మము ఇదివరకే సిద్ధించిన (భూత) వస్తువైనచో అనుమానాది ప్రమాణాంతర ములవలన తెలియును కాన వేదాంతవాక్యవిచారణ యనర్థకమగునేమో?

(ౠ) సమాధానము — అటులకాదు బ్రహ్మము ఇంద్రియములకు విషయముకాని వస్తువు (అతీంద్రియము) కావున ఇంద్రియాదులతో సంబంధము లేదు కఠశ్రుతి యిట్లున్నది — స్వయంభువు (బ్రహ్మ) ఇంద్రియములను బహిర్ముఖములుగా నిర్మించినాడు కాన, ఇంద్రియములు బాహ్యములనే గ్రహింపఁగలవు అంతరాత్మను గ్రహింపఁ జాలవు

(ౠా) స్వభావముగా, ఇంద్రియములు బయటి విషయ ములనే గ్రహించును అంతరాత్మ (బ్రహ్మ) ను గ్రహింపఁ జాలవు బ్రహ్మను ఇంద్రియములు గ్రహింపఁ గలిగినచో ఇది (ఈ జగత్తు) బ్రహ్మవలన సంబద్ధమైన కార్యమని

కిమన్యేన కేనచిద్వా సంబద్ధం ఇతి న శక్యం నిశ్చేతుం। తస్మాత్ జన్మాదిసూత్రం నానుమానోపన్యాసార్థమ్। కింతర్హి? వేదాంతవాక్య ప్రదర్శనార్థమ్।

## 28 సూత్రలక్షిత వేదాంత వాక్యాని

(అ) కిం పునస్తద్వేదాంతవాక్యం యత్సూత్రేణేహ లిలక్షయిషితం? "భృగుర్వై వారుణిః। వరుణం పితరముపససార। అధీహి భగవో బ్రహ్మేతి" ఇత్యుపక్రమ్య ఆహ—"యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవంతి, యత్ప్రయన్త్యభి సంవిశన్తి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మేతి।" తై 3-1 తస్యచ నిర్ణయ వాక్యం—"ఆనందాద్ధ్యేవ ఖల్విమానిభూతాని జాయంతే, ఆనందేన జాతాని జీవన్తి, ఆనందం ప్రయన్త్యభి సంవిశన్తీతి" (తైత్తి 3-6)

(మృత్తిక ఘటాదులవలె ప్రత్యక్షముగా) నిశ్చయించుటకు వీలుండెడిది ప్రత్యక్షాది ప్రమాణముచే గ్రహింపబడుచున్న కార్య సామాన్యము (జగత్తు) బ్రహ్మతో సంబద్ధమా, లేక మరియొక దానితోనా యని నిశ్చయించుటకు శక్యమగుట లేదు కావున 'జన్మాద్యస్యయత అను సూత్రము అనుమాన ప్రమాణముచే బ్రహ్మను చెప్పుటకు బయలుదేర లేదు మరి బ్రహ్మను చెప్పు వేదాంతవాక్యమును ప్రదర్శించుటకు చెప్పఁబడినది

## 28 సూత్రసూచిత వేదాంతవాక్యములు

(అ) మరి యిచట సూత్రముచే లక్షింపఁ (సూచింప) గోరిన యా వేదాంత వాక్య మెద్ది? తైత్తిరీయములో 3-1లో 'భృగుర్వై వారుణిః' తో ప్రారంభించి 'యతోవా ఇమాని తద్బ్రహ్మేతి' వరకు

భృగువు వరుణ వంశస్థుఁడు తండ్రియగు వరుణుని సమీపించెను "భగవానుఁడా బ్రహ్మను గురించి బోధింపు" మని వేడెను అతని కిట్లు (వరుణుఁడు) చెప్పెను "ఈ భూతము లన్నియు దేనివలన బుట్టుచున్నవో, దేనిచే బుట్టిన భూతములు జీవించుచున్నవో, దేనియందు తిరిగి ప్రవేశించు చున్నవో దాని గురించి తెలియఁగోరుము అదియే బ్రహ్మ యని ఆ అర్థమును నిర్ణయించు వాక్య మిది—" ఆనందము నుండియే యీ భూతములు పుట్టుచున్నవి పుట్టినవి ఆనందము చేతనే జీవించుచున్నవి ఆనందమునే చేరుచున్నవి' అనునది

28 (అ) అన్యాన్యపి ఏవం జాతీయకాని వాక్యాని నిత్య శుద్ధ ముక్త స్వభావ సర్వజ్ఞ స్వరూప కారణ విషయాణి ఉదాహర్తవ్యాని ।

## 3 శాస్త్రయోనిత్వాధికరణమ్

29 అవతారికా — జగత్కారణత్వ ప్రదర్శనేన సర్వజ్ఞం బ్రహ్మేత్యుపక్షిప్తం, తదేవ ద్రఢయన్నాహ ।

3-వ సూత్రము—శాస్త్రయోనిత్వాత్ ।

(1) శాస్త్రస్య యోనిత్వాత్ (షష్ఠీతత్పురుష)

(2) శాస్త్రం యోనిః = కారణం (ప్రమాణం) యస్య తత్ (బహువ్రీహి)

## 1 ప్రథమ వర్ణకం

షష్ఠితత్పురుషః - లక్షణపరార్థః

పూరణం—సర్వజ్ఞం బ్రహ్మభవతి

వృత్తిః—అస్యమహతో భూతస్యేతి శ్రుతి ప్రామాణ్యాత్ బ్రహ్మవేదం ప్రతి కారణం భవతి-అత ఏవ సర్వజ్ఞం ।

28 (అ) ఈవిధములగు ఇతర వేదాంత వాక్యములను నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావమును, సర్వజ్ఞ స్వరూపమును నగు జగత్ కారణమునుఁ దెల్పునట్టివానిని (వేదము నుండి) నుదాహరింపనగును

## 3 శాస్త్రయోనిత్వాధికరణము

29 అవతారిక — పూర్వసూత్రములో సర్వజగత్తుకు కారణము బ్రహ్మయని చెప్పుటచేత బ్రహ్మయొక్క సర్వజ్ఞత్వము చెప్పబడినట్లే యయినది ఆ భావమునే దృఢ పరచుచూ ఆచార్యులవారు చెప్పుచున్నారు

3–వ సూత్రము — **శాస్త్రయోనిత్వాత్**

ఈ సూత్రమునకు రెండు విధములుగా వివరణ కుదురును మొదటిది లక్షణ పరము, రెండవది ప్రమాణ పరము

(1) లక్షణ పరము — శాస్త్రమునకు కారణమగుటవలన (షష్ఠీతత్పురుష)

(2) ప్రమాణపరము — శాస్త్రము ప్రమాణముగాగలదగుట వలన దేని జగత్ కర్తృత్వాదికము (స్వరూపము) తెలియనగునో నది బ్రహ్మ (బహువ్రీహి)

### 1 ప్రథమవర్ణకము

షష్ఠీతత్పురుష - లక్షణ పరార్థము

పూరణము — బ్రహ్మ సర్వజ్ఞమగుచున్నది

వృత్తి — "అస్యమహతో భూతస్య" యను శ్రుతి ప్రమాణము వలన బ్రహ్మము వేదమునకు కారణ మగును అందుచేతనే సర్వజ్ఞత్వము బ్రహ్మమునకు సిద్ధించును

పంచావయవాః —

(1) విషయః—బ్రహ్మణః సర్వజ్ఞత్వం-1 విషయవాక్యం - "అస్యమహతో భూతస్య నిఃశ్వసితమేవ ఏతత్ యదృగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాంగిరస" ఇతి (బృ 4-4-10)

(2) సంశయః—వేదస్య కర్తృ బ్రహ్మవా, నవా?

(3) పూర్వపక్షః—న కర్తృతత్, విరూపనిత్యయా వాచేత్యేవం వేదస్య నిత్యత్వ కీర్తనాత్

(4) సిద్ధాంతః—బ్రహ్మ తస్య కర్తృ నిశ్వసితాద్యుక్తేః నిత్యత్వం పూర్వ సామ్యతః, సర్వావభాసి వేదస్య కర్తృత్వాత్ సర్వవిద్భవేత్

(5) సంగతిః—పూర్వసూత్రే బ్రహ్మణః సర్వశక్తిమత్వముక్తం-వినా సర్వజ్ఞత్వేనతత్ కథంఘటేత్ ఇత్యాక్షేప సంగతిః ।

30 (అ) మహతః ఋగ్వేదాదేః శాస్త్రస్య అనేక విద్యాస్థానోప బృంహితస్య ప్రదీపవత్ సర్వార్థావద్యోతినః సర్వజ్ఞకల్పస్య యోనిః కారణం బ్రహ్మ ।

**పంచావయములు**

(1) విషయము — బ్రహ్మము యొక్క సర్వజ్ఞత్వము— విషయవాక్యము— "అస్య మహతో భూతస్య నిశ్వసితమేవ ఏతత్ యదృగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వాంగిరస ఇతి ' (బృ 4-4-10)

(2) సంశయము —వేదమునకు కర్త బ్రహ్మ మగునా, కాదా?

(3) పూర్వపక్షము—వేదమునకు బ్రహ్మ కర్తకాదు ఏలన "విరూప నిత్యయా వాచా" యను శ్రుతి వాక్యముచేత నిత్యత్వము వేదమునకు చెప్పఁబడినది గావున

(4) సిద్ధాంతము—వేదము బ్రహ్మముయొక్క నిశ్వసితమని శ్రుతివాక్య మున్నది గాన దానికి బ్రహ్మకర్త పూర్వసామ్యమువలన నది నిత్యము సమస్తమును భాసింపఁజేయు వేదమునకు కర్తృత్వము బ్రహ్మమున కుండుటచేత బ్రహ్మము సర్వవిత్ అయియుండవలెను

(5) సంగతి—పూర్వసూత్రంబున బ్రహ్మమునకు సర్వశక్తిమత్వమే చెప్పఁబడెను సర్వజ్ఞత్వము లేకుండ అది యెట్లు ఘటిల్లును యను నాక్షేపసంగతి ప్రాప్తించుటచే యీ సూత్రమునకు ఆవశ్యకత ఏర్పడినది.

30 (అ) గొప్పదైన ఋగ్వేదాదిరూపమై (ఋక్, యజుస్సామాథర్వములు), (మంత్ర బ్రాహ్మణో పనిషత్తులను మూడంతర్భాగములు), శాస్త్రములు (పురాణ న్యాయ

(అ) న హీ దృశస్య శాస్త్రస్య ఋగ్వేదాది లక్షణస్య సర్వగుణాన్వితస్య సర్వజ్ఞాదన్యతః సంభవోఽస్తి। యద్యద్విస్తరార్థం శాస్త్రం యస్మాత్ పురుష విశేషాత్ సంభవతి, యథావ్యాకరణాది పాణిన్యాదేః జ్ఞేయైక దేశార్థమపి, సతతో ప్యధికతర విజ్ఞానః, ఇతి ప్రసిద్ధం లోకే।

(ఇ) కిమువక్తవ్యం, అనేక శాఖా భేద భిన్నస్య దేవ తిర్యఙ్మనుష్య వర్ణాశ్రమాది ప్రవిభాగహేతోః ఋగ్వేదాద్యాఖ్యస్య సర్వజ్ఞానాకరస్య అప్రయత్నేనైవ లీలాన్యాయేన పురుష నిశ్వాసవత్ యస్మాత్ మహతో భూతాద్యోనేః సంభవః "అస్య మహతో భూతస్య నిశ్వసితమేతత్ ఋగ్వేద" ఇత్యాది శ్రుతేః, తస్యమహతో భూతస్య నిరతిశయం సర్వజ్ఞత్వం సర్వశక్తిమత్త్వం చేతి।

మీమాంసా ధర్మములను చతుశ్శాస్త్రములు) (శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందో, జ్యోతిషములనే షడంగములు ) ఇట్టి విద్యాస్థానములచేత వృద్ధిచెందిన జ్యోతిర్మండలమువలె సర్వవిషయములనుఁ బ్రకాశింపఁ జేయునదై సర్వజ్ఞకల్పమైన శాస్త్రమునకు కారణము (రచన కర్త) బ్రహ్మయే

(ఆ) ఋగ్వేదాది రూపమై, సర్వగుణములుకల యిట్టి శాస్త్రము యొక్క పుట్టుక సర్వజ్ఞుని వలనఁగాక మరియొకనినుండి కల్గుట యసంభవము జ్ఞేయైక దేశమును బోధించు వ్యాకరణాది శాస్త్రము పాణిని మున్నగువారినుండి వలె విస్తరార్థముగల యేయే శాస్త్రమే పురుషుని నుండి పుట్టుచున్నదో యా శాస్త్రముకన్న దాని కర్తయగు మహాపురుషుఁడే అధిక విజ్ఞాన సంపత్తి గలవాఁడనుట లోక ప్రసిద్ధము

(ఇ) ఋగ్వేదము పది శాఖలు పదునైదు శాఖలు శుక్లయజుర్వేదము, ఎనుబది యారు శాఖలు కృష్ణయజుర్వేదము, వేయిశాఖలు సామవేదము—ఇట్లు శాఖాభేదములతో భిన్నమై దేవ, పశు పక్షి, మనుష్య వర్ణాశ్రమాది విభాగ హేతువై, సమస్త జ్ఞానమునకు నిధియై యొప్పు ఋగ్వేదాది రూప శాస్త్రము ప్రయత్న రహితముగా, లీలగా పురుషుని నిశ్వాసమువలె, యే మహా భూతమగు కారణమునుండి బయల్వెడలుట "అస్యమహతో ఋగ్వేద శ్రుతి ప్రమాణమువలన నేర్పడుచున్నదో, అట్టి మహత్తు గల సిద్ధవస్తువైన బ్రహ్మయొక్క సర్వజ్ఞత్వము (అన్ని నెరిగి

## 2 ద్వితీయవర్ణకం

### 31 (అ) బహువ్రీహిః-ప్రమాణపరార్థః

సూత్రమ్—శాస్త్రయోనిత్వాత్

పూరణం—ఔపనిషదం బ్రహ్మ

వృత్తి—యతో వా ఇమాని భూతాని జాయంత ఇత్యాదినా బ్రహ్మణః శ్రుతిప్రమాణ సిద్ధత్వాత్, న తార్కికాభి విశేషః, ఔపనిషదత్వభంగో వా ।

31 (ఆ) అథవా యథోక్తం ఋగ్వేదాది శాస్త్రం యోనిః కారణం ప్రమాణమస్య బ్రహ్మణో యథావత్ స్వరూపాధిగమే । శాస్త్రాదేవ ప్రమాణాత్ జగతో జన్మాది కారణం బ్రహ్మ అధిగమ్యతే-ఇత్యభిప్రాయః । శాస్త్ర ముదాహృతం పూర్వసూత్రే— "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవన్తి యత్ప్రయంత్యభిసం విశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి" (తై 3-1)

యుండుట ) సర్వశక్తిమత్వము (అన్నిశక్తులు కలిగి యుండుట ) నిరతిశయము ( అంతకంటె మించి మఱి యొకటి లేనిది ) అని చెప్పవలయునా ? (పై శ్రుతిచేత బ్రహ్మయొక్క సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వములు చెప్పబడుచున్నవని తాత్పర్యము )

## 2 ద్వితీయవర్ణకము

### 31 (అ) బహువ్రీహి—ప్రమాణపరమగు నర్థము

సూత్రము—శాస్త్రయోనిత్వాత్

పూరణము—బ్రహ్మ ఉపనిషద్వేద్యము

వృత్తి—"ఈ భూతములు దేనినుండి పుట్టుచున్నవో మున్నగు శ్రుతి ( ఉపనిషద్వాక్య ) ప్రమాణమువలన బ్రహ్మ సిద్ధమగుచుండుటవలన తార్కికులు చెప్పినట్లు అనుమానాది ఇతర ప్రమాణసిద్ధముగాదు బ్రహ్మ ఉపనిషత్ప్రతిపాద్య మనుటకు భంగమున్ను లేదు

31 (ఆ) లేదా (పైన చెప్పిన యర్థముగాక మరి యొక విధముగా చెప్పఁదగి యున్నది) ఋగ్వేదాది శాస్త్రము యోని కారణము ప్రమాణము ఐయున్నది ( దేనికి ? ) బ్రహ్మము యొక్క యథార్థస్వరూపము నెరుగుటకు ( ప్రత్యక్ష, అనుమానాదులవలనగాక, కేవలము వేద ప్రమాణము వలననే బ్రహ్మ నెరుగనైనది ) శాస్త్ర ప్రమాణము వలననే జగత్తు యొక్క జన్మాది కారణమైన బ్రహ్మము తెలియబడునని అభిప్రాయము పూర్వసూత్రమందు "యతోవా ఇమాని" అని బ్రహ్మను గురించిన శాస్త్ర ముదాహరింపబడినది

(ఇ) పూర్వపక్షః — కిమర్థం తర్హీదం సూత్రం, యావతా పూర్వసూత్రేణ, ఏవం జాతీయకం శాస్త్రం ఉదాహరతా, శాస్త్రయోనిత్వం బ్రహ్మణో దర్శితం

(ఈ) సమాధానం—ఉచ్యతే—తత్రపూర్వసూత్రాక్షరేణ విస్పష్టం శాస్త్రస్య అనుపాదానాత్ జన్మాది సూత్రేణ కేవలం అనుమానం ఉపన్యస్త మితి ఆశంక్యేత। తామాశంకాం నివర్తయితుం ఇదం సూత్రం ప్రవవృతే 'శాస్త్రయోనిత్వాత్' ఇతి

## 4 సమన్వయాధికరణమ్

### 32 భాట్టీయ పూర్వపక్షః

(అ) కథం పునర్బ్రహ్మణః శాస్త్ర ప్రమాణకత్వముచ్యతే — యావతా "ఆమ్నాయస్య క్రియార్థత్వాత్ ఆనర్థక్యం అతదర్థానాం" (జై సూ 1-2-1) ఇతి క్రియాపరత్వం శాస్త్రస్య ప్రదర్శితం।

(ఇ) పూర్వపక్షము—ఎందుకై యీ సూత్రము అరిగి చెప్పఁబడినది ? పూర్వసూత్రముచే యీ జాతీయక ( విధ ) మైన ( బ్రహ్మజగత్కారణం ) శాస్త్రము నుదాహరించుచు శాస్త్రయోనిత్వము బ్రహ్మకుఁ జూపఁబడినదిగదా !

(ఈ) సమాధానము—చెప్పబడుచున్నది పూర్వ సూత్ర మందు సూత్రాక్షరములచే స్పష్టముగా శాస్త్రము చెప్పఁబడనందువల్ల కేవలము జన్మాది సూత్రముచే ననుమానప్రమాణము మాత్రమే యుపన్యసింపఁబడినది యని శంక కలుగవచ్చును అట్టి శంకను నివర్తించుటకు నీ సూత్రము ( శాస్త్రయోనిత్వాత్ ) ప్రవర్తించినది

## 4 సమన్వయాధికరణము

### 32 భాట్టీయుల పూర్వపక్షము

(అ) పూర్వ మీమాంసాకారుఁడైన జైమిని శిష్యుఁడైన కుమారిలభట్టు యొక్క యనుయాయులు "భాట్టు లను వారు, 'శాస్త్రయోనిత్వాత్' అను సూత్ర ముపైఁ జేయు నాక్షేపణ సంగ్రహమిది

బ్రహ్మనుఁ దెలియుటకు వేదమే ప్రమాణమని నిర్వ చించుటెట్లు ? ( హేతువు చెప్పఁబడుచున్నది ) జైమినీ సూత్రమునందు (1-2-1) "వేదమంతయు క్రియాపరమే యగుటం జేసి, క్రియాపరములుగాని వాక్యములు నిష్ప్రయో జనములు ( అనర్థకములు ) " అని క్రియాపరత్వమే ( శాస్త్రస్య ) వేదమునకు బ్రదర్శింపఁబడినది.

(ఆ) అతో వేదాంతానాం ఆనర్థక్యం, అక్రియార్థత్వాత్। కర్తృదేవతాది ప్రకాశ నార్థత్వేన వా క్రియా విధిశేషత్వం ఉపాసనాది క్రియాన్తర విధానార్థత్వం వా।

(ఇ) న హి పరినిష్ఠిత వస్తు ప్రతిపాదనం సంభవతి, ప్రత్యక్షాది విషయత్వాత్ పరినిష్ఠిత వస్తునః। తత్ప్రతిపాదనే చ హే యోపాదేయ రహితే పురుషార్థా భావాత్।

(ఈ) అత ఏవ "సో౽రోదీత్" ఇత్యేవమాదీనాం ఆనర్థక్యం మాభూత్ ఇతి "విధినాత్వేక వాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాం స్యుః" జై సూ 1-2-7 ఇతి స్తావకత్వేన అర్థవత్వ ముక్తమ్। మంత్రాణాంచ 'ఇషేత్వా' ఇత్యాదీనాం క్రియాతత్సాధనాభిధాయిత్వేన కర్మ సమవాయిత్వ ముక్తమ్।

(ఆ) కావున వేదాంతములు సిద్ధవస్తుబోధకంబులగుటం జేసి యరర్థ్యవి నిరర్థకములు ఏలన ? క్రియార్థత్వము లేమిం జేసి (ఇటులఁ జెప్పుటచే నుపనిషత్తులకుఁ బ్రయోజన శూన్యత ప్రాప్తించుఁగాన భాట్టులు ప్రయోజన మొకటిఁ గల్పించుచున్నారు ఏమని ?) వైదికకర్మలకు సంబంధించిన కర్తృ (యజమాన) దేవతా స్వరూపములఁ బ్రకాశింపఁజేయుట వలన క్రియావిధిశేషత్వము వేదాంతములకుఁ బ్రయోజనము కలుగవచ్చును లేదా ఉపాసనాది క్రియాంతరములను విధించుటవలననూ వేదాంతములకుఁ బ్రయోజనము గలుగవచ్చును

(ఇ) పరినిష్ఠితవస్తు ప్రతిపాదనము (నిత్యసిద్ధమైన వస్తువును గురించి శాస్త్రము క్రొత్తగా ప్రతిపాదించుట) ఎప్పుడును కూడనిపని ఏలన ? సిద్ధవస్తువు ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరించుటవలన (ఇక శాస్త్రము క్రొత్తగాఁ జెప్పవలసిన పనిలేదని తాత్పర్యము) ఒకవేళ సిద్ధ వస్తువును గురించి ప్రతిపాదించినదని యొప్పుకొనినచో, నచ్చట హేయోపాదేయములు లేనందున నెట్టి పురుషార్థము సిద్ధింపదు కాబట్టి (అనిష్ట నివృత్తి హేయము - ఇష్ట ప్రాప్తి ఉపాదేయము)

(ఈ) హేయోపాదేయములు గన్పట్టని కర్మకాండ లోని యర్థవాదవాక్యములకు (ఉదా) సోఽరోదీత్ (అతఁడు (అగ్ని) ఏడ్చెను) ఇత్యాదులకు అనర్థకత్వమును వారించుటకు అర్థవాదవాక్యములు విధులచే చెప్పబడు యాగాదుల స్తుతి రూపార్థముచే విధి వాక్యముతో సమన్వితములగుటవలన ప్రమాణములగునను సూత్రముచే, స్తుత్యర్థముతో

(ఉ) నక్వచిదపి వేదవాక్యానాం విధి సంస్పర్శ మంతరేణ అర్థవత్తా దృష్టా, ఉపపన్నా వా। నచ పరినిష్ఠితే వస్తుస్వరూపే విధిః సంభవతి క్రియావిషయత్వాత్ విధేః। తస్మాత్ కర్మాపేక్షిత కర్తృస్వరూప దేవతాది ప్రకాశనేన క్రియావిధి శేషిత్వం వేదాంతానాం

(ఊ) అథ ప్రకరణాంత భయాత్ నైతదభ్యుప గమ్యతే, తథాపి స్వవాక్యగతోపాసనాది కర్మ పరత్వం। తస్మాన్న బ్రహ్మణం శాస్త్రయోనిత్వ మితిప్రాప్తే—ఉచ్యతే।

నర్థవత్వము జెప్పఁబడినది ఇక మంత్రములలో ఉదా "ఇషే త్వా " = ఆహారము నకై నిన్ను, ఇత్యాది వాక్యములకు నానర్థక్యమును వారించుటకై ( హేయోపాయరహిత త్వాత్ ), క్రియలను, క్రియలకుఁ దగు సాధనములను, బోధించుటచేతఁ గ్రియతోఁ గూడినవై ప్రమాణభావమును బొందుట చెప్పఁబడినది

(ఉ) వేదవాక్యముల కొకప్పుడైననూ విధితో సంబంధము లేక ప్రయోజన మెంతమాత్రము జూడఁబడదు మరిన్ని యుచితము గూడఁ గాదు సిద్ధవస్తుస్వరూపము సెప్పుట యందు విధి సంభవింపనే సంభవింపదు కదా ! ఏలన విధి, క్రియావిశేషముగనే యుండవలెను గాఁబట్టి కావున వేదాంతములు విధి విహితములగు కర్మలచే నపేక్షింపఁబడు కర్తృదేవతాది స్వరూపములనుఁ బ్రకాశింపఁజేయుటచేత, క్రియావిధుల కంగము లగుటద్వారా ప్రమాణము లగుచున్నవి

(ఊ) ఈ పై తెల్పినట్టి సమన్వయము ప్రకరణాంతర ( అనగా వేదాంతములు కర్మప్రకరణములోనివి కావను ) భయమువలన అంగీకృతము కాదేని ( వేదాంతములు క్రియావిధిశేషములు గాకపోయినను ) వేదాంత ప్రకరణము లందుఁ దెల్పఁడి యుపాసనాదికర్మఫలములైననుఁ గావచ్చును కావున బ్రహ్మమునకు శాస్త్రయోనిత్వము ( వేదముచేతనే యెరుగఁబడుట ) ఘటింపదని - పూర్వపక్షము ప్రాప్తించుచుండగా - సమాధానము చెప్పఁబడుచున్నది

నర్థవత్త్వము జెప్పఁబడినది ఇక మంత్రములలో ఉదా "ఇషే త్వా ' = ఆహారమునకై నిన్ను, ఇత్యాది వాక్యములకు నానర్థక్యమును వారించుటకై (హేయోపాయరహిత త్వాత్ ), క్రియలను, క్రియలకుఁ దగు సాధనములను, బోధించుటచేతఁ గ్రియతోఁ గూడినవై ప్రమాణభావమును బొందుట చెప్పఁబడినది

(ఉ) వేదవాక్యముల కొకప్పుడైననూ విధితో సంబంధము లేక ప్రయోజన మెంతమాత్రము జూడఁబడదు మరిన్ని యుచితము గూడఁ గాదు సిద్ధవస్తుస్వరూపము సెప్పుట యందు విధి సంభవింపనే సంభవింపదు కదా ! ఏలన విధి, క్రియావిశేషముగనే యుండవలెను గాఁబట్టి కావున వేదాంతములు విధి విహితములగు కర్మలచే నపేక్షింపఁబడు కర్తృదేవతాది స్వరూపములనుఁ బ్రకాశింపఁజేయుటచేత, క్రియావిధుల కంగము లగుటద్వారా ప్రమాణము లగుచున్నవి

(ఊ) ఈ పై తెల్పినట్టి సమన్వయము ప్రకరణాంతర (అనగా వేదాంతములు కర్మప్రకరణములోనివి కావను) భయమువలన అంగీకృతము కాదేని (వేదాంతములు క్రియావిధి శేషములు గాకపోయినను) వేదాంత ప్రకరణములందుఁ దెల్పెడి యుపాసనాదికర్మఫలములైననుఁ గావచ్చును కావున బ్రహ్మమునకు శాస్త్రయోనిత్వము (వేదముచేతనే యెరుగఁబడుట) ఘటింపదని - పూర్వపక్షము ప్రాప్తించుచుండగా - సమాధానము చెప్పఁబడుచున్నది

# 4-1 సమన్వయాధికరణమ్

## ప్రథమవర్ణకం

### 33 సూ 4 తత్తుసమన్వయాత్

పదవిభాగః — తత్ - తు - సమన్వయాత్

పూరణం — న ప్రకరణాంతరగత కర్త్రాది శేషం ।

వృత్తిః — ఆమ్నాయానాం క్రియార్థత్వ నియమాభావాత్ బ్రహ్మణి సమ్యగన్వయాచ్చ బ్రహ్మ, శ్రుతి ప్రమాణకమేవ । న ప్రకరణాంతరగత కర్త్రాది శేషం ।

పంచావయవాః

(1) విషయః — వేదాంతాః సర్వే సాక్షాత్ బ్రహ్మ బోధకాః । సర్వవేదాంత ప్రకరణం విషయవాక్యం।

(2) సంశయః — వేదాంతా బ్రహ్మపరావా ? కర్మప్రకరణ గత కర్తృదేవతాది స్తావకావా ?

# 4-1 సమన్వయాధికరణము

## ప్రథమవర్ణకము

## 4-వ సూత్రము – "తత్తుసమన్వయాత్"

పదవిభాగము తత్ – తు – సమన్వయాత్ (ఆ బ్రహ్మము – అయితే – సమన్వయమువలన వేదైకవేద్యమే)
పూరణము బ్రహ్మము ప్రకరణాంతరమందున్న (ఇతర ప్రకరణమైన కర్మకాండయందున్న) కర్తృ, దేవతా, సాధనాంతరములకు సంబంధించినది కాదు

వృత్తి—కర్మకాండయందున్న ఆమ్నాయములకున్న నియమములు బ్రహ్మవిషయకశాస్త్రమందు లేవుగాన చక్కగా షడ్విధ లింగములచే సమన్వయము చేయుటవలన బ్రహ్మము శ్రుతిప్రమాణకమే యగును ఇతర ప్రకరణ మందున్న కర్మలతో బ్రహ్మను ముడిబెట్టరాదు

పంచావయములు

(1) విషయము —సర్వవేదాంతములు సాక్షాత్ బ్రహ్మబోధకములు సమస్తవేదాంతోపనిషత్ ప్రకరణమంతయు ఇచ్చట విషయవాక్య మగును

(2) సంశయము—వేదాంతములు బ్రహ్మపరములా, లేక కర్మకాండయందున్న కర్తృ, దేవతాదిస్తావకములా?

(3) పూర్వపక్షః—కర్మకాండవత్ బ్రహ్మకాండమపి క్రియా విధాయకమేవ। సిద్ధవస్తు బోధకం చేత్ అప్రమాణం భవేత్। తస్మాత్ వేదాంతశాస్త్రం ప్రకరణాంతరగత కర్తృదేవతాదిస్తావకమేవ। న బ్రహ్మబోధకం।

(4) సిద్ధాంత—షడ్విధ తాత్పర్య లింగైః సమన్వయాత్ వేదాంతాః బ్రహ్మబోధకాః ముక్తిఫలకాశ్చ అజ్ఞాత జ్ఞాపకత్వాత్ ప్రమాణాన్యేవ।

(5) సంగతి— పూర్వసూత్రే బ్రహ్మవేదైకవేద్య మిత్యుక్తం। పూర్వమీమాంసా శాస్త్రాత్ వేదః కర్మ బోధకః। కథం బ్రహ్మబోధకో భవేత్ ఇతి ఆక్షేప సంగతిః।

34 'తు' శబ్ద పూర్వపక్షవ్యావృత్త్యర్థః। తద్బ్రహ్మ సర్వజ్ఞం సర్వశక్తి జగదుత్పత్తి స్థితి లయకారణం వేదాంత శాస్త్రాదేవావగమ్యతే। కథం? సమన్వయాత్। సర్వేషుహి వేదాంతేషు వాక్యాని తాత్పర్యేణ, ఏతస్యార్థస్య ప్రతిపాదకత్వేన సమనుగతాని।

(3) పూర్వపక్షము — కర్మకాండవలె బ్రహ్మకాండ కూడ క్రియను విధించునదియే అట్లుగాక కేవలము సిద్ధవస్తు బోధకమైనచో వేదాంత మప్రమాణంబగు కాన వేదాంతశాస్త్రము ప్రకరణాంతరగత కర్తృదేవతాదుల స్తావకమే కాని బ్రహ్మబోధకము కాదు

(4) సిద్ధాంతము—షడ్విధ తాత్పర్య లింగములతో సమన్వయించుటవలన వేదాంతములు బ్రహ్మ బోధకములగు ముక్తిఫలదములుకూడ ప్రమాణాంతరములచే అజ్ఞాతములకు జ్ఞాపకము లగుటచేత ప్రమాణంబు లగును

(5) సంగతి—పూర్వసూత్రము (శాస్త్రయోనిత్వాత్)నందు బ్రహ్మవేదైకవేద్యమని చెప్పఁ బడినది పూర్వమీమాంసా శాస్త్రానుసారము వేదము కర్మ బోధకము అగుచో బ్రహ్మబోధకము వేద మెట్లగును? అని ఆక్షేప సంగతి

34 'తు' యను శబ్దము పూర్వపక్ష నిరాసార్థము (అనగా పూర్వపక్షమును నిరసించుననిభావము పూర్వపక్ష వాదమును ఛీ యని తిరస్కరించుట) తద్ = సర్వజ్ఞము సర్వశక్తిమంతము, జగత్తుయొక్క యుత్పత్తి స్థితి లయములకు కారణమును నగు బ్రహ్మము వేదాంతశాస్త్రమువలననే తెలియవచ్చుచున్నది అది యెటుల? సమన్వయాత్-సకల వేదాంతములందునుఁ దెలియవచ్చెడి వాక్యములఁ దాత్పర్యము ఆబ్రహ్మమునందే సమన్వయించుటచే అనగా షడ్విధ లింగములచే యోజించినచోనీయర్థమే ప్రాప్తించుననిభావము

35 (అ) ఉదాహృతాని వాక్యాని చతుర్వేదేషు।

1 సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్। ఏకమేవా ద్వితీయం।
(ఛాం 6-2-1)

2 ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్। (ఐత 2-1-1)

3 తదేతద్బ్రహ్మ పూర్వ మనపర మనంతర మబాహ్యం।
అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః। (బృ 2-5-19)

35 (అ) చతుర్వేదములందలి వాక్యము లుదాహరింపఁబడుచున్నవి

(1) సామవేదములో — ఛాందోగ్యములో ( 6-2-1 )
ఉద్దాలకుడు పుత్రునితో ననుచున్నాడు సోమ్య=ప్రియదర్శనుఁడా! నామరూపాత్మకమై ఈదృశ్యమానమగు జగత్తు (ఇదం) అగ్రే=సృష్టికిఁ బూర్వమందు, ఏకం ఏవ=స్వగతభేదరహితమును, సజాతీయభేదరహితమును, అద్వితీయం=విజాతీయభేదరహితమును నగు, సత్ ఏవ=సన్మాత్రముగనె, అనగా అబాధితమైన బ్రహ్మగనే, ఆసీత్ =ఉండెను

(2) ఋగ్వేదములో-ఐతరేయోపనిషత్ లో- ఇదం = నామరూపాదులచే వేఱువేఱుగ ఈ పరిదృశ్యమానమగు జగత్తు, అగ్రే=సృష్టికిఁ బూర్వము, ఏకం=ఒక్కటియగు అనగా సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమగు, ఆత్మావై = ఆత్మమాత్రమేమై, ఆసీత్ = ఉండెను

(3) యజుర్వేదములో - బృహదారణ్యకమందు – తదేతద్బ్రహ్మ = ఆ యీ బ్రహ్మము, అపూర్వం = కారణ రహితమును, అనపరం = కార్యరహితము, అనంతరం = జాత్యంతర రహితము ( ఏకరసము ), అబాహ్యం = ద్వితీయ రహితమును, సర్వానుభూః = సర్వసాక్షియునగు, అయం = ఈ, ఆత్మా = ఆత్మయే, ( ఈ ప్రత్యగాత్మయే ) బ్రహ్మ = బ్రహ్మము.

4 బ్రహ్మైవేద మమృతం పురస్తాత్
( ముండ 2-2-14 )
ఇత్యాదీని

(ఇ) న చ తద్గతానాం పదానాం బ్రహ్మ స్వరూప విషయే నిశ్చితే సమన్వయే అవగమ్యమానే, అర్థాంతర కల్పనా యుక్తా, శ్రుతహా న్యశ్రుత కల్పనా ప్రసంగాత్ ।

(ఈ) న చ తేషాం క ర్తృ స్వరూప ప్రతిపాదన పరతాఽవ సీయతే "తత్కేన కం పశ్యేత్" ( బృ 2-4 ) ఇత్యాది క్రియా కారక ఫల నిరాకరణ శ్రుతేః ।

(ఉ) న చ పరినిష్ఠిత వస్తుస్వరూపత్వేఽపి ప్రత్యక్షాది విషయం బ్రహ్మణః, 'త త్త్వమసి ( ఛాం 6-8-7 ) ఇతి బ్రహ్మాత్మభావస్య శాస్త్రమంతరేణ అనవగమ్యమాన త్వాత్ ।

(4) అథర్వణవేదములో-ముండకోపనిషత్తులో-పురస్తాత్ = ముందుభాగమున (ఎదుట) ఇదం = పరిదృశ్యమాన మగు ఈ ఈజగత్తు, అమృతం=మరణరహిత (శాశ్వత) మగు, బ్రహ్మైవ - బ్రహ్మయే = ఈమున్నగు వాక్యములు వినవచ్చుచున్నవి

(ఇ) పై తెల్పిన నాలుగువేదముల వాక్యములలోని పదములకు బ్రహ్మ స్వరూపమును బోధించుటయందు నిశ్చిత మైన సమన్వయము తెలియవచ్చుచుండగా మరియొక యర్థ కల్పన సేయుట యుక్తముగాదు అట్లు సేయుటవలన, విన వచ్చెడి యర్థమును త్రోసివేయుట వినఁబడని యర్థమును కల్పించుట యను దోషములు సిద్ధములగును

(ఈ) వేదాంత వాక్యములు కర్తృస్వరూపమును బోధించున ట్లింతమాత్రమునుఁ దలంపరాదు ఏలన ఆత్మజ్ఞానముగలుగగాఁ సర్వము ఆత్మభూతమగుటచే క్రియా కారక ఫలములను వేదము నిరాకరించుచు ఆ దశయందు ఏ సాధనముచే దేనిని ఎవడు చూచును? యని శ్రుతి సెప్పుట వలన

(ఉ) బ్రహ్మము పరినిష్ఠిత (సిద్ధ) వస్తువే యైననూ, తత్త్వమసి నీవు ఆ సత్పదార్థమే యైయున్నావను బ్రహ్మాత్మ భావమును బోధించు శాస్త్రము లేకుండ విషయము దెలియుట కవకాశము లేనందువలన, ఘటపటాదులవలె ప్రత్యక్షాదుల కింత మాత్రము విషయముకాదు

36 (అ) యత్తు హేయోపాదేయ రహితత్వాత్ ఉపదేశానర్థక్యమితి, నైషదోషః। హేయోపాదేయ శూన్య బ్రహ్మాత్మతాఽవగమాదేవ సర్వక్లేశప్రహాణాత్ పురుషార్థ సిద్ధేః।

(ఆ) దేవతాది ప్రతిపాదనస్య స్వవాక్యగతోపాసనార్థత్వేఽపి నకశ్చిద్విరోధః। నతు తథా బ్రహ్మణ ఉపాసనా విధిశేషత్వం సంభవతి ఏకత్వే హేయోపాదేయ శూన్యతయా క్రియాకారకాది ద్వైతవిజ్ఞానోపమర్దోపపత్తేః।

37 న హి ఏకత్వ విజ్ఞానేన ఉన్మథితస్య ద్వైత విజ్ఞానస్య పునః సంభవోఽస్తి, యేనోపాసనా విధిశేషత్వం బ్రహ్మణః ప్రతిపద్యేత।

38 యద్యప్యన్యత్ర వేదవాక్యానాం విధి సంస్పర్శమంతరేణ ప్రమాణత్వం న దృష్టం। తథాఽపి ఆత్మవిజ్ఞానస్య ఫల పర్యంతత్వాత్ న తద్విషయస్య శాస్త్రస్య ప్రామాణ్యం శక్యం ప్రత్యాఖ్యాతుం।

36 (అ) బ్రహ్మము హేయోపాదేయ శూన్యమగుట చేత, దాని నుపదేశించుట అనర్థకమని చెప్పుట యొక దోషముగాదు ఏలన, హేయోపాదేయ శూన్యమగు బ్రహ్మము నాత్మగాఁదెలియుట వలన సర్వక్లేశములు నశింపఁగాఁ బరమ పురుషార్థము సిద్ధించుట వలన

(ఆ) వేదాంతములందు దేవతాదులఁ బ్రతిపాదనము చేయు వాక్యములున్ననూ, యవి యుపాసనార్థములైనను విరోధమేమియు లేదు

దేవతాదులతో నుపాసనకు సంబంధమున్న రీతిగా బ్రహ్మమునకు నుపాసనాసంబంధముండుటకు వీలులేదు ఏలన, ఏకత్వే = బ్రహ్మయొక్క యేకత్వము దెలియఁ బడగా, హేయోపాయదేయశూన్యతయా = హేయమగు నుపాదేయ మగు మరియొక వస్తువు లేకుండుటచేత, క్రియాకారకాది ద్వైతవిజ్ఞానము బూర్తిగా నశించుటవలన (బ్రహ్మైకత్వ జ్ఞానముచేత సర్వద్వైతజ్ఞానము నశించుటవలన) బ్రహ్మమున కుపాసనావిధి శేషత్వము లేదు

37 ఏకత్వవిజ్ఞానముచే నశించిన ద్వైతవిజ్ఞానము కాలాంతరమున తిరిగి బయలుదేరదు కావున బ్రహ్మమున కుపాసనావిధి శేషత్వము గలుగదు ఒకపర్యాయము నశించిన ద్వైతవిజ్ఞానము తిరిగి యంకురింపదు

38 వేదములోనున్న యర్థవాదవాక్యములకు అన్యత్ర = కర్మకాండయందు, విధివాక్యములతో సంస్పర్శ లేకుండా ప్రామాణ్యము కనబడుట లేదు అయిననూ, ఆత్మ విజ్ఞానము (వేదాంతజనితజ్ఞానము) సంపూర్ణఫలముపర్యవసాన

39 న చ అనుమానగమ్యం శాస్త్రప్రామాణ్యం, యేనాన్యత్రదృష్టం నిదర్శన మపేక్షేత। తస్మాత్ సిద్ధం బ్రహ్మణ శాస్త్ర ప్రమాణకత్వం।

## 2 ద్వితీయ వర్ణకమ్

40 (అ) పూర్వపక్ష —అత్ర అపరే ప్రత్యవతిష్ఠన్తే— యద్యపి శాస్త్రప్రమాణకం బ్రహ్మ, తథాపి ప్రతిపత్తి విధి విషయతయా ఏవ శాస్త్రేణ బ్రహ్మ సమర్ప్యతే। యథా యూపాహవనీయాదీని అలౌకికాన్యపి విధి శేషతయా శాస్త్రేణ సమర్ప్యన్తే తద్వత్ ।

మగుటవలన, దానిని బోధించు శాస్త్రముయొక్క ప్రమాణ భావము నిరాకరించుటకు శక్యముగాదు (కర్మకాండ యందున్న విధులు బ్రహ్మకాండయం దుపయుక్తములు కావుగనుక)

39 వేదాంతశాస్త్రముయొక్క ప్రామాణ్యము అనుమాన ప్రమాణముచే సాధించుటకు వీలులేదు ఏలన, అనుమాన ప్రమాణమునకు ప్రసిద్ధమైన నిదర్శనము (దృష్టాంతము) ఒకటి యుండితీరవలయును అట్టి ప్రసిద్ధ నిదర్శనము లేమిచే ననుమాన ప్రమాణమునకుఁ దావు లేదు (వేదాంతములు సఫలజ్ఞాన కారణములగుటచే స్వతః ప్రమాణములు) కావున (హేయోపాదేయ రహిత బ్రహ్మ జ్ఞానముచే సర్వక్లేశప్రహాణపురస్సరముగఁ బురుషార్థ సిద్ధి యగుటచేత) బ్రహ్మమునకు శాస్త్రప్రమాణకత్వము సిద్ధించు చున్నది

## 2 రెండవవర్ణకము

40 (అ) పూర్వపక్షము — ఇచ్చట మరికొందరు (వృత్తికారవాదులు) లేచి వాదనకు వచ్చుచున్నారు (పూర్వపక్ష మొకటి లేవదీయుచున్నారు) బ్రహ్మము శాస్త్రముచే నుపదేశింపఁ బడుచున్నప్పటికి, నా బ్రహ్మము (ప్రతిపత్తి విధి విషయతయా = ఉపాసనవిధికి విషయముగనే) ఉపాసనావిధి కంగముగా శాస్త్రముచే బోధింపఁ బడుచున్నది అది యెటులన, శాస్త్రము విధులచేఁ గర్మల బోధించుచు, నా కర్మల కంగముగా యూప, ఆహవనీయాదులగు నలౌకిక

(అ) ప్రశ్నః—కుత ఏతత్ ।

(ఇ) ఉత్తరం—ప్రవృత్తి నివృత్తి ప్రయోజనత్వాత్ శాస్త్రస్య । తథాహి శాస్త్ర తాత్పర్యవిద ఆహుః ।

(1) "దృష్టోహి తస్యార్థః కర్మావబోధనం ' ఇతి ।
( జై సు 1-1-1 )

(2) ' చోదనేతి క్రియాయాః ప్రవర్తకం వచనం ' ।

(3) ' తస్య జ్ఞాన ముపదేశః ' । ( జై సూ 1-1-5 )

(4) తద్భూతానాం క్రియార్థేన సమామ్నాయః ।
( జై. 1-1-25 )

(5) "ఆమ్నాయస్య క్రియార్థత్వాత్,
ఆనర్థక్య మతదర్థానాం" ( జై 1-2-1 ) ఇతి చ ।

పదార్థములఁగూడఁ గొన్నిటిని బోధించుచున్నటుల (యూపే పశుం బధ్నాతి = యూపస్తంభమున పశువును కట్టవలెను, ఆహవనీయే జుహోతి = ఆహవనీయాగ్నియందు నాహుతి సేయవలెను, ఇంద్రం యజేత = ఇంద్రుని పూజింపవలెను ఇచ్చట యూపము, ఆహవనీయము, ఇంద్రుఁడు నెటులనో, ఉపాసనలందు బ్రహ్మముఁగూడ నటులే యనుట)

(ఆ) పూర్వపక్షమున కెదురుప్రశ్న —అది యెటుల?

(ఇ) ఉత్తరం — శాస్త్రమునకు ప్రవృత్తి నివృత్తులే ప్రయోజనమగుటవలన ఇటులనే గదా శాస్త్రతాత్పర్య వేత్తలు (శబరస్వామి మున్నగువారలు) చెప్పిరి ఏమని?

(1) కర్మయొక్క జ్ఞానమే వేదముయొక్క కనపడుచున్న ప్రయోజనముగదా!

(2) క్రియను (జ్ఞానద్వారమున) ప్రవర్తింపఁజేయు వచనము చోదన యనఁబడును (శబరస్వామి)

(3) కర్మమును తెలుపు (అపౌరుషేయ విధి) వాక్యము ఉపదేశ మనఁబడును

(4) ఆ వేదము నుండి తెలియవచ్చెడి సిద్ధవస్తువులకు క్రియ యొక్క ప్రయోజనము నుద్దేశించుటయే వేదము యొక్క యుద్దేశము (సమామ్నాయము) (జై 1–1–25)

(5) వేదమునకుఁ గ్రియార్థత్వమే ముఖ్యమగుటవలన క్రియార్థములు గానివానికి నిష్ప్రయోజనతయే (జై 1–2–1)

అను వాక్యములు (ప్రమాణములు)

(ఈ) అతః పురుషం క్వచిత్ విషయ విశేషే ప్రవర్త యత్ కుతశ్చిత్ విషయ విశేషాత్ నివర్తయచ్చ అర్థవత్ శాస్త్రం । తచ్ఛేషతయాచ అన్య దుపయుక్తం । తత్సామాన్యాత్ వేదాంతానామపి తథైవార్థవత్త్వం స్యాత్ ।

(ఉ) సతి చ విధిపరత్వే యథా స్వర్గాది కామస్య అగ్నిహోత్రాది సాధనం విధీయతే, ఏవమమృతత్వ కామస్య బ్రహ్మజ్ఞానం విధీయతే ఇతి యుక్తం ।

41 (అ) సిద్ధాంతి ప్రతిప్రశ్నః—నన్విహ జిజ్ఞాస్యస్య వైలక్షణ్యముక్తం । కర్మకాండే భవ్యో ధర్మో జిజ్ఞాస్యః, ఇహతు భూతం నిత్యనివృత్తం బ్రహ్మజిజ్ఞాస్యమితి । తత్ర ధర్మజ్ఞానఫలాత్ అనుష్ఠానసాపేక్షాత్ విలక్షణం బ్రహ్మజ్ఞాన ఫలం భవితు మర్హతి ।

(ఈ) కాఁబట్టి, పురుషుని నొకానొక మంచి విషయ విశేషమందుఁ బ్రవర్తింపఁ జేయుటచేతనో, లేక ఒకానొక దుష్టవిషయవిశేషమునుండి మరలించుటచేతనో ప్రయోజనము కలది శాస్త్ర మగును. (వీనినే ఉపాదేయ, హేయము లందురు ) కేవల విధి నిషేధములఁ దెలుపని యితర వేద వాక్యము లన్నియు నా విధి నిషేధములకు సంబంధించుచూ, వాని వాని యర్థములఁ బూరించుట రూపముగా నుపయుక్తము లగుచుండును కావున వేదాంతములు గూడ శాస్త్రము లగుటవలన, పైన చెప్పినట్లు హేయోపాదేయకర్మవిశేష బోధ కల్గినవై యుండవలెను

(ఉ) అట్లు వేదాంతములు విధిపరములు కాగా, స్వర్గాదుల నభిలషించువానికి నగ్నిహోత్రాది సాధన మెట్లు విధింపఁబడుచున్నదో యదే విధముగా నమృతత్వ మభిలషించు వారికిఁ బ్రహ్మ జ్ఞాన మను సాధనము విధింపఁబడుచున్న దని చెప్పుట యుక్తంబగు

41 (అ) సిద్ధాంతియొక్క యెదురుప్రశ్న - ఈ ధర్మ (కర్మ) కాండ బ్రహ్మకాండములలో జిజ్ఞాస్యమును గురించిన వైలక్షణ్యం (భేదము) ఉన్నదని (లోగడ) సెప్పఁబడెనుగదా ! కర్మకాండయందు భవ్యధర్మము ( చేయఁదగిన ధర్మము ) జిజ్ఞాసింపఁదగినది ఇక్కడనో భూతం ( సిద్ధమైన ) నిత్యసిద్ధమగు బ్రహ్మము జిజ్ఞాసింపఁదగినది ధర్మ జ్ఞానఫలమన్ననో, యది యెరిగిన తర్వాత ననుష్ఠానము నపేక్షించుచున్నది దానికంటె విలక్షణముగా బ్రహ్మజ్ఞాన ఫలము అనుష్ఠాన మపేక్షింపదు

(అ) పూర్వపక్ష సమర్థనా— నార్హత్యేవం భవితుం । కార్యవిధిప్రయుక్తస్యైవ బ్రహ్మణః ప్రతిపాద్యమానత్వాత్ ।

(1) ఆత్మావారే ద్రష్టవ్యః ( బృ 2-4-5 )

(2) య ఆత్మా అపహత పాప్మా, సోఽన్వేష్టవ్యః, స విజిజ్ఞాసితవ్యః ( ఛాం 8-7-1 )

(3) ఆత్మేత్యేవోపాసీత ( బృ 1-4-7 )

(4) ఆత్మానమేవ లోక ముపాసీత ( బృ 1-4-15 )

(5) బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి ( ముం 3-2-9 )

ఇత్యాదిషు విధానేషు సత్సు "కోఽసావాత్మా ? కిం తద్బ్రహ్మ ? ఇత్యాకాంక్షాయాం తత్స్వరూప సమర్పణేన సర్వే వేదాంతాః ఉపయుక్తాః — "నిత్యః సర్వజ్ఞః, సర్వగతో, నిత్యతృప్తో, నిత్యశుద్ధముక్తస్వభావో విజ్ఞాన మానందం బ్రహ్మ ఇత్యేవ మాదయః । తదుపాసనాచ్ఛాస్త్రదృష్టోఽదృష్టో మోక్షః ఫలం భవిష్యతీతి ।

(ఆ) పూర్వపక్షియొక్క సమర్థన—ఇట్లు జిజ్ఞాస్య భేదమున్నదనుట యుక్తముకాదు ఏలన, క్రియను బోధించు విధులతో సంబంధింపఁజేసియే బ్రహ్మము శాస్త్రముచే బోధింపఁబడుటవలన—

(1) ఆత్మయే - ఓసీ మైత్రేయీ! చూడఁదగినది (బృ 2-4-5)

(2) పాపరహితాత్మయేదియో యదియే వెదుకఁదగినది తెలియదగినది (ఛాం 8-7-1)

(3) తాను 'ఆత్మ యే యని యుపాసింపవలయును (బృ 1-4-7)

(4) ఆత్మయను లోకమునే యుపాసింపవలయును (బృ 1-4-15)

(5) బ్రహ్మ నెరిగినవాఁడు బ్రహ్మయే యగుచున్నాడు (ముం 3-2-9)

ఇట్టి (ద్రష్టవ్యః విజిజ్ఞాసితవ్యః, ఉపాసీత, ఇత్యాది) విధివాక్యములు ఉండగా, "ఆ యాత్మ యెట్టిది? ఆ బ్రహ్మ మేది?" యను నాకాంక్ష (తెలియవలె నను కోరిక) యుండగా, ఆ యాత్మస్వరూపమును ప్రదర్శించుచూ (సమర్పణ సేయుచూ) సమస్త వేదాంతములు నుపకారులగు చున్నవి ఎటులఁ జెప్పుచున్నవన "నిత్యుఁడు, సర్వ మెరిగినవాఁడు, అంతట నున్నవాడు, నిత్య తృప్తుఁడు, నిత్య శుద్ధబుద్ధముక్త స్వభావుఁడు, విజ్ఞానము ఆనందము బ్రహ్మ' అని అట్టి బ్రహ్మము నుపాసించుటవలన శాస్త్రముచే

(ఇ) కర్తవ్య విధ్యనుప్రవేశే వస్తుమాత్ర కథనే హానోపాదానా సంభవాత్ 'సప్తద్వీపావసుమతీ' "రాజాఽసౌగచ్ఛతి" ఇత్యాది వాక్యవత్ వేదాంతవాక్యానాం ఆనర్థక్యమేవస్యాత్ ।

42 (అ) సిద్ధాంతి ప్రశ్నః — నను వస్తుమాత్ర కథనేఽపి "రజ్జురియం, నాయంసర్పః" ఇత్యాదౌ భ్రాంతి జనిత భీతి నివర్తనేన అర్థవత్త్వం దృష్టం, తథా ఇహాపి అసంసార్యాత్మవస్తు కథనేన సంసారిత్వ భ్రాంతి నివర్తనేన అర్థవత్త్వం స్యాత్ ।

(ఆ) పూర్వపక్ష సమాధానం—స్యాదేతదేవం, యది రజ్జు స్వరూప శ్రవణ ఇవ సర్ప భ్రాంతిః, సంసారిత్వ భ్రాంతిః బ్రహ్మస్వరూప శ్రవణ మాత్రేణ నివర్తేత । నతు నివర్తతే, శ్రుతబ్రహ్మణోఽపి యథాపూర్వం సుఖదుఃఖాది సంసారి ధర్మదర్శనాత్ ।

దృష్టము, ఈలోకమున అదృష్టమును నగు మోక్షరూప ఫలము కల్గునని జెప్పుచున్నవి

(ఇ) మరియు, కర్తవ్యవిధికి నంగముగాకుండ, వస్తు మాత్రోపదేశకథనమందు ఆ వస్తువునకు హానము (త్యాగము) ఉపాదానము (స్వీకారము) గాని సంభవించదు కావున, వేదాంతవాక్యములకు "సప్తద్వీపములుకలది భూమి" "ఈరాజు వెళ్ళుచున్నాడు" అనునట్టి వాక్యములకువలె యానర్థక్యమే కలుగును (పురుషార్థత లేదని తాత్పర్యము)

42 (అ) సిద్ధాంతి ప్రశ్న - ఏమండీ! వస్తుమాత్ర మును చెప్పినపుడు గూడ "ఇది త్రాడు, ఇది పాముకాదు" అని చెప్పుటవలన భ్రాంతివలన కలిగిన భయము పోవుటచేత వాక్యమున కర్థవత్త్వం (ఉపయోగము) కనఁబడుచున్నది అటులనే సంసార రహితమగు నాత్మ వస్తువును బోధించుటచే ఆత్మ సంసారియను భ్రాంతినిఁ బోఁగొట్టుటచేత వేదాంత వాక్యములకు నర్థవత్త్వము గలుగుచున్నది గదా!

42 (ఆ) పూర్వపక్షుని సమాధానము - అవును, రజ్జు స్వరూప శ్రవణమువలన సర్పభ్రాంతి తొలగినటుల, బ్రహ్మస్వరూప శ్రవణమాత్రముచే సంసారిత్వభ్రాంతి నశించె నేని మీరు చెప్పినట్లు వేదాంతశ్రవణము సప్రయోజనమగు గాని, సంసారిత్వ భ్రాంతి (లోకములో) నివర్తించుట లేదే! బ్రహ్మను గురించి శ్రవణముచేసిన వానికిఁగూడ శ్రవణము యొక్క పూర్వమందువలెనే సుఖదుఃఖాది సంసారి ధర్మములు తరువాత కానవచ్చుటవలన (కేవల వేదాంత శ్రవణముచే ప్రయోజనము లేదని, తాత్పర్యము)

(ఇ) "శ్రోతవ్యో, మంతవ్యో, నిదిధ్యాసితవ్యః" (బృ 2-4-5)ఇతి చ శ్రవణోత్తర కాలయోః మనన నిదిధ్యాసనయోః విధిదర్శనాత్ । తస్మాత్ ప్రతిపత్తి విధి విషయ తయా ఏవ శాస్త్రప్రమాణకం బ్రహ్మాభ్యుపగంతవ్యం – ఇతి ।

43 (అ) సిద్ధాంతి సమాధానం—అత్రాభిధీయతే । న । కర్మబ్రహ్మ విద్యాఫలయోర్వైలక్షణ్యాత్ । శారీరకం వాచికం మానసంచ కర్మ శ్రుతి స్మృతి ప్రసిద్ధం ధర్మాఖ్యం యద్విషయా జిజ్ఞాసా "అథాతో ధర్మజిజ్ఞాసా (జై 1-1-1) ఇతి సూత్రితా । అధర్మోఽపి హింసాదిః ప్రతిషేధ చోదనా లక్షణత్వాత్ జిజ్ఞాస్యః పరిహారాయ । తయోః చోదనా లక్షణయోః అర్థానర్థయోః ఫలే ప్రత్యక్షే సుఖదుఃఖే శరీర వాఙ్మనోభిః ఏవ ఉపభుజ్యమానే విషయేంద్రియ సంయోగ జన్యే బ్రహ్మాదిషు స్థావరాంతేషు ప్రసిద్ధే, మనుష్యత్వాదారభ్య బ్రహ్మాన్తేషు దేహవత్సు సుఖతారతమ్యం అనుశ్రూయతే ।

(ఆ) తతశ్చ తద్ధేతోః ధర్మస్య తారతమ్యం గమ్యతే । ధర్మతారతమ్యాత్ అధికార తారతమ్యం ।

(ఇ) మరిన్ని (బృ 2-4-5) "శ్రవణము సేయవలెను, మననము సేయవలెను, ధ్యానింపవలెను" అనుట చేత, శ్రవణానంతరమున మనన ధ్యానములు సేయవలెవని విధి గన్పట్టుట వలన, (వేదాంతములు) ఉపాసనా విధి శేషంగముగనే బ్రహ్మమును శాస్త్రము బోధించుచున్నది (కాని ప్రత్యేకముగా కాదు)

43 (అ) సిద్ధాంతి సమాధానము - ఇచ్చట చెప్పఁబడుచున్నది మీరు చెప్పునట్లు కాదు కర్మవిద్యా ఫలమునకు, బ్రహ్మవిద్యా ఫలమునకు (వైలక్షణ్యము) అత్యంత భేదముండుట వలన శారీరకము వాచికము, మానసికమునగు కర్మ, శ్రుతి స్మృతులచే నుపదేశింపఁబడుచు ధర్మమను పేరఁ బరగుచున్నది అధర్మముగూడ (అనగా హింసాదికము) ప్రతిషేధచోదనచేఁ బరిహారము కొరకు జిజ్ఞాస్య మగుచున్నది ఆ చోదనా లక్షణములగు (ధర్మాధర్మములయొక్క) అర్థానర్థముల యొక్క ఫలములు ప్రత్యక్షములగు సుఖదుఃఖములనియు శరీర వాక్ మనస్సులచేత నవి యనుభవింపఁబడుచు, విషయములకు నింద్రియములకు సంయోగముచే జన్యములగుచు, చతుర్ముఖ బ్రహ్మ నుండి వృక్షాది స్థావరాంతములందు సుప్రసిద్ధముగాఁ దెలియఁబడుచున్నవి మనుష్యుఁడు మొదలు బ్రహ్మదేవుని వరకుఁ గల దేహధారులందు సుఖముయొక్క తరతమ భావము వినఁబడుచున్నది

(ఆ) సుఖ దుఃఖ మందలి తారతమ్యమునకు గారణ మాయావ్యక్తులచే నాచరింపఁబడిన ధర్మము నందలి తార

ప్రసిద్ధం చ అర్థిత్వ సామర్థ్యాది కృతం అధికారి తారతమ్యం। తథాచ యాగాద్యనుష్ఠాయినామేవ విద్యాసమాధి విశేషాత్ ఉత్తరేణ పథాగమనం కేవలై రిష్టా పూర్తదత్త సాధనైః ధూమాది క్రమేణ దక్షిణేన పథాగమనం, తత్రాపి సుఖ తారతమ్యం తత్సాధన తారతమ్యంచ శాస్త్రాత్ "యావత్సం పాత ముషిత్వా" ( ఛాం 5-10-5 ) ఇత్యస్మాత్ గమ్యతే।

(ఇ) తథా మనుష్యాదిషు నారక స్థావరాంతేషు సుఖలవః చోదనాలక్షణ ధర్మసాధ్యః ఏవేతి గమ్యతే తారతమ్యేన వర్తమానః। తథోర్ధ్వగతేష్వివాధో గతేషు చ దేహవత్సు దుఃఖతారతమ్య దర్శనాత్ తద్ధేతోః అధర్మస్య ప్రతిషేధ చోదనాలక్షణస్య తదనుష్ఠాయినాం చ తారతమ్యం గమ్యతే।

**44.** (అ) ఏవ మవిద్యాది దోషవతాం ధర్మా ధర్మ తారతమ్య నిమిత్తం శరీరోపాదాన పూర్వకం సుఖ దుఃఖ

తమ్యమని తెలియఁబడుచున్నది ధర్మమందలి తారతమ్యము నకు, నా ధర్మమాచరించు నధికారులందలి తారతమ్యము గారణమగు అధికారి తారతమ్యమునకు నర్థిత్వ సామర్థ్యా దులు కారణములని ప్రసిద్ధముకదా! అదియేగదా యాగాదుల ననుష్ఠించువారలకు జ్ఞానాతిశయముచే నుత్తర మార్గముద్వారా బ్రహ్మలోకప్రాప్తియు, కేవలమిష్టాపూర్త దత్తాది సాధనములచే దక్షిణమార్గ గమనమున్నూ సుఖ తారతమ్యము సాధనతారతమ్యమున్నూ శాస్త్రముచే జెప్పఁబడుచున్నది ఏమని? యావత్ సంపాతం=పూర్వము సంపాదింపఁబడిన పుణ్యఫల మెంతవరకు నిలుపఁగలిగి యుండునో, అంతవరకుఁ జంద్రలోకమందుండి పిమ్మట తిరిగి వచ్చెదరు అని ( ఛాం 5-10-5 )

(ఇ) ( బ్రహ్మాది మనుష్యాంతం వరకెటులో ) అటులనే మనుజుఁడాదిగాఁగలిగి నరక సంబంధమగు స్థావరాంతములగు ప్రాణులందుఁగూడ సుఖలేశముయొక్క తారతమ్యము చూడఁబడుటచే నయ్యదియు ఆ యా ప్రాణులచే నాచరింపఁ బడిన ధర్మ తారతమ్య సాధ్యమని నూహింపవచ్చును మరియు మనుష్యులనుండి పైకి బ్రహ్మ వరకును, నట్లే క్రిందికి స్థావరముల వఱకును, దేహధారులందు తారతమ్యములతో నున్న దుఃఖమునకుఁ గారణమగు నధర్మములోను ఆ యా ధర్మమాచరించు శరీరధారులలోను హెచ్చు తగ్గు లుండనే యుండును అని తోఁచుచున్నది

44 (అ) ఈవిధముగా నవిద్యాది దోషములోఁ గూడిన ప్రాణులకు ధర్మాధర్మముల తారతమ్యమున కను

తారతమ్య నిమిత్తం సంసారరూపం శ్రుతి స్మృతి న్యాయ ప్రసిద్ధం। తథాచ శ్రుతిః – "నహ వై సశరీరస్య సతః ప్రియాప్రియయోః అపహతి రస్తి ' ఇతి యథా వర్ణితం సంసారరూపం అనువదతి।

(ఆ) "అశరీరం వావ సంతం నప్రియాప్రియేస్పృశతః " (ఛాం 8-12-1) ఇతి ప్రియాప్రియ స్పర్శనప్రతిషేధాత్ చోదనాలక్షణ ధర్మకార్యత్వం మోక్షాఖ్యస్య అశరీరత్వస్య ప్రతిషిధ్యతే – ఇతి గమ్యతే ధర్మకార్యత్వేహి ప్రియాప్రియ స్పర్శన ప్రతిషేధః నోపపద్యతే।

45 (అ) పూర్వపక్ష-శంకా – "అశరీరత్వమేవ ధర్మ కార్యం" ఇతి చేత్।

45 (ఆ) శంకాపరిహారః-న। తస్య స్వాభావికత్వాత్। శ్రుతయః-

(1) "అశరీరం శరీరేష్వనవస్థేష్వవస్థితం। మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో నశోచతి "।
(కఠ 1-2-21)

గుణముగా శరీరము గారణముగాఁ గలిగినట్టి సుఖదుఃఖ తారతమ్యమున్నటులను నయ్యదియే సంసారరూపమనియు శ్రుతి స్మృతి న్యాయసిద్ధమై యున్నది అటులనే శ్రుతి - "శరీరమునం దాత్మాభిమానము గలవానికి ప్రియాప్రియముల యొక్క తొలగిపోవుట ( అపహతిః ) లేదు కదా!" అని పూర్వము వర్ణింపఁబడిన సంసార స్వరూపమును, అనువాదము సేయుచున్నది ( విపులముగాఁ జెప్పుచున్నది )

(ఆ) "తత్త్వజ్ఞానముచే శరీరమునం దాత్మాభిమానము లేనివానిని సుఖదుఃఖములు స్పృశింపవు" ( ఛాం 8-12-1 ) అని ప్రియాప్రియస్పర్శ లేదని చెప్పుటవలన, చోదనా లక్షణమైన ధర్మాధర్మముల కార్యత్వము "మోక్ష" మను పేరుగల అశరీరత్వమునకు నిషేధింపబడుచున్నదని తెలియ వచ్చుచున్నది మోక్షము ధర్మకార్యమైనప్పుడు ప్రియా ప్రియస్పర్శనయొక్క నిషేధము కుదరదు

45 (అ) పూర్వపక్షుని శంక — ( ధర్మముచే విచిత్రములగు ఫలములు బుట్టుచుండ ) అశరీరత్వము ( మోక్షము ) ధర్మముచేతనేఁ గలుగునని చెప్పకూడదా యని యన్నచో—

45 (ఆ) శంకాపరిహారము—అటులగాదు ఏలన, 'అశరీరత్వము స్వాభావసిద్ధమగుటవలన ( 'అశరీరత్వము' జన్య మెంతమాత్రము గాదని యభిప్రాయము ) —శ్రుతులు

1 శరీర రహితమును ( అశరీరం ), అశాశ్వతములైన శరీరములందున్నదియు, గొప్పదియు, సర్వవ్యాపకమును నగు ఆత్మను తానుగా తెలిసికొని, వివేకి దుఃఖింపడు

( కఠ. 1-2-21 )

(2) "అప్రాణో హ్యమనాః శుభ్రః" (ముండ 2-1-2)

(3) "అసంగో హ్యయం పురుష"

(బృ 4-3-15)

ఇత్యాది శ్రుతిభ్యః। అత ఏవ అనుష్ఠేయ కర్మఫల విలక్షణం మోక్షాఖ్యం అశరీరత్వం నిత్యమితి సిద్ధం।

46 (అ) పూర్వపక్ష-శంకా—తత్ర కించిత్ పరిణామి నిత్యం, యస్మిన్ విక్రియమాణేఽపి తదేవేదమితి బుద్ధిర్న విహన్యతే, యథాపృథివ్యాది జగన్నిత్యత్వ వాదినాం, యథా చ సాంఖ్యానాం గుణాః।

(ఆ) శంకాపరిహారః- ఇదం తు పారమార్థికం కూటస్థ నిత్యం వ్యోమవత్ సర్వవ్యాపి సర్వవిక్రియారహితం నిత్యతృప్తం నిరవయవం స్వయంజ్యోతి స్స్వభావం।

2 ప్రాణరహితుడును, మనోరహితుడును కనుకనే శుద్ధుడును ( రాగాది దోషరహితుడు ) — అయినవాఁడు ఆత్మ ( ముండ 2-1-2 )

3 ఈ యాత్మ నిస్సంగుఁడు ( అనగా రెండవ దానితో సంబంధము లేనివాఁడు ) ( బృ 4-3-15 )

ఇట్టి శ్రుతులవలనఁ దెలియుచున్నది దానంజేసి అనుష్ఠేయమగు కర్మయొక్క ఫలముకంటె వేఱైనదని మోక్షమను పేరుగల ' అశరీరత్వము ' నిత్యమని సిద్ధించుచున్నది

46 (అ) పూర్వపక్షుని శంక — మీరు అశరీరత్వము నకుఁ జెప్పు " నిత్యత ' పరిణామి నిత్యతా ? అనగా నేది వికారము చెందిననూ, ' అదియే యిది యను బుద్ధి చెదరకుండునట్టి నిత్యత్వమని ( ఒకే వస్తువును పెక్కు పర్యాయములు చూచువానికి, వస్తువునకు కించిత్ వికారములున్ననూ, యదియే యిది యను బుద్ధి చెదరకుండునట్టి దానిని " పరిణామి నిత్య మందురు - ద్వైతవాదములో ) ఉదాహరణకు - జగత్ నిత్యమని చెప్పువారి పృథివ్యాదులు సాంఖ్యులు చెప్పు సత్వరజస్తమో గుణములు ఇట్టి నిత్యత్వమేనా మీరు " అశరీరము 'నకు చెప్పునది ?

(ఆ) శంకాపరిహారము - ఇది ( అశరీరముయొక్క నిత్యత్వము ) కూటస్థనిత్యము ఆకాశమువలె సర్వవ్యాపి, సర్వవిక్రియారహితము, నిత్యతృప్తము, నిరవయము, స్వయంజ్యోతి స్వభావమునై యున్నది (కర్మమువలన ప్రాప్తించెడి ' ఆప్త్యాదులు దీనికి లేవని తాత్పర్యము )

(ఇ) యత్ర ధర్మాధర్మౌ సహకార్యేణ కాలత్రయం చ నోపావర్తేతే, తదేతదశరీరత్వం మోక్షాఖ్యం ।

'అన్యత్ర ధర్మాదన్యత్రా ధర్మాత్
అన్యత్రాస్మాత్ కృతాకృతాత్
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ' (కఠ 2-14)

ఇత్యాది శ్రుతిభ్యః । అతస్తద్బ్రహ్మ యస్యేయం జిజ్ఞాసా ప్రస్తుతా ।

(ఈ) తద్యది కర్తవ్యశేషత్వేన ఉపదిశ్యేత తేన చ కర్తవ్యేన సాధ్యశ్చేత్, మోక్షోఽభ్యుగమ్యేత, అనిత్య ఏవ స్యాత్ । తత్రైవం సతి యథోక్త కర్మ ఫలేష్వేవ తారతమ్యావస్థితేషు అనిత్యేషు కశ్చిదతిశయో మోక్ష ఇతి ప్రసజ్యేత । నిత్యశ్చ మోక్షః సర్వైః మోక్షవాదిభిః అభ్యుపగమ్యతే । అతో న కర్తవ్యశేషత్వేన బ్రహ్మోపదేశో యుక్తః

47 (అ) అంచ- (1) బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి (ముం 3-2-9)

(ఇ) ఎచ్చట ధర్మాధర్మములు తత్కార్యములైన సుఖదుఃఖాదులుగాని, మూడుకాలములును సంబంధింపవో అట్టి యశరీరత్వమునకు మోక్షమనుఁ బేరుఁ గలిగినది "ధర్మముకన్న విలక్షణము, అధర్మముకన్న విలక్షణము, కార్యముకంటె (అకృతాత్), కారణముకంటె విలక్షణము, భూతముకంటె భవిష్యత్కంటె విలక్షణము, చ - వర్త మానముకంటె విలక్షణము (కఠ 2-14) ఇట్టి శ్రుతు లచే విదితము కావున నిట్టి కూటస్థ బ్రహ్మను గురించి జిజ్ఞాసయే ప్రస్తుతింపఁబడుచున్నది

(ఈ) బ్రహ్మము కర్తవ్య శేషమే యని యుపదేశింప బడినచో, నట్టి కర్తవ్యతతో నది సాధ్యవస్తు వైనచో, మోక్ష మనునది యనిత్య వస్తువే గావలసివచ్చును మోక్ష మనిత్యమని యంగీకరించినచో తరతమ భావములచేఁ దెలియవచ్చెడి యనిత్యములగు కర్మఫలములలో నెద్దియో యొక యతిశయఫలముగ మోక్షము దలంపఁబడవలయును (లోకములో) మోక్షవాదు లందరు మోక్షము నిత్యమని యొప్పుకొని యున్నారుగదా! కావున క్రియావిధి కంగముగ బ్రహ్మ ముపదేశింపఁబడెనని చెప్పుట యుక్తముగాదు

47 (అ) మరియు, (బ్రహ్మజ్ఞానము దృష్టము జ్ఞాన సమకాలికమనియు చెప్పు శ్రుతులేవన)

(1) ఎవఁడు బ్రహ్మమును స్వస్వరూపముగాఁ దెలిసికొను చున్నాడో, యట్టివాఁడు బ్రహ్మయే యగుచున్నాడు (ముం 3-2-9)

(2) క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే
(ముం 2 2-8)

(3) ఆనందం బ్రహ్మణో విద్వాన్,
నబిభేతి కుతశ్చనేతి (తై 2-9)

(4) అభయం వై జనక ప్రాప్తోసి (బృ 4-2-4)

(5) తదాత్మానమేవా వేదహం బ్రహ్మాస్మీతి। తస్మాత్తత్
సర్వమభవత్ (బృ 1-4-10)

(6) తత్రకో మోహః కశ్శోక ఏకత్వమను పశ్యతః (ఈ 7)

ఇత్యేవ మాద్యాః శ్రుతయః బ్రహ్మ విద్యానంతరం మోక్షం దర్శయంత్యః మధ్యే కార్యాంతరం వారయన్తి। తథా

"తద్ధైతత్ పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతిపేదే అహమను రభవం సూర్యశ్చ (బృ 1-4-10) ఇతి బ్రహ్మ దర్శన సర్వాత్మభావయోర్మధ్యే కర్తవ్యాంతర వారణాయ ఉదాహార్యం। యథాతిష్ఠన్ గాయతీతి, తిష్ఠతి గాయతోర్మధ్యే తత్కర్తృకం కార్యాంతరం నాస్తీతి గమ్యతే।

(2) కార్యకారణ రూపమగు సర్వజ్ఞమగు, బ్రహ్మ నేనే యని తెలియబడగా ఆ విద్వాంసుని కర్మములు నశించును ( ముం 2-2-8 )

(3) బ్రహ్మముయొక్క యానందమును లేక బ్రహ్మ భిన్నమగు ఆనందమును తెలిసికొనినవాఁడు దేనివలనను భయము నొందడు ( తై 2-9 )

(4) ఓ జనకా ! భయరహితమైన బ్రహ్మభావమునుఁ బొందియున్నావు ( బృ 4-2-4 )

(5) ఆ బ్రహ్మమును స్వరూపముగ 'నేనే బ్రహ్మనయితి నని తెలిసికొనెను ఆ తెలిసికొనుటవలన నా పూర్ణ మగు బ్రహ్మమే యంతయునూ యాయెను (బృ 1-4-10)

(6) ఏకత్వమును ( సార్వాత్మ్య భావమును ) అనుపశ్యతః ( తెలిసికొనుచున్నవానికి ) మోహ మేది, శోక మేది ? ( మోహ శోకము లుండవని తాత్పర్యము )

( ఈశా 7 )

ఇట్టి శ్రుతులు బ్రహ్మవిద్యానంతరమున మోక్ష దర్శనమును చూపుచు మధ్య విలంబ ముండరాదని వారించుచున్నవి "ఆ బ్రహ్మమును నాత్మగ పశ్యన్ = తెలిసికొనుచు, వామదేవుఁ డను ఋషి " నేను మనువునైతిని, సూర్యుఁడనైతిని యని తాదాత్మ్యము బ్రహ్మదర్శన సర్వాత్మ భావముల మధ్యకాలమందు కర్తవ్యమును వారించుట నుదాహరించుచున్నది ( వామదేవ శ్రుతిలోనున్న 'పశ్యన్' శబ్దముమీాద విశేషార్థము ) అతడు (తిష్ఠన్) కూర్చొనుచు,

(అ) (1) త్వం హి నః పితా యోస్మాక మవిద్యాయాః పరం
పారం తారయసి (ప్రశ్న 6-3)

(2) శ్రుతం హ్యేవ మేవ భగవద్దృశేభ్య స్తరతి
శోకమాత్మ విదితి, సోహం భగవః
శోచామి తం మా భగవాన్ శోకస్య
పారం తారయతు (ఛాం 7-1 3)

(3) తస్మై మృదిత కషాయాయ తమసః
పారం దర్శయతి భగవాన్ సనత్కుమారః
(ఛాం 7-26-2)

ఇతి చైవ మాద్యాః శ్రుతయః మోక్షప్రతిబంధ
నివృత్తి మాత్రమేవ ఆత్మజ్ఞానస్య ఫలం దర్శయన్తి ।

గాయతి=పాడుచున్నాడు 'కూర్చొనుచు 'పాడుచు', నను క్రియల మధ్యయందు స్వకర్తృకమైన మరియొక కార్యము లేదని తెలియునట్లుగా (పశ్యన్-ప్రతిపేదే=) వామదేవు డాత్మను దెలియుచూ తాదాత్మ్యమును బొందెను

(అ) (ప్రశ్నోపనిషత్తులో భరద్వాజాదులు పిప్పలాదునివల్ల జ్ఞానముం బడసి చెప్పిన వాక్యములు)

(1) ఏ నీవు మమ్ములను నవిద్యయొక్క యుత్కృష్టమగు నవధిని జ్ఞానముచే దాటించుచున్నావో యట్టి కారణముచే నీవు మాకు నిశ్చయముగఁ దండ్రివే (ప్రశ్న 6-8)

(2) (ఛాందోగ్యములో నారదుఁడు సనత్కుమారునితోఁ జెప్పిన వాక్యములు)

భగవంతులగు మీతో సమానమైన మహనీయుల వలన స్వస్వరూపము దెలిసికొనినవాఁడు దుఃఖమును దాటు చున్నాడు అట్లు విన్నట్టి నేను, మహానుభావా దుఃఖించు చున్నాను మహానుభావులగు మీరు అట్టి నన్ను దుఃఖము యొక్క యవధిని దాటింపుడు (ఛాం 7-1-3)

(3) భగవానుఁడగు సనత్కుమారుఁడు, కాలుష్యము నశించుటచే చిత్తశుద్ధి నొందినట్టి యీ నారదునికై యజ్ఞానము యొక్క యవధినిఁ జూపించుచున్నాడు (ఛాం 7-26-2)

ఇట్టి శ్రుతులు - ఆత్మ జ్ఞానముయొక్క ఫలమేమన మోక్షమునకుఁ బ్రతిబంధకమగు నజ్ఞానముయొక్క నివృత్తి మాత్రమని చూపుచున్నవి

48 తథా చ ఆచార్య ప్రణీతం న్యాయోప బృంహితం సూత్రం

"దుఃఖ జన్మ ప్రవృత్తి దోష మిథ్యా జ్ఞా
నానాం ఉత్తరోత్తరా పాయే తదనంత
రాపాయాత్ అపవర్గః (న్యా సూ 1-1-2)

ఇతి। మిథ్యా జ్ఞానాపాయశ్చ బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానా ద్భవతి।

49 (1) న చేదం బ్రహ్మాత్మైకత్వం సంపద్రూపం। యథా "అనంతంవై మనోఽనంతా విశ్వేదేవాః, అనంత మేవ స తేన లోకం జయతి' (బృ 3-1-9) ఇతి।

(2) న చాధ్యాసరూపం। యథా "మనో బ్రహ్మే త్యుపాసీత" (ఛాం -3-18-1), "ఆదిత్యో బ్రహ్మేత్యా

48 అటులనే అక్షపాదాచార్యుల (గౌతములు) వారిచే ప్రణీతమైన యుక్తులతోఁ బోషింపఁబడునట్టి సూత్రము కూడ నీవిషయమునే జెప్పుచున్నది

"దుఃఖము, జన్మ ప్రవృత్తి, దోషము, మిథ్యాజ్ఞానములలో నుత్తరోత్తరము నశించుటవలన పూర్వపూర్వము నశించుచున్నది కాన నపవర్గము లభించుచున్నది

(మిథ్యాజ్ఞానము నశింప దోషమున్నూ, దోషము నశించుటవలన ప్రవృత్తియు, ప్రవృత్తి నశించుటవలన జన్మము, జన్మము నశించుటవలన దుఃఖమున్నూ నశించును కాన మిథ్యాజ్ఞాన నాశనమువలన దుఃఖము నశిమనని తాత్పర్యము) కావున మిథ్యాజ్ఞాన నాశనమువలన బ్రహ్మాత్మైక్య విజ్ఞానము గలుగుచున్నది

49 (1) సంపద్రూపవాదఖండన — (సంపదుపాస్తియనగా నొకయల్పవస్తువునకు నుత్కృష్టవస్తువునకు ధర్మసామ్యముచే నేకత్వము నుపాసించి యల్పము నుత్కృష్టముగా భావనచేయుట) ఈ బ్రహ్మాత్మైకత్వము సంపద్రూపాత్మక ఉపాసనము గాదు ఎటులనన, మనస్సు అనంతములగు వృత్తులతో నొప్పారుటంజేసి, యనంత సంఖ్యతోనున్న విశ్వేదేవతల సామ్యముతో, నుపాసించుట వలన నా యుపాసకుఁడనంత లోకమును జయించును ఇట్టిది బ్రహ్మోపాసన గాదు

(2) అధ్యాసరూపవాదఖండన - బ్రహ్మాత్మైకత్వము అధ్యాసరూపోపాసనగాదు (ఒకదానిని మరియొకటిగా యుపా

దేశః ( ఛాం 3-19-1 ) ఇతి చ మన ఆదిత్యాదిషు బ్రహ్మ దృష్ట్యధ్యాసః।

(3) నాం విశిష్టక్రియా యోగ నిమిత్తం "వాయుర్వావ సంవర్గః", "ప్రాణోవావ సంవర్గః" ( ఛాం 4-3-13 ) ఇతి వత్

(4) నాప్యాజ్యా వేక్షణాది కర్మవత్ కర్మాంగ సంస్కార రూపం।

సించుట నధ్యాసరూపోపాసన ) బ్రహ్మముగానట్టి మనస్సు బ్రహ్మ మని ( ఛాం 3-18-1 ), బ్రహ్మము గానట్టి యాదిత్యుఁడు బ్రహ్మ మని ( ఛాం 3-19-1) మనస్సు ఆదిత్యుఁడు మున్నగువానియందు బ్రహ్మదృష్టిని చేయుట అధ్యాసరూపోపాసన యనబడును ఇట్టిది బ్రహ్మాత్మైకత్వమునకుఁ జెల్లదు

(3) విశిష్ట క్రియాయోగవాద ఖండన – ( 'విశిష్ట క్రియా యోగోపాస్తి ' యనగా రెండు వస్తువులందుఁ దెలియ వచ్చెడి క్రియకు సామ్యముండుటవలన నా రెండు వస్తువులొకటి యను నుపాసన ) బ్రహ్మాత్మైకత్వము విశిష్ట క్రియాయోగము వంటిదికాదు ప్రలయమందు పృథివ్యాపస్తేజస్సులను వాయువు తనయందు నిమిడ్చికొనును అటుల సుషుప్తియందు ముఖ్య ప్రాణము సకలేంద్రియములను తనయందు నిమిడ్చికొనును దీనిని సంవర్గమందురు ఇట్టి సంవర్గ సామ్యముచేఁ బ్రాణమే వాయువని యుపాసించు విధమున జీవునియందును బ్రహ్మమందును బృంహణ క్రియాసామ్యముండుటంజేసి జీవుఁడే బ్రహ్మ మని యుపాసించుట విశిష్టక్రియాయోగ నిమిత్తమగు నుపాస్తి యగును అట్టి యుపాసన బహ్మాత్మైక్య విజ్ఞానమందుఁ జెల్లదు

(4) కర్మాంగ సంస్కారవాద ఖండన — ఒకానొక యజ్ఞకర్మయందు, అనగా దర్శపూర్ణమాస ప్రకరణమున ఆజ్యమును యజమానుని పత్ని జూచుటచేత నా నెయ్యి హోమద్రవ్యయోగ్యతనుఁ బొందును దీనిని కర్మాంగ సంస్కారమందురు అటులనే, బ్రహ్మాత్మైకత్వజ్ఞానము కర్మాంగ సంస్కారము కాదు

50 (అ) సంపదాది రూపే హి బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానే అభ్యుపగమ్యమానే "తత్త్వమసి" (ఛాం 6-8-7), "అహం బ్రహ్మాస్మి" (బృ 1-4-10), "అయమాత్మా బ్రహ్మ" (బృ 2-5-19) ఇత్యేవ మాదీనాం వాక్యానాం బ్రహ్మాత్మైకత్వ వస్తు ప్రతిపాదన పరః పదసమన్వయః పీడ్యేత।

(ఆ) "భిద్యతే హృదయ గ్రంధిః, ఛిద్యంతే సర్వ సంశయాః" (ముండ 2-5-19) ఇతి చైవమాదీని అవిద్యా నివృత్తి ఫల శ్రవణాని ఉపరుధ్యేరన్।

(ఇ) 'బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి' (ముం 3-2-9) ఇతి చైవ మాదీని తద్భావాపత్తి వచనాని సంపదాది పక్షేన సామంజస్యేన ఉపపద్యేరన్। తస్మాత్ న సంపదాది రూపం బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానం। అతో న పురుష వ్యాపార తంత్రా బ్రహ్మవిద్యా। కిం తర్హి? ప్రత్యక్షాది ప్రమాణ విషయ వస్తు జ్ఞానవత్ వస్తు తంత్రా। ఏవం భూతస్య బ్రహ్మణః త జ్జ్ఞానస్య చ న కయాచిత్ యుక్త్యా శక్యః కార్యాను ప్రవేశః కల్పయితుమ్।

51 (అ) శంకాపరిహారః — న చ విదిక్రియా కర్మత్వేన కార్యానుప్రవేశో బ్రహ్మణః "అన్యదేవ తద్విదితాత్

50 (అ) బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానము సంపదాది రూపమే యైనచో "తత్త్వమసి", "అహం బ్రహ్మాస్మి" "అయమాత్మా బ్రహ్మ ఇత్యాది బ్రహ్మాత్మైకత్వప్రతిపాదక వాక్యములయొక్క పదసమన్వయము బాధింపఁబడఁ గలదు

(ఆ) మరిన్ని, అవిద్యా నివృత్తి ఫలబోధక వాక్యములు అనగా "హృదయగ్రంధి విచ్చిపోవును, సర్వసంశయములు ఛేదింపఁబడును" అను వాక్యములు బాధితములు (నిరర్థకములు) గావలసివచ్చును (మోక్షము సంపదాది రూపమైనచో)

(ఇ) 'బ్రహ్మము నెరిగినవాఁడు బ్రహ్మమే యగుచున్నాడు' (ముం 3-2-9) అని యిటువంటి జీవునకు బ్రహ్మభావాప్తిరూపమగు వాక్యములు, సంపదాది పక్షమున సమంజసముగ సమన్వితములుగావు కావున బహ్మాత్మైకత్వ విజ్ఞానము సంపదాది రూపముగాదు ఈ విజ్ఞానము సంపదాది రూపమగు నుపాసనా విశేషము గాకపోవుటచే, బ్రహ్మవిద్య పురుషవ్యాపారతంత్రము గాదని నిశ్చయింప నగును అయితే బ్రహ్మవిద్య మఱి యెట్టిదన, ప్రత్యక్షాదిప్రమాణములకు విషయములగు వస్తువులవలె "వస్తుతంత్ర మగు ఇట్టి బ్రహ్మకుగాని, బ్రహ్మజ్ఞానమునకుగాని యెట్టి యుక్తిచేఁగూడ కర్మతో సంబంధము గల్పించుట శక్యముగాదు

51 (అ) శంకాపరిహార -(ఇచ్చట తొలగించవలసిన శంకయొకటి గలదు) 'బ్రహ్మవిదాప్నోతి పరం బ్రహ్మవిత్

అథో అవిదితాదధి" ( కేన 1-3 ) ఇతి విది క్రియా కర్మత్వ ప్రతిషేధాత్ "యేనేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్" ( బృ 2-4-13 ) ఇతి ।

(ఆ) తథోపాస్తి క్రియా కర్మత్వ ప్రతిషేధోఽపి భవతి । "యద్వాచా నభ్యుదితం, యేనవాగభ్యుద్యతే' ఇత్య విషయత్వం బ్రహ్మణ ఉపన్యస్య తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే' ( కేన 1-4 ) ఇతి ।

బ్రహ్మైవ భవతి ' యను శ్రుతులచే బ్రహ్మవేదనము (బ్రహ్మమునుఁ దెలియుట) పురుషార్థముగా వర్ణింపఁబడు చుండ, " వేదనము ' నందు బ్రహ్మము విషయమగుటంజేసి బ్రహ్మము విద్ = తెలియుట (విద్జ్ఞానే) అను ధాతువునకు గర్మగాఁ బ్రయోగింపఁబడుచుండ క్రియతో నెట్టి సంగతి పొసగదని చెప్పుటెట్లు? ఈ శంకకు పరిహారమిది—బ్రహ్మము విద్ల అనే క్రియకుఁ గర్మ యెంత మాత్రము గాదని వారించు చున్నది అందుకు శ్రుతులు – " ఆ బ్రహ్మము, విదితాత్ = తెలియఁబడిన కార్యము కంటెను, అన్యదేవ = విలక్షణమే, ఇంకను తెలియఁబడని కార్యము కంటెను భిన్నమే" అని బ్రహ్మమునకు ' విద్ల క్రియకు కర్మత్వమునుఁ బ్రతిషేధించు చున్నది " దేని చేత (ఏ బ్రహ్మము చేత) నీ సర్వము నెరుగుచున్నాడో దానిని దేనిచేత తెలియనగు ", అని శ్రుతికూడ నిదర్శించుచున్నది

(ఆ) ఆతీరుననే యుపాస్తి కర్మ కలాపములకు బ్రహ్మము విషయముకాదని తెలియుచున్నది ఇందుకు శ్రుతులు —" ఏ వస్తువు (వాచా) వాగింద్రియముచేఁ జెప్పఁబడదో యే వస్తువుచే వాగింద్రియము బయలు దేరుచున్నదో ' యను శ్రుతి బ్రహ్మము విషయము కాదని వివరించి, పిమ్మట " అట్టి బ్రహ్మము నీవే యని తెలిసి కొనుము ఏ యీ పురోవర్తియగు వస్తువు నుపాసించు చున్నావో, ఆ యీ పరిదృశ్యమానమగు వస్తువు బ్రహ్మముకాదు ' అని—

(ఇ) శంకా - అవిషయత్వే, బ్రహ్మణః శాస్త్రయో నిత్వానుపపత్తి రితి చేత్ ?

(ఈ) పరిహారః- న। అవిద్యా కల్పిత భేద నివృత్తి పరత్వాత్ శాస్త్రస్య। నహి శాస్త్రం ఇదం తయా విషయ భూతం బ్రహ్మ ప్రతిపిపాదయిషతి। కింతర్హి? ప్రత్యగాత్మ త్వేన అవిషయతయా ప్రతిపాదయత్ అవిద్యా కల్పితం వేద్య-వేదితృ- వేదనాదిభేదం అపనయతి। తథా చ శాస్త్రం

(1) ''యస్యా మతం తస్య మతం, మతం యస్య న వేదసః।
అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాతం అవిజానతాం '
( కేన 2-3 )

(2) '' న దృష్టేః ద్రష్టారం పశ్యేః '' '' న విజ్ఞాతే ర్విజ్ఞాతారం విజానీయాః '' ( బృహ 3-4-2 )
ఇతి చైవమాది।

(ఇ) శంక – బ్రహ్మము ఉపాసనాది క్రియలకు విషయము గానిచోఁ బూర్వసూత్రమందుఁ జెప్పఁబడిన 'శాస్త్రయోనిత్వము (శాస్త్రముచే నుపదేశింపఁబడుట) కూడ నసమంజసమగునేమో? యనినచో—

(ఈ) పరిహారము – అటులగాదు శాస్త్ర మవిద్యచేఁ గల్పింపఁబడిన భేదమునుఁ దొలగించుటయే తాత్పర్యముగాఁ గలది శాస్త్రము విషయభావమునుఁ బొందిన బ్రహ్మమును పురోవర్తి ఘటపటాదులనువలె ఇదమిత్థమని ప్రతిపాదింప నిచ్ఛయించుట లేదు మఱి యింకెటులన స్వస్వరూపముచే విషయభావము నొందని సర్వసాక్షిరూపముగా బోధించుచు, వేద్యము వేదిత, వేదనమను భేదమునుఁ దొలగించుచున్నది (త్రివిధభేదములఁ బోగొట్టి తదతీతమగు సాక్షిస్వరూపమును సూచించుచున్నది) అటులనే శ్రుతులు—

(1) ఎవనికి బ్రహ్మము చైతన్యమునకు అవిషయ మని నిశ్చయమో వానికి బ్రహ్మ తెలియఁబడినది ఎవనికి బ్రహ్మము చైతన్యమునకు విషయమని నిశ్చయమో అట్టివాఁడు బ్రహ్మము నెరుగడు బ్రహ్మము గోచరమగునని తెలిసికొన్న వారలకు బ్రహ్మ మవిషయము (తెలియఁబడనిది) బ్రహ్మము అదృశ్యమని తెలిసినవారికి దెలియఁబడినది (కేన 2-3)

(2) దృష్టియొక్క ద్రష్టను-సాక్షియగు నాత్మను (దృశ్యమగు నా దృష్టిచే) జూడలేవు విజ్ఞానమునుఁ దెలిసికొను వానిని అనగా బుద్ధి వృత్తికిసాక్షి యగు నాత్మను (ఆ బుద్ధిచే) దెలిసికొనలేవు (బృ 3-4-2) ఇట్టి శ్రుతులున్నవి

52 (అ) అతః అవిద్యాకల్పిత సంసారిత్వ నివర్తనేన నిత్యముక్తాత్మస్వరూప సమర్పణాత్, న మోక్షస్య అనిత్యత్వ దోషః। యస్య తూత్పాద్యః మోక్షః, తస్య మానసికం వాచికం కాయికం వా కార్యమపేక్షేత ఇతి యుక్తం। తథా వికార్యత్వే చ। తయోః పక్షయోః మోక్షస్య ధ్రువమనిత్యత్వం। నహి దధ్యాది వికార్యం ఉత్పాద్యం వాఘటాది నిత్యం దృష్టం లోకే।

(ఆ) న చాప్యత్వేనాపి కార్యాపేక్షా, స్వాత్మస్వరూపత్వే సతి అనాప్యత్వాత్ । స్వరూప వ్యతిరిక్తత్వేపి బ్రహ్మణోనాప్యత్వం, సర్వగతత్వేననిత్యాప్త స్వరూపత్వాత్ సర్వేణ బ్రహ్మణః ఆకాశస్యేవ। నాపి సంస్కార్యో మోక్షః, యేన వ్యాపార మపేక్షేత। సంస్కారోహి నామ సంస్కార్యస్య గుణాధానేనవా స్యాత్ దోషాపనయనేనవా।

52 (అ) (శాస్త్రము) అవిద్యచేఁ గల్పింపఁబడిన సంసారిత్వమునుఁ దొలగించి నిత్యముక్తాత్మ స్వరూపమే మోక్షమని (సమర్పణాత్ =) బోధించుటవలన, మోక్షమున కనిత్యత్వదోషము ప్రాప్తింపదు ఎవనికి మోక్ష ముత్పాద్య మని తలంపుఁగల్గునో, యట్టివాఁడు మానసికమో, వాచికమో, కాయికమో యగు కర్మచే మోక్షము కల్గునని చెప్పవలయును అట్లు మోక్ష ముత్పాద్యమనిగాని, వికార్య మనిగాని తలంపఁబడినచో యట్టి మోక్షమున కనిత్యత్వము ధ్రువంబగును లోకములో వికార్యములగు దధ్యాదులు గాని, ఉత్పాద్యములగు ఘటాదులుగాని నిత్యములుగాఁ జూడఁబడుట లేదుగదా।

(ఆ) బ్రహ్మరూపమగు మోక్షమున కాప్యత్వము (పొందఁదగియుండుట) ను బట్టి గూడ కార్యాపేక్ష లేదు వలనన, మోక్షమగు బ్రహ్మము (శోధించు) వానియొక్క (తనయొక్క) యాత్మ స్వరూపమే యగుట వలన, నాప్యము గాదు గావున (ఇక మోక్షము స్వ స్వరూపమగుచో, ఆప్యత్వము సిద్ధింపకపోవచ్చుగాని—స్వభిన్న మగుచో నాప్య త్వమును, గార్యాపేక్షయుఁ గలుగుననినచో అప్పుడుకూడ బ్రహ్మమున కాప్యత్వము సిద్ధింపనేరదు వలనన, ఆకాశము వలె బ్రహ్మము సర్వగత మగుటచేత, సర్వప్రపంచముతోఁ గూడి యెల్లప్పుడు పొందఁబడియున్న స్వరూపము గలదియే యగుటంజేసి ఆప్య మెన్నటికిఁ గానేరదు మోక్షము, మరి వ్యాపారము నపేక్షించునట్టి సంస్కార్యముగూడ కాదు వలన, సంస్కారమన సంస్కార్య వస్తువునకు గుణవృద్ధి

(ఇ) న తావద్గుణాధానేన సంభవతి, అనాధేయాతిశయ బ్రహ్మ స్వరూపత్వాత్ మోక్షస్య । నాపి దోషాపనయనేన, నిత్యశుద్ధ బ్రహ్మస్వరూపత్వాత్ మోక్షస్య ।

53 (అ) పూర్వపక్షః—స్వాత్మధర్మ ఏవసన్ తిరోభూతో మోక్షః క్రియయాఽఽత్మని సంస్క్రియమాణేఽభివ్యజ్యతే యథాఽఽదర్శే నిఘర్షణ క్రియయా సంస్క్రియమాణే భాస్వరత్వం ధర్మ ఇతి చేత్ ।

(ఆ) పరిహారః—న। క్రియాశ్రయత్వానుపపత్తేః ఆత్మనః । యదాశ్రయా క్రియా తం అవికుర్వతీ నైవాత్మానం లభతే । యది ఆత్మా క్రియయా విక్రియేత అనిత్యత్వం ఆత్మనః ప్రసజ్యేత । 'అవికార్యోఽయ ముచ్యతే' ఇతి చైవ మాదీని వాక్యాని బాధేరన్ । తచ్చానిష్టం । తస్మాత్ న స్వాశ్రయా క్రియాఽఽత్మనః సంభవతి ।

సేయుటయో, దోషమునుఁ బోఁగొట్టుటయో నై యుండ వలెనుగదా।

(ఇ) మోక్షమునకు గుణాధాయకమగు సంస్కారము ఘటింపదు ఏలన, మోక్షము నిరతిశయ బ్రహ్మస్వరూపము అందు మరియొక గుణమును కలుగఁజేసి యతిశయమును ఆపాదింప శక్యముగాదు కాన గుణాధానరూప సంస్కారము మోక్షమునకుఁ గలుగుటకు వీలులేదు ఇక "దోషము తొలగించుట" యను సంస్కారము కూడ వీలులేదు ఏలన, మోక్షరూపమగు బ్రహ్మము నిత్యశుద్ధము గావున నందు తొలగింపఁబడఁదగు దోషము లేకుండుటవలన దోషాపనయన సంస్కారము కూడ సంభవింపదు

53 (అ) పూర్వపక్షము - మోక్షము స్వాత్మధర్మమైననూ (స్వతస్సిద్ధముగా శుద్ధమైనను) అవిద్యచే తిరోభూతమగుచున్నది కాన క్రియాదులచే (కర్మ, ఉపాసన, ధ్యానాదులచే) సంస్కరింపఁబడినచో స్వస్వరూప మభివ్యక్తమగును గదా। ఉదా అద్దము స్వతస్సిద్ధముగా శుద్ధమైనను మాలిన్యముచే నావరింపఁబడగా, నిఘర్షణక్రియ (పైన తెల్ల గుడ్డతో రుద్దుట) చే నా మాలిన్యము దొలగి సంస్కరింపఁబడగా, భాస్వరత్వధర్మము బొందునుగదా యనినచో,

(ఆ) పరిహారము - అట్లుగాదు ఆత్మ క్రియాశ్రయమెంతమాత్రము కాదు ఏ క్రియ దేని నాశ్రయించునో యా క్రియ యా యాశ్రయమున కెట్టి వికారము గలిగింపకుండ స్వస్వరూపమును బొందనేరదు (ఆశ్రయమునకు వికారము గల్పింపకఁబోయినచో తాను క్రియ గానేరదు) ఆత్మ

(ఇ) కించ, అన్యాశ్రయాయాస్తు క్రియాయా అవిషయత్వాత్, న తయా ఆత్మా సంస్క్రియతే।

(ఈ) పూర్వపక్షః—నను దేహాశ్రయయా స్నానాచమన యజ్ఞోపవీతధారణాదికయా క్రియయా దేహీ సంస్క్రియమాణో దృష్టః।

(ఉ) పరిహారః— న। దేహాది సంహతస్యైవ, అవిద్యా గృహీతస్య ఆత్మనః సంస్క్రియమాణత్వాత్। ప్రత్యక్షం హి స్నానాచమనాదేః దేహ సమవాయిత్వం। తయా దేహాశ్రయయా తత్సంహత ఏవ కశ్చి దవిద్యయాత్మత్వేన పరిగృహీతః సంస్క్రియతే ఇతి యుక్తం। యథా దేహాశ్రయ చికిత్సా నిమిత్తేన ధాతు సామ్యేన తత్సంహతస్య తదభిమానినః "అహమరోగః" ఇతి యత్ర బుద్ధిరుత్పద్యతే। ఏవం స్నానాచమన యజ్ఞోపవీతధారణాదినా, "అహం శుద్ధః సంస్కృతః" ఇతి యత్ర బుద్ధిరుత్పద్యతే, స సంస్క్రియతే। స చ దేహేన సంహత ఏవ। తేనైవహి

క్రియచే వికారింపఁబడినచో నాత్మకు నాశప్రసంగము గల్గును "అవికార్యము ఆత్మయనిఁ జెప్పఁబడుచున్నది ఇత్యాది శ్రుతివాక్యములు బోధింపఁబడ గలవు అది యెల్లరకు (ఉభయవాదులకు, శ్రుతి స్మృతులకు) అనిష్టముగదా! కావున నాత్మకు స్వాశ్రయమగు క్రియ యెంతమాత్రము సంభవింపదు

(ఇ) మరియు వేరొక వస్తువు నాశ్రయించిన క్రియచే నాత్మకు సంస్కారము కలుగకూడదా యన, అన్యాశ్రయమైన క్రియతో నాత్మకు సంబంధము లేకపోవుటచే దానివలన నాత్మకు నెట్టి సంస్కారము గలుగదు

(ఈ) పూర్వపక్షము—ఏమండీ! దేహముతో సంబంధించిన క్రియచే, అనగా స్నాన, ఆచమన, యజ్ఞోపవీత ధారణాదిక క్రియలచే దేహి (దేహధారుఁడు) సంస్కరింపఁబడుచున్నవాఁడై కన్పట్టుచున్నాడుగదా!

(ఉ) పరిహారము —అట్లుగాదు అజ్ఞానముచే దేహాదులందు తాదాత్మ్యాభిమానముగల ఆత్మయే సంస్కరింపబడుచున్నాడు గాని కేవల సాక్షియగు ఆత్మగాదు ఎట్లన, స్నానాచమనదులు దేహమునకు సంబంధించినవని ప్రత్యక్షముగాఁ గనుచున్నాముగదా! అట్టి క్రియలచే దేహమునందజ్ఞానవశమున తాదాత్మ్యాభిమానము చెందినవాఁడే సంస్కరింపఁబడుచున్నా డనుట యుక్తంబగు (మరిన్ని) దేహమునకు సంబంధించిన చికిత్సవలనఁ గలిగెడి ధాతు స్వస్థతచే నా దేహ మాత్మగా నభిమానించువానికి "నే నరోగి" నని యెవనికి బుద్ధి కలుగుచున్నదో యటులనే స్నానాచ

అహం కర్త్రాఽహం ప్రత్యయ విషయేణ ప్రత్యయినా సర్వాః క్రియాః నిర్వర్త్యన్తే । తత్ఫలం చ స ఏవ అశ్నాతి ।

(ఈ) (1) "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్ అన్యో అభిచాకశీతి (ముం 3-1-1), ఇతి మంత్ర వర్ణాత్ ।

(2) "ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః (కఠ 1-3-4) ఇతి చ ।

(3) తథాచ "ఏకో దేవః సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా
కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ"
(శ్వేతా 6-11)

మన యజ్ఞోపవీతధారణాదులచే "నేను శుద్ధుఁడను, సంస్కృతుఁడ' నని యెవనికి బుద్ధి కలుగుచున్నదో వాఁడే సంస్కరింపఁబడుచున్నాడు అట్లుదలచువాఁడు దేహముతోఁ గూడినవాఁడే (దేహేన సంహతః) అహమ్మను నభిమానము చెంది నేను కర్తనను అహం ప్రత్యయమునకు విషయమైన వానిచేతనే సమస్త లౌకిక వైదిక క్రియలు నిర్వర్తింపఁబడు చున్నవి అజ్ఞాన వశమున దేహముతోఁ దాదాత్మ్యమునుఁ జెందినవాఁడే తత్ఫలముల ననుభవించుచున్నాడు

(ఈ) ఇందులకు శ్రుతులు—

(1) వారిలో (జీవాత్మ పరమాత్మలలో) జీవాత్మ, పిప్పలం = కర్మఫలమును, మనోహరముగా తినుచున్నాడు అన్యుఁడు (పరమాత్మ) భుజింపకఁ ప్రకాశించుచున్నాడు (ముం 3-1-1) అని మంత్ర వర్ణము

(2) దేహేంద్రియ మనస్సులతోఁగూడిన (అనగా, సంహతమైన) ఆత్మను 'భోక్త' యని విద్వాంసులు పలుకు చున్నారు (కఠ 1-3-4) అనియు

3 (పైన సంహత భావమునుఁజెప్పి, యిక పరమాత్మకు అనాధేయాతిశయ, నిత్య శుద్ధత్వములఁ బ్రదర్శించు శ్రుతులఁ జూపుచున్నాడు అటులనే, "ఒకడే దేవుఁడు, సర్వ భూతములందు గూఢముగా నున్నాడు సర్వమును వ్యాపించి యున్నాడు, సర్వభూతముల కాత్మగ నున్నాడు, సర్వజీవుల సర్వకర్మలకు ప్రభువు సర్వభూతములందు ఒక్కఁగా నివసించుచున్నాడు సాక్షి, చేతనుఁడు, కేవలుఁడు నిర్గుణుఁడు కూడ' (శ్వేతా 6-11) అని

(4) "సపర్యగాచ్ఛుక్ర మకాయం అవ్రణ మస్నావిరం శుద్ధ మపాపవిద్ధం" ( ఈశ 8 )

ఇతి చ ఏతౌ మంత్రౌ అనాధేయాతిశయతాం నిత్యశుద్ధతాంచ బ్రహ్మణో దర్శయతః। తస్మాత్ నసంస్కారోఽపి మోక్షః అతోఽన్యత్ మోక్షం ప్రతి క్రియానుప్రవేశ ద్వారం న శక్యం కేన చిద్దర్శయితుం। తస్మాత్ జ్ఞానమేకం ముక్త్వా క్రియయా గంధమాత్ర స్యాపి అనుప్రవేశః ఇహ నోపపద్యతే।

54 (అ) పూర్వపక్ష - నను జ్ఞానంనామ మానసీ క్రియా?

(ఆ) పరిహారః - న। వైలక్షణ్యాత్ । క్రియాహి నామ సా యత్ర వస్తుస్వరూప నిరపేక్షా ఏవ చోద్యతే, పురుషచిత్త వ్యాపారా ధీనాచ। యథా "యస్యై దేవతాయై హవిర్గృహీతం స్యాత్, తాం మనసా ధ్యాయేత్ వషట్కరిష్యన్ ' ఇతి। "సంధ్యాం మనసా ధ్యాయేత్ ( ఐత బ్రా 3-8-1 ) ఇతి చైవ మాదిషు। ధ్యానం చింతనం యద్యపి మానసం, తథాపి పురుషేణ కర్తుం, అకర్తుం అన్యథావా కర్తుం శక్యం, పురుష తంత్రత్వాత్ ।

4 "ఆపరమాత్మ పర్యగాత్ = అంతటను నిండి యున్నాడు, శుక్రం = జ్యోతి స్వభావముగలవాఁడు, అవ్రణం = దుఃఖరహితుఁడు, అస్నావిరం = నాశము లేని వాఁడు, శుద్ధుడు, పుణ్యపాపములు లేనివాడు (ఈశా 8) అనియు

ఈ రెండు మంత్రములు అనాధేయాతిశయత్వమును (గుణాధానముచే నతిశయమును కల్పింప వీలుకాకపోవుట), నిత్యశుద్ధత్వమును బ్రహ్మకుఁ జూపించుచున్నవి కావున మోక్షము సంస్కార్య రూపముగాదు ఇంతకంటె మరియొక విధమైన క్రియతో సంబంధముగల ద్వారము మోక్షమునకు ఎవ్వరిచేత, నెవ్విధముగనైనఁ బ్రతిపాదింపఁ బడుటకు శక్యము గాదు కావున కేవలము జ్ఞానమును వదలి వేరొకవిధమున క్రియతో లేశమైన మోక్షమునకు సంబంధము యుక్తము గాదు

54 (అ) పూర్వపక్షము – ఏమండీ, 'జ్ఞాన మన మానసిక క్రియగదా? (అట్టి విషయమునఁ గ్రియచే మోక్షము గలుగదను టెట్లు?)

(ఆ) పరిహారము – అటులకాదు భేదముండుట వలన (జ్ఞానము మానసిక క్రియారూపమట్లుఁ దోఁచినను విధి చోదితమగు క్రియకంటె విలక్షణ (భిన్న) మైనది క్రియ యనగా వస్తుస్వరూపముతో నిమిత్తము లేకుండ విధింపఁ బడునది (అనగా ఉపాసనములో ధ్యానింపఁబడు వస్తు వొకటి (దేవత యొకటి), మరియు ధ్యానకాలములో మనస్సు కుదురుటకుగా నేర్పరచుకొనబడు నాలంబన వస్తు

(ఇ) జ్ఞానం తు ప్రమాణ జన్యం। ప్రమాణం చ యథా భూత వస్తు విషయం। అతో జ్ఞానం కర్తు మకర్తు మన్యథావాకర్తు మశక్యం, కేవలం వస్తుతంత్రమేవ తత్ । న చోదనా తంత్రం , నాపి పురుష తంత్రం। తస్మాత్ మాన సత్వేఽపి జ్ఞానస్య మహా ద్వైలక్షణ్యం

(ఈ) యథాచ "పురుషో వావ గౌతమాగ్నిః "యోషా వావ గౌత మాగ్నిః" ( ఛాం 5-7-8-1 ) ఇత్యత్ర యోషిత్ పురుషయోః అగ్ని బుద్ధిర్మానసీ భవతి। కేవల చోదనా జన్యత్వాత్ క్రియైవ సా పురుష తంత్రాచ। యా తు ప్రసిద్ధేఽగ్నావగ్ని బుద్ధి ర్నసా చోదనాతంత్రా।

వొకటి ( విగ్రహము-మంత్రాదులు ) ఉపాసన విధులీ రెండు వస్తువు " లిట్టివి, యట్టివి ' యని జెప్పవు 'ఇదియే యది గా ధ్యానింపుమని మాత్రము జెప్పును అట్లు చేయు ధ్యానము మానసిక క్రియయే కాని యా క్రియ పురుషుని చిత్త వ్యాపారమునకు లోబడియుండును ఎట్లన, ఏ దేవత కొరకు హోమ ద్రవ్యము దీసికొనఁబడునో యా దేవతనుఁ గూర్చి ' వషట్ యని బల్కుచు ధ్యానముసేయవలెను " సంధ్యాదేవతను మనస్సుచే ధ్యానింపవలెను " ( ఐ బ్రా 3-8-1 ) ధ్యానము, చింతనము అనునది మనస్సుతోఁ జేయఁబడు క్రియయే యైనను పురుషునిచేఁ జేయఁబడుటకు, మానుటకు, వేరొకరీతిగాఁ జేయుటకు శక్యమగుటచేత పురుషుని యధీనమై యున్నవి

(ఇ) జ్ఞానము ప్రత్యక్షాది ప్రమాణమువలనఁ బుట్టును ప్రమాణము వస్తుస్వరూప మెట్లుండునో యట్లే గోచరింపఁ జేయునది కావున జ్ఞానము చేయఁబడుటకును, మానివేయఁ బడుటకును, వేరొకవిధమునఁ జేయఁబడుటకును, శక్యమెంత మాత్రముగాదు జ్ఞాన మనునది కేవల వస్తుతంత్రమే చోదనా తంత్రము గాదు పురుష తంత్రము గాదు కావున జ్ఞానము మానసికమే యైనను గొప్ప భేదము సుస్పష్టము

(ఈ) ఎటులయితే పంచాగ్ని విద్యయందు పురుషుఁడే యగ్నియనియు, స్త్రీయే యగ్నియనియు భావన చేయవలయునను నుపదేశములచే స్త్రీ పురుషులందు మానసికమగు నగ్ని బుద్ధి చోదనాజన్యమగుటచేత, మానవ బుద్ధ్యధీనమగుటచే క్రియయే యగుచున్నది ప్రసిద్ధమగు నగ్ని

(ఇ) న తావద్గుణాధానేన సంభవతి, అనాధేయాతిశయ బ్రహ్మ స్వరూపత్వాత్ మోక్షస్య । నాపి దోషాపనయనేన, నిత్యశుద్ధ బ్రహ్మస్వరూపత్వాత్ మోక్షస్య ।

53 (అ) పూర్వపక్షః—స్వాత్మధర్మ ఏవసన్ తిరోభూతో మోక్షః క్రియయాఽఽత్మని సంస్క్రియమాణేఽభివ్యజ్యతే యథాఽఽదర్శే నిఘర్షణ క్రియయా సంస్క్రియమాణే భాస్వరత్వం ధర్మ ఇతి చేత్ ।

(ఆ) పరిహారః—న। క్రియాశ్రయత్వానుపపత్తేః ఆత్మనః । యదాశ్రయా క్రియా తం అవికుర్వతీ నైవాత్మానం లభతే । యది ఆత్మా క్రియయా వి క్రియేత అనిత్యత్వం ఆత్మనః ప్రసజ్యేత । 'అవికార్యోఽయ ముచ్యతే' ఇతి చైవ మాదీని వాక్యాని బాధేరన్ । తచ్చానిష్టం । తస్మాత్ న స్వాశ్రయా క్రియాఽఽత్మనః సంభవతి ।

సేయుటయో దోషమునుఁ బోగొట్టుటయో యై యుండ వలెనుగదా!

(ఇ) మోక్షమునకు గుణాధాయకమగు సంస్కారము ఘటింపదు. ఏలన మోక్షము నిరతిశయ బ్రహ్మస్వరూపము. అందు మరియొక గుణమును కలుగఁజేసి యతిశయమును ఆపాదింప శక్యముగాదు. కాన గుణాధానరూప సంస్కారము మోక్షమునకుఁ గలుగుటకు వీలులేదు. ఇక "దోషము తొలగించుట" యను సంస్కారము కూడ వీలులేదు. ఏలన, మోక్షరూపమగు బ్రహ్మము నిత్యశుద్ధము గావున నందు తొలగింపఁబడఁదగు దోషము లేకుండుటవలన, దోషాపనయన సంస్కారము కూడ సంభవింపదు.

53 (అ) పూర్వపక్షము - మోక్షము స్వాత్మధర్మమైననూ (స్వతస్సిద్ధముగా శుద్ధమైనను) అవిద్యచే తిరోభూతమగుచున్నది. కాన, క్రియాదులచే (కర్మ, ఉపాసన, ధ్యానాదులచే) సంస్కరింపఁబడినచో స్వస్వరూప మభివ్యక్తమగును గదా! ఉదా. అద్దము స్వతస్సిద్ధముగా శుద్ధమైనను మాలిన్యముచే నావరింపఁబడగా, నిఘర్షణక్రియ (పైన తెల్ల గుడ్డతో రుద్దుట) చే నా మాలిన్యము దొలగి సంస్కరింపఁబడగా, భాస్వరత్వధర్మము పొందునుగదా యనినచో,

(ఆ) పరిహారము - అట్లుగాదు. ఆత్మ క్రియాశ్రయ మెంతమాత్రము కాదు. ఏ క్రియ దేని నాశ్రయించునో యా క్రియ యా యాశ్రయమున కెట్టి వికారము గలిగింపకుండ స్వస్వరూపమును బొందనేరదు (ఆశ్రయమునకు వికారము గల్పింపకఁబోయినచో తాను క్రియ గానేరదు). ఆత్మ,

(ఇ) కించ, అన్యాశ్రయాయాస్తు క్రియాయా అవిషయత్వాత్, న తయా ఆత్మా సంస్క్రియతే ।

(ఈ) పూర్వపక్షః— నను దేహాశ్రయయా స్నానాచమన యజ్ఞోపవీతధారణాదికయా క్రియయా దేహీ సంస్క్రియమాణో దృష్టః ।

(ఉ) పరిహారః— న । దేహాది సంహతస్యైవ, అవిద్యా గృహీతస్య ఆత్మనః సంస్క్రియమాణత్వాత్ । ప్రత్యక్షం హి స్నానాచమనాదేః దేహ సమవాయిత్వం । తయా దేహాశ్రయయా తత్సంహత ఏవ కశ్చి దవిద్యయాత్మత్వేన పరిగృహీతః సంస్క్రియతే ఇతి యుక్తం । యథా దేహాశ్రయ చికిత్సా నిమిత్తేన ధాతు సామ్యేన తత్సంహతస్య తదభిమానినః "అహమరోగః" ఇతి యత్ర బుద్ధిరుత్పద్యతే । ఏవం స్నానాచమన యజ్ఞోపవీతధారణాదినా, "అహం శుద్ధః సంస్కృతః" ఇతి యత్ర బుద్ధిరుత్పద్యతే, స సంస్క్రియతే । స చ దేహేన సంహత ఏవ । తేనైవహి

క్రియచే వికారింపఁబడినచో నాత్మకు నాశప్రసంగము గల్గును “అవికార్యము ఆత్మయనిఁ జెప్పఁబడుచున్నది” ఇత్యాది శ్రుతివాక్యములు బోధింపఁబడ గలవు అది యెల్లరకు (ఉభయవాదులకు శ్రుతి స్మృతులకు) అనిష్టముగదా। కావున నాత్మకు స్వాశ్రయమగు క్రియ యెంతమాత్రము సంభవింపదు

(ఇ) మరియు, వేరొక వస్తువు నాశ్రయించిన క్రియచే నాత్మకు సంస్కారము కలుగకూడదా యన, అన్యాశ్రయమైన క్రియతో నాత్మకు సంబంధము లేకపోవుటచే దానివలన నాత్మకు నెట్టి సంస్కారము గలుగదు

(ఈ) పూర్వపక్షము—ఏమండీ। దేహముతో సంబంధించిన క్రియచే అనగా స్నాన, ఆచమన, యజ్ఞోపవీత ధారణాదిక క్రియలచే దేహి (దేహధారుఁడు) సంస్కరింపఁబడుచున్నవాఁడై కన్పట్టుచున్నాడుగదా।

(ఉ) పరిహారము—అట్లుగాదు అజ్ఞానముచే దేహాదులందు తాదాత్మ్యాభిమానముగల ఆత్మయే సంస్కరింపబడుచున్నాడు గాని కేవల సాక్షియగు ఆత్మగాదు ఎట్లన, స్నానాచమన దులు దేహమునకు సంబంధించినవని ప్రత్యక్షముగాఁ గనుచున్నాముగదా। అట్టి క్రియలచే దేహమునందజ్ఞానవశమున తాదాత్మ్యాభిమానము చెందినవాఁడే సంస్కరింపఁబడుచున్నాడనుట యుక్తంబగు (మరిన్ని) దేహమునకు సంబంధించిన చికిత్సవలనఁ గలిగెడి ధాతు స్వస్థతచే, నా దేహ మాత్మగా నభిమానించువానికి “నే నరోగి” నని యెవనికి బుద్ధి కలుగుచున్నదో యటులనే స్నానాచ

అహం కర్తా౽హం ప్రత్యయ విషయేణ ప్రత్యయినా సర్వాః క్రియాః నిర్వర్త్యన్తే । తత్ఫలం చ స ఏవ అశ్నాతి ।

(ఈ) (1) "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్ అన్యో అభిచాకశీతి" (ముం 3-1-1), ఇతి మంత్ర వర్ణాత్ ।

(2) "ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః" (కఠ 1-3-4) ఇతి చ ।

(3) తథాచ "ఏకో దేవః సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా
కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ"
(శ్వేతా 6-11)

మన యజ్ఞోపవీతధారణాదులచే "నేను శుద్ధుఁడను, సంస్కృతుఁడ" నని యెవనికి బుద్ధి కలుగుచున్నదో వాఁడే సంస్కరింపఁబడుచున్నాడు అట్లు దలచువాఁడు దేహముతోఁ గూడినవాఁడే (దేహేన సంహతః) అహమ్మను నభిమానము చెంది నేను కర్తనను అహం ప్రత్యయమునకు విషయమైన వానిచేతనే సమస్త లౌకిక వైదిక క్రియలు నిర్వర్తింపఁబడు చున్నవి అజ్ఞాన వశమున దేహముతోఁ దాదాత్మ్యమునుఁ జెందినవాఁడే తత్ఫలముల ననుభవించుచున్నాడు

(ఈ) ఇందులకు శ్రుతులు—

(1) వారిలో (జీవాత్మ పరమాత్మలలో) జీవాత్మ, పిప్పలం = కర్మఫలమును, మనోహరముగా తినుచున్నాడు అన్యుఁడు (పరమాత్మ) భుజింపకఁ బ్రకాశించుచున్నాడు (ముం 3-1-1) అని మంత్ర వర్ణము

(2) దేహేంద్రియ మనస్సులతోఁగూడిన (అనగా, సంహతమైన) ఆత్మను 'భోక్త' యని విద్వాంసులు పలుకు చున్నారు (కఠ 1-3-4) అనియు

3 (పైన సంహత భావమునుఁజెప్పి, యిక పరమాత్మకు అనాధేయాతిశయ, నిత్య శుద్ధత్వములఁ బ్రదర్శించు శ్రుతులఁ జూపుచున్నాడు అటులనే, "ఒకడే దేవుఁడు, సర్వ భూతములందు గూఢముగా నున్నాడు, సర్వమును వ్యాపించి యున్నాడు, సర్వభూతముల కాత్మగ నున్నాడు, సర్వజీవుల సర్వకర్మలకు ప్రభువు సర్వభూతములందు జక్క—గా నివసించుచున్నాడు సాక్షి, చేతనుఁడు, కేవలుఁడు, నిర్గుణుఁడు కూడ (శ్వేతా 6-11) అని

(4) "సపర్యగాచ్ఛుక్ర మకాయం అవ్రణ మస్నావిరం శుద్ధ మపాపవిద్ధం" ( ఈశ 8 )

ఇతి చ ఏతౌ మంత్రౌ అనాధేయాతిశయతాం నిత్యశుద్ధతాంచ బ్రహ్మణో దర్శయతః। తస్మాత్ నసంస్కార్యోఽపి మోక్షః అతోఽన్యత్ మోక్షం ప్రతి క్రియాను ప్రవేశ ద్వారం న శక్యం కేన చిద్దర్శయితుం। తస్మాత్ జ్ఞాన మేకం ముక్త్వా క్రియయా గంధమాత్ర స్యాపి అనుప్రవేశః ఇహా నోపపద్యతే।

54 (అ) పూర్వపక్ష - నను జ్ఞానంనామ మానసీ క్రియా ?

(ఆ) పరిహారః - న। వైలక్షణ్యాత్ । క్రియాహి నామ సా యత్ర వస్తుస్వరూప నిరపేక్షా ఏవ చోద్యతే పురుషచిత్త వ్యాపారా ధీనాచ। యథా "యస్యై దేవతాయై హావిర్గృహీతం స్యాత్, తాం మనసా ధ్యాయేత్ వషట్కరిష్యన్ ' ఇతి। "సంధ్యాం మనసా ధ్యాయేత్ (ఐత బ్రా 3-8-1 ) ' ఇతి చైవ మాదిషు। ధ్యానం చింతనం యద్యపి మానసం, తథాపి పురుషేణ కర్తుం, అకర్తుం, అన్యథావా కర్తుం శక్యం, పురుష తంత్రత్వాత్ ।

4 "ఆపరమాత్మ పర్యగాత్ = అంతటను నిండి యున్నాడు, శుక్రం = జ్యోతి స్వభావముగలవాఁడు, అవ్రణం = దుఃఖరహితుఁడు, అస్నావిరం = నాశము లేని వాఁడు, శుద్ధుడు, పుణ్యపాపములు లేనివాడు (ఈశా 8) అని యు

ఈ రెండు మంత్రములు అనాధేయాతిశయత్వమును (గుణాధానముచే నతిశయమును కల్పింప వీలుకాకపోవుట), నిత్యశుద్ధత్వమును బ్రహ్మకుఁ జూపించుచున్నవి కావున మోక్షము సంస్కార్య రూపముగాదు ఇంతకంటె మరియొక విధమైన క్రియతో సంబంధముగల ద్వారము మోక్షమునకు ఎవ్వరిచేత, నెవ్విధముగనైనఁ బ్రతిపాదింపఁ బడుటకు శక్యము గాదు కావున కేవలము జ్ఞానమును వదలి వేరొకవిధమున క్రియతో లేశమైన మోక్షమునకు సంబంధము యుక్తము గాదు

54 (అ) పూర్వపక్షము – ఏమండీ, 'జ్ఞాన మన మానసిక క్రియగదా ? (అట్టి విషయమునఁ గ్రియచే మోక్షము గలుగదను టెట్లు?)

(ఆ) పరిహారము – అటులకాదు భేదముండుట వలన (జ్ఞానము మానసిక క్రియరూపమట్లుఁ దోచినను విధి చోదితమగు క్రియకంటె విలక్షణ (భిన్న) మైనది క్రియ యనగా వస్తుస్వరూపముతో నిమిత్తము లేకుండ విధింపఁ బడునది (అనగా ఉపాసనములో ధ్యానింపఁబడు వస్తు వొకటి (దేవత యొకటి), మరియు ధ్యానకాలములో మనస్సు కుదురుటకుగా నేర్పరచుకొనబడు నాలంబన వస్తు

(ఇ) జ్ఞానం తు ప్రమాణ జన్యం। ప్రమాణం చ యథా భూత వస్తు విషయం। అతో జ్ఞానం కర్తు మకర్తు మన్యథావాకర్తు మశక్యం, కేవలం వస్తుతంత్రమేవ తత్। న చోదనా తంత్రం, నాపి పురుష తంత్రం। తస్మాత్ మానస త్వేఽపి జ్ఞానస్య మహా ద్వైలక్షణ్యం

(ఈ) యథాచ "పురుషో వావ గౌతమాగ్నిః" "యోషా వావ గౌత మాగ్నిః' (ఛాం 5-7-8-1) ఇత్యత్ర యోషిత్ పురుషయోః అగ్ని బుద్ధిర్మానసీ భవతి। కేవల చోదనా జన్యత్వాత్ క్రియైవ సా పురుష తంత్రాచ। యా తు ప్రసిద్ధేఽగ్నావగ్ని బుద్ధి ర్నసా చోదనాతంత్రా।

వొకటి ( విగ్రహము-మంత్రాదులు ) ఉపాసన విధు లీ రెండు వస్తువు "లిట్టివి, యట్టివి" యని జెప్పవు 'ఇదియే యది గా ధ్యానింపుమని మాత్రము జెప్పును అట్లు చేయు ధ్యానము మానసిక క్రియయే కాని యా క్రియ పురుషుని చిత్త వ్యాపారమునకు లోబడియుండును ఎట్లన, ఏ దేవత కొరకు హోమ ద్రవ్యము దీసికొనఁబడునో, యా దేవతనుఁ గూర్చి 'వషట్' యని బల్కుచు ధ్యానము సేయవలెను "సంధ్యాదేవతను మనస్సుచే ధ్యానింపవలెను ( ఐ బ్రా 3-8-1 ) ధ్యానము, చింతనము అనునది మనస్సుతోఁ జేయఁబడు క్రియయే యైనను పురుషునిచేఁ జేయఁబడుటకు, మానుటకు, వేరొకరీతిగాఁ జేయుటకు శక్యమగుటచేత పురుషుని యధీనమై యున్నవి

(ఇ) జ్ఞానము ప్రత్యక్షాది ప్రమాణమువలనఁ బుట్టును ప్రమాణము వస్తుస్వరూప మెట్లుండునో యట్లే గోచరింపఁ జేయునది కావున జ్ఞానము చేయఁబడుటకును, మానివేయఁ బడుటకును, వేరొకవిధమునఁ జేయఁబడుటకును, శక్యమెంత మాత్రముగాదు జ్ఞాన మనునది కేవల వస్తుతంత్రమే చోదనా తంత్రము గాదు పురుష తంత్రము గాదు కావున జ్ఞానము మానసికమే యైనను గొప్ప భేదము సుస్పష్టము

(ఈ) ఎటులయితే పంచాగ్ని విద్యయందు పురుషుఁడే యగ్నియనియు, స్త్రీయే యగ్నియనియు భావన చేయ వలయునను నుపదేశములచే స్త్రీ పురుషులందు మానసిక మగు నగ్ని బుద్ధి చోదనాజన్యమగుటచేత, మానవ బుద్ధ్యధీన మగుటచే క్రియయే యగుచున్నది ప్రసిద్ధమగు నగ్ని

నాపి పురుష తంత్రా । కింతర్హి ? ప్రత్యక్ష విషయవస్తుతంత్రే వేతి జ్ఞాన మేవతత్, నక్రియా, ఏవం సర్వ ప్రమాణ వస్తుషు వేదితవ్యం ।

(ఉ) తత్రైవం సతి యథా భూత బ్రహ్మాత్మ విషయ మపి జ్ఞానం న చోదనా తంత్రమ్। త ద్విషయే లిజ్గాదయః శ్రూయమాణా అపి అనియోజ్య విషయత్వాత్ కుంఠీ భవంతి ఉపలాదిషు ప్రయుక్త క్షురతైక్ష్ణ్యాదివత్, అహేయానుపాదేయ వస్తు విషయత్వాత్ ।

55 (అ) శంకా - కిమర్థాని తర్హి "ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్య ఇత్యాదిని, విధిచ్ఛాయా వచనాని?

(ఆ) పరిహారః- స్వాభావిక ప్రవృత్తి విషయ విముఖీ కరణార్థాని - ఇతి బ్రూమః ।

యందలి నగ్ని బుద్ధికూడ మానసికమే యైనను చోదనా తంత్రమును, పురుష తంత్రమును కాక ప్రత్యక్షమునకు విషయమగు వస్తువగు నగ్న్యధీనమగుటవలన వస్తుతంత్రము గావున నయ్యది జ్ఞానము గాని, క్రియ యెంతమాత్రము గాదు ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన శాబ్ద మను ప్రమాణములవలనఁ తెలియఁబడు సర్వవిషయములఁ గూర్చియు నిటులనే తెలిసికొనవలయును

(ఉ) ఇట్టి న్యాయముచే యోజించినప్పుడు సిద్ధ వస్తువగు బహ్మమనెడి యాత్మతో సంబంధించిన జ్ఞానము కూడ బ్రహ్మాత్మ విషయమగుటం జేసి వస్తుతంత్రమేగాని చోదనాతంత్రము గాదు నియమింపఁబడు విషయము లేకపోవుటవలన నాత్మజ్ఞాన విషయమున వినఁబడు లిజ్ లోట్, తవ్య ప్రత్యయములు అన్నియు కుంఠీభావము నొందు చున్నవి అవి యేవిధముగ నన, రాళ్ళమీద నుపయోగింపఁ బడిన క్షురము (కత్తి) యొక్క వాడితనము వలె ఎందుచేత నన హేయముగాని యుపాదేయముగాని గానట్టి సిద్ధ వస్తువిషయక మగుటవలన

55 (అ) శంక - సిద్ధవస్తువుల బోధించుటలో విధు లకుఁ బ్రయోజనము లేనిచో "ఆత్మయే జూడఁబడవలె, విన బడవలె యను విధిని బోలియున్న వాక్యముల గతియేమి?

(ఆ) పరిహారము - స్వభావ సిద్ధమగు ప్రవృత్తికిఁ గారణభూతములగు విషయములనుండి పురుషునియొక్క బుద్ధిని మరలించుటయే యీ విధిచ్ఛాయా వాక్యములఁ బ్రయోజనమని మేము సెప్పుచున్నాము

(ఇ) యోహి బహిర్ముఖః ప్రవర్తతే పురుషః "ఇష్టం మే భూయాత్ అనిష్టం మే మా భూత్" ఇతి నచ తత్రాత్యన్తికం పురుషార్థం లభతే, తం ఆత్యన్తిక పురుషార్థ వాంఛినం స్వాభావిక కార్యకరణ సంఘాత ప్రవృత్తి గోచరాత్ విముఖీకృత్య ప్రత్యగాత్మ స్రోతస్తయా ప్రవర్తయన్తి "ఆత్మావారే ద్రష్టవ్యః" ఇత్యాదీని।

(ఈ) తస్యాత్మాన్వేషణాయ ప్రవృత్తస్య అహేయమనుపాదేయం చాత్మతత్త్వ ముపదిశ్యతే।

(1) 'ఇదం సర్వం యదయమాత్మా' (బృ 2-4-6)

(2) "యత్ర త్వస్య సర్వమాత్మైవా భూత్, తత్కేన కం పశ్యేత్, కేనకంజిఘ్రేత్ కేనకం విజానీయాత్, విజ్ఞాతార మరే కేన విజానీయాత్" (బృ 4-5-15)

(3) "అయ మాత్మా బ్రహ్మ (బృ 2-5-19) ఇత్యాదిభిః

56 (అ) శంకా యదుం, అకర్తవ్య ప్రధానం ఆత్మజ్ఞానం హానాయోపాదానాయవా నభవతీతి ?

(ఇ) ఏ పురుషుఁడైతే బాహ్యావిషయములందుఁ బ్రవర్తించువాఁడై, 'నా కిష్టమయినది గలుగవలయును, అనిష్టమైనది గలుగకూడ దను నభిలాషతో, బాహ్యావిషయములందుఁ బుష్కలమగు బురుషార్థమును లభింపమి, పరమ పురుషార్థ మెచ్చోఁలభించునని తీవ్రముగ నిచ్ఛగించువానిని, స్వాభావికమైన కార్యకరణ సంఘాతము యొక్క ప్రవృత్తికి విషయమగు శబ్దాదులనుండి విముఖునిఁజేసి "ఆత్మా వారే ద్రష్టవ్యః" ఇట్టి వాక్యాదులు అంతరితమగు ప్రత్యగాత్మ చింతనమును గూర్చి ప్రవర్తింపఁజేయును

(ఈ) ఆత్మాన్వేషణమును గురించి ప్రవర్తించు జిజ్ఞాసువుల గూర్చి హేయోపాదేయ రహితమగు నాత్మతత్వ ముపదేశింపఁబడుచున్నది ఎట్లు? దిగువ శ్రుతుల వలన

1 ఈ సర్వమంతయు నాత్మయే (బృ 2-4-6)

2 ఏ స్థితియందు ఎవ్వనికైతే సర్వము ఆత్మ పదార్థమే ఆయెనో ఆ సమయమున నెవ్వ డే సాధనముతో దేనిని చూచును? ఏ సాధనముతో దేనిని వాసన చూచును? దేనితో దేనిని తెలిసికొనును? సర్వము తెలిసికొనువానిని ఓసీ మైత్రేయీ, దేనిచోఁ దెలియనగును?" (బృ 4-5-15)

(3) ఈ యాత్మయే బ్రహ్మ (బృ 2-5-19) ఇట్టి శ్రుతులచే నాత్మతత్వ ముపదేశింపఁబడుచున్నది

56 (అ) శంక - ఇట్టి శ్రుతులచే నుపదేశింపఁబడు నాత్మ విజ్ఞానము హేయోపాదేయ రహిత మగుటం జేసి ప్రయోజనకారి యగునా? కాదా? యని

(ఆ) పరిహార తత్త్వధవేతి అభ్యుప గమ్యతే । అలంకారోహ్యాయ మస్మాకం యద్బ్రహ్మాత్మావగతౌ సత్యాం సర్వకర్తవ్యతా హానిః, కృతకృత్యతా చ – ఇతి । తథా చ శ్రుతిః—

(1) "ఆత్మానం చేద్విజానీయాత్ అయమస్మీతి పూరుషః,
కి మిచ్ఛన్ కస్య కామాయ శరీర మను సంజ్వరేత్"
( బృ 4-4-12 )

(2) "ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్
కృతకృత్యశ్చ భారత" ( గీత 15-20 )

ఇతి స్మృతిః । తస్మాత్ న ప్రతిపత్తి విధి విషయతయా బ్రహ్మణః సమర్పణం ।

## 3 ద్వితీయ వర్ణకం

57 (అ) పూర్వపక్షః – యదపి కేచిదాహుః "ప్రవృత్తి నివృత్తి విధి తచ్ఛేష వ్యతిరేకేణ కేవల వస్తువాదీ వేదభాగో నాస్తి" ఇతి ।

(ఆ) పరిహారము - అది యటులనే యెరుగఁబడుచున్నది (అనగా, హేయముకాని, ఉపాదేయముకాని కాదు) ఇదియే మా కలంకారము (ప్రీతికరము) అదేమన బ్రహ్మయే యాత్మయను జ్ఞానము కలుగ, సర్వకర్మసంన్యాసము, కృతకృత్యతయు (చేయవలసిన పురుషార్థ మెల్లఁ జేయఁబడినదే యగుట) కలుగును అందుకు శ్రుతి,

(1) ఈ పరమాత్మ నేనయితినని యెప్పుడు పురుఁషుడు స్వస్వరూపమును దెలిసికొనునో, అపుడేఫలమునుఁ గోరుచు నెవనియొక్క ప్రీతికొరకు నీ శరీరముతోఁ దాదాత్మ్యము చెంది తపించును? (బ్రహ్మజ్ఞాని, కాయక్లేశరూపమగు గర్మలఁగూర్చి తపింపడని భావము) (బృ 4-12)

(2) ఓ భారతవంశీయుడా! ఈ బ్రహ్మమునుఁ దెలిసికొని బుద్ధిమంతుఁడును పొందవలసిన దానినిఁ బొందిన వాడునుఁ నగును (గీత 15-20) ఇది స్మృతి ప్రమాణము

కావున ఉపాసన విధితో సంబంధించి బ్రహ్మసమర్పణ కుదురదు (స్వతంత్రముగనే బోధింపఁబడుచున్న దని భావము)

## 3 ద్వితీయ వర్ణకం

57 (అ) పూర్వ పక్షము - కొందరు (ప్రభాకరీయులు) ఇట్లనుచున్నారు "ప్రవృత్తి విధులను (సత్యంవద, ధర్మంచర, యావజ్జీవం అగ్నిహోత్రం జుహూయాత్ -ఇత్యాదులను).

(ఆ) పరిహారః - తన్న । ఔపనిషదస్య పురుషస్య అనన్య శేషత్వాత్ । యోఽసౌ ఉపనిషత్సు ఏవాధిగతః పురుషః అసంసారీ, బ్రహ్మస్వరూపః, ఉత్పాద్యాది చతుర్విధ ద్రవ్య విలక్షణః, స్వప్రకరణస్థోఽనన్యశేషః నాఽసౌ నాస్తి నాధి గమ్యతే ఇతి వాశక్యం వదితుం । "స ఏష నేతి నేత్యాత్మా (బృ 3-9-26) ఇత్యాత్మ శబ్దాత్, ఆత్మనశ్చ ప్రత్యా ఖ్యాతుం అశక్యత్వాత్, య ఏవ నిరాకర్తా తస్యైవాత్మ త్వాత్ ।

మరిన్ని నివృత్తి విధులను (నా నృతం వదేత్, న పరదారాం గచ్ఛేత్, న కలంజం భక్షయేత్ — ఇత్యాదులను). ఇట్టి యుభయ విధి నిషేధముల కంగములుగా నుండువానిని వేదము చెప్పును గాని అందుకు వ్యతిరేకముగా (భిన్నముగ) కేవల వస్తువును బోధించు వేదభాగమే లేదు' అని

(ఆ) పరిహారము - అటులగాదు ఉపనిషత్తులందుపదేశింపఁబడిన పురుషుఁ డన్యశేషము (కర్మాంగము) గాక స్వతంత్రముగానే యుపదేశింపఁబడుచున్నాడు ఈ యుపనిషత్తులందు నెరుగఁబడు పురుషుఁడు అసంసారి, బ్రహ్మ స్వరూపుఁడు (నిత్య శుద్ధ ముక్త స్వభావుఁడు) ఉత్పాద్యాదులగు (ఉత్పాద్య, వికార్య, ఆప్య సంస్కార్యములు) నాల్గు కార్యముల కంటె విలక్షణుఁడు వేదాంతములందుగాక యితర స్థలములందు లభింపడని, యట్టి పురుషుఁడు లేడనిగాని తెలియఁబడడని గాని చెప్పుట కెంతమాత్రము వీలులేదు ఉపనిషత్తులందుఁ జెప్పఁబడుచున్న పురుషుఁడు అనగా ఆత్మ— ఇది కాదు ఇది కాదు అని దృశ్యవిషయమును నిషేధించుచు శ్రుతియందు నాత్మ శబ్దముచేఁ దెలియవచ్చుచుండుటవలన ఆత్మను నిరాకరించుట కెంతమాత్రము శక్యముకాదు ఏలన ?—సర్వమును నిషేధించు నిరాకర్తయే యాత్మయగుటంజేసి సర్వనిషేధావధి భూతముగ తా నలరారుచుండుటవలన తన్ను దాను నిషేధించుకొనుట యెక్కడ గానము కాన ఆత్మ యెంతమాత్రము నిషేధింపఁబడక స్వయంప్రకాశమానముగా నిలచియున్నది

(ఇ) శంకా - నన్వాత్మాఽహం ప్రత్యయ విషయత్వాత్ ఉపనిషత్స్వేవ విజ్ఞాయతే ఇత్యనుపపన్నం—

(ఈ) పరిహారః— న। తత్సాక్షిత్వేన ప్రత్యుక్తత్వాత్। నహి అహం ప్రత్యయ విషయ కర్తృ వ్యతిరేకేణ తత్సాక్షీ సర్వభూతస్థ సమ ఏకః కూటస్థ నిత్యః పురుషః విధికాండే తర్కసమయే వా కేన చి దధి గతః। సర్వస్యాత్మా।

(ఉ) అతః స న కేనచిత్ ప్రత్యాఖ్యాతుం శక్యః, విధిశేషం వా నేతుం। ఆత్మత్వాదేవచ సర్వేషాం న హేయః నాప్యుపాదేయః। సర్వం హి వినశ్యద్వికారజాతం పురుషాన్తం వినశ్యతి। పురుషో వినాశహేత్వభావాత్, అవినాశీ, విక్రియాహేత్వభావాత్ చ కూటస్థ నిత్యః, అత ఏవ నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావః। తస్మాత్

(ఇ) శంక - ఏమండీ ఆత్మ అహంప్రత్యయమునకు విషయమగు వస్తువగుటంజేసి, యెల్లరకును 'అహం' 'అహం' అని యపరోక్షముగఁ దెలియఁబడుట వలన నుపనిషత్తులఁజేతనే తెలియఁబడు చున్నదనుట యెట్లు సమంజసంబగు?

(ఈ) పరిహారము-అటులగాదు ఏలన, అహంప్రత్యయమునకు విషయమగు కర్త దేహేంద్రియ సంఘాతముతోఁ గూడుకొనిన జీవాత్మయై యున్నాఁడు ఆత్మయన్ననో యట్టి జీవాత్మకు సాక్షిరూపమున నలరారుచుండుట వలన నట్టి యాత్మకు నహం ప్రత్యయ విషయత్వము నిరాకరింపఁ బడుచున్నది అహం ప్రత్యయ విషయమగు కర్త వాస్తవముగ నాత్మ కాదు। అట్టి వాస్తవమగు నాత్మ యుపనిషత్తుల వలన దెలియవచ్చెడి పురుషుఁడు - అహం ప్రత్యయ విషయుడగు కర్తగాని కర్మకాండమందుఁ దెలియవచ్చెడి వాఁడు గాని, వేఱొక నైయాయికాది యుక్తి దర్శనములందుఁ దెలియవచ్చువాఁడు గాని కాదు ఇతఁడు సర్వమునకు నాత్మస్వరూపుఁడు।

(ఉ) కాబట్టి యీ ఔపనిషత్పురుషుఁడు సకల జగత్తుకు నాత్మయగు స్వరూపమగుటచే నెవ్వరికిఁగూడ నిషేధించుటకుఁగాని లేక వేఱొక విధికి నంగముగా నిరూపింపఁబడుటకుఁగాని శక్య మెంతమాత్రము గాదు సమస్తప్రాణులకు నాత్మ యగుటంజేసి హేయముగాని, యుపాదేయముగాని యగుటకు వీలులేదు మరియు లోకమందలి వికారసమూహమంతయుఁ బురుషుని పర్యంతము

(1) "పురుషాన్న పరం కించిత్, సాకాష్ఠా
సాపరాగతిః" (కఠ 1-3-11)

(2) "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి"
(బృ 3-9-26)

ఇతి చ ఔపనిషదత్వ విశేషణం పురుషస్య ఉపనిషత్సు ప్రాధాన్యేన ప్రకాశమానత్వా దుపపద్యతే।

(ఊ) అతోఽభూతవస్తుపరో వేదభాగో నాస్తీతి వచనం సాహసమాత్రం। యదపి శాస్త్ర తాత్పర్యవిదాం అనుక్రమణం "దృష్టో హి తస్యార్థః కర్మావ బోధనం" ఇత్యేవమాది, తద్ధర్మ జిజ్ఞాసా విషయత్వాత్ విధిప్రతిషేధ శాస్త్రాభిప్రాయం ద్రష్టవ్యం।

నశించును పురుషుఁడన్ననో, నశించుటకు హేతువులు లేమింజేసి, అవినాశియగుచున్నాడు పురుషునియందుఁ బరిణామి నిత్యత్వము ఘటింపదుగాన విక్రియా రహితుఁ డగుటచేత "కూటస్థనిత్య" మనఁబడుచున్నాడు ( పురుషుని యందు సావయవత్వాదులు లేనందున, పరిణామి నిత్యుడుగాక కూటస్థ నిత్యుఁడగుచున్నాడు ) అందుచేతనే నిత్యుఁడు, శుద్ధుఁడు బుద్ధుఁడు, ముక్తస్వభావుఁడని చెప్పఁబడుట

శ్రుతులు -

(1) పురుషునికంటె శ్రేష్ఠమైన దెద్దియును లేదు అతఁడే పరమావధి అదియే యుత్కృష్ట స్థానము ( గతిః ) ( కఠ 1-3-11 )

(2) ఆతనిగురించి, ఉపనిషత్తులందుఁ దెలియవచ్చెడి పురుషుని గురించి యడుగుచున్నాను ( బృ 3-9-26 )

ఇటుల నుపనిషదేకసమధిగమ్యుఁడని, విశేషణము పురుషుడుపనిషత్తులందుఁ బ్రాధాన్యముగాఁ బ్రకాశమాన మగుటచే నుపపన్న మగుచున్నది

(ఊ) కావున సిద్ధవస్తుబోధకమగు వేదభాగము లేదని చెప్పుట సాహసమాత్రము పూర్వమీమాంసా శాస్త్ర తాత్పర్య కోవిదుల "వేద మంతయు క్రియాపర' మని చెప్పఁబడిన విషయము, ధర్మజిజ్ఞాసకు సంబంధించిన దగుటంజేసి, విధి ప్రతిషేధ శాస్త్రములను దృష్టిలో నుంచుకొని చెప్పినదిగ చూడఁదగియున్నది

(ఋ) అపిచ "ఆమ్నాయస్య క్రియార్థత్వాత్, ఆనర్థక్యం అత దర్థానాం" ఇత్యేత దేకాన్తేన అభ్యుపగచ్ఛతాం భూతోపదేశానామా నర్థక్య ప్రసంగః।

58 (అ) శంకా - ప్రవృత్తి నివృత్తి విధి తచ్ఛేష వ్యతిరేకేణ భూతం చేత్ వస్తూపదిశతి భవ్యార్థత్వేన కూటస్థనిత్యం నోపది శతీతి।

58 (ఆ) ప్రతిశంకా - కో హేతుః? న హి భూత ముపదిశ్యమానం క్రియా భవతి-

(ఇ) పూర్వపక్షీ సమాధానం - అక్రియాత్వేపి భూతస్య క్రియాసాధనత్వాత్ క్రియార్థ ఏవ భూతోపదేశ ఇతి చేత్ -

(ఈ) సిద్ధాంతి పరిహారః - నైషదోషః। క్రియార్థత్వేపి క్రియా నిర్వర్తన శక్తిమత్ వస్తూపదిష్టమేవ। క్రియార్థత్వంతు ప్రయోజనం తస్య। నచైతావతా వస్త్వనుపదిష్టం భవతి।

(ఋ) మరియు "వేదమునకుఁ గ్రియార్థత్వమే ముఖ్యము అట్టి క్రియనుఁజూపని వాక్యము లనర్థకములు (జై సూ) అని ముఖ్యముగ గ్రహించువారలకు భూతోపదేశ వాక్యములకు నానర్థక్యము ప్రాప్తించును

58 (అ) ప్రతిపక్షి శంక – ప్రవృత్తి నివృత్తి, విధి, తదంగముల కంటె భిన్నముగా భూతవస్తువు లుపదేశింపఁబడినను నయ్యవి భవ్యార్థములుగానే యనగా, చెయ్య వలసిన క్రియ కంగములుగానే, యుపదేశింపఁబడుచున్నవి గాని కూటస్థ నిత్యుని గురించి యుపదేశింపవు అని చెప్పనచో

(ఆ) సిద్ధాంతియొక్క యెదురుప్రశ్న – అట్లు సెప్పుట యందు విశేషమేమి? భూతవస్తువును గురించిన నుపదేశము క్రియ కాదు గదా!

(ఇ) పూర్వపక్షియొక్క సమాధానము – భూత వస్తువు క్రియగాక పోయినను, క్రియకు సాధన మగుటవలన, భూతోపదేశము క్రియార్థమే యగుచున్నది, అన్నట్లయితే

(ఈ) సిద్ధాంతిచే పరిహారము – అది యొక దోషము గాదు (భూతవస్తువగు బ్రహ్మము యొక్క యుపదేశము యుక్తమే అని తాత్పర్యము) భూతవస్తువులు క్రియల కొరకుపదేశింపఁబడినను, క్రియను నిర్వర్తింపఁగల శక్తితోఁ గూడిన వస్తువు లుపదేశింపఁబడినవని తప్పక చెప్పవలసియే

59 (అ) ఆక్షేపః—యది నామోపదిష్టం కింతవ తేన స్యాత్ ? ఇతి

(ఆ) పరిహారః – ఉచ్యతే। అనవగతాత్మవస్తూపదేశశ్చ తథైవ భవితుమర్హతి। తదవగత్యా మిథ్యాజ్ఞానస్య సంసారహేతోర్నివృత్తిః ప్రయోజనం క్రియతే – ఇత్యవిశిష్టం అర్థవత్త్వం క్రియాసాధన వస్తూపదేశేన। అపిచ "బ్రాహ్మణో న హంతవ్యః" ఇతి చైవమాద్యా నివృత్తిరుపదిశ్యతే।

యున్నది అట్టి వస్తువునకుఁ బ్రయోజనము క్రియను నిర్వహించుటయే కాని క్రియ యుపదేశింపఁబడి, యద్దాని కొరకు వస్తు వుపదేశింపఁబడినదని చెప్పుట యుక్తము కాదు (ఇదియే 'తు' యొక్క యర్థము) వస్తువునకు క్రియతో బ్రయోజనము సంబంధము తెలియవచ్చినంత మాత్రముననే, క్రియతో సంబంధము లేకుండ నుపదేశము చేయఁబడనిది గానేరదు (క్రియతో సంబంధమున్నను, లేకపోయినను వస్తు వుపదేశింపఁబడుటకుఁ బ్రతిబంధ మెంతమాత్రము లేదు అని యర్థము)

59 (అ) పూర్వపక్షి యాక్షేపము – కర్మతో సంబంధము లేకుండగ నుపదేశింపఁబడుఁగాక అద్దానితో నీ కేమి ప్రయోజనము అని

(ఆ) పరిహారము – చెప్పఁబడుచున్నది క్రియలందు ప్రయోజనములఁ బడయునట్టి భూతవస్తువుల నుపదేశించిన విధముననే పొందఁబడని యాత్మరూపమగు భూత వస్తూపదేశము గూడ ప్రయోజనకారి యగును అట్టి యాత్మ వస్తూపదేశము వలన ప్రయోజనమును నిరూపించి, క్రియాసాధన వస్తూపదేశమువలన నెట్లు ప్రయోజనము ఘటించుచున్నదో, యట్లే క్రియాసంబంధములేని యాత్మ వస్తూపదేశమువలన గూడ మోక్షమనెడి బ్రయోజనము లభించుచున్నది కాన వేదమందు వస్తూపదేశము సప్రయోజనమే కాని నిష్ప్రయోజనముగాదు మరిన్ని, "బ్రాహ్మణుడు చంపఁదగడు" ఇట్టి వాక్యములు కర్మకాండయందు నివృత్తి నుపదేశించుచున్నవి

(ఇ) శంకా - న చ సా క్రియా, నాపి క్రియా సాధనం। అక్రియార్థానాం ఉపదేశః అనర్థకశ్చేత్

(ఈ) పరిహారః-' బ్రాహ్మణో న హంతవ్యః ఇత్యాది నివృత్త్యుపదేశానాం ఆనర్థక్యం ప్రాప్తం'' తచ్చానిష్టం। న చ స్వభావ ప్రాప్త హన్త్యర్థానురాగేణ నఞః శక్యమప్రాప్త క్రియార్థత్వం కల్పయితుం, హనన క్రియా నివృత్తి ఔదాసీన వ్యతిరేకేణ। న ఞ శ్చ ఏమస్వభావః యత్ స్వసంబంధినోఽభావం బోధయతీతి। అభావబుద్ధిశ్చ ఔదాసీన్య కారణం। సా చ దగ్ధేన్ధ నాగ్నివత్ స్వయమేవ ఉపశామ్యతి। తస్మాత్ ప్రసక్త క్రియా నివృత్తి ఔదాసీన్యమేవ "బ్రాహ్మణో న హంతవ్యః ఇత్యాదిషు ప్రతిషేధార్థం మన్యామహే, అన్యత్ర ప్రజాపతి వ్రతాదిభ్యః। తస్మాత్ పురుషార్థానుపయోగి ఉపఖ్యానాది భూతార్థవాద విషయం, ఆనర్థక్యాభిధానం ద్రష్టవ్యం।

(ఇ) శంక - "బ్రాహ్మణుఁడు చంపఁదగడు" యను వాక్యమున నున్న 'నివృత్తి' క్రియగాదు, క్రియాసాధనము-గాదు అక్రియార్థముల ఉపదేశము అనర్థక (నిష్ప్రయోజన) మే కదా అన్నచో

(ఈ) పరిహారము -(నీ వనుకున్నది వాస్తవ మైతే) "బ్రాహ్మణుఁడు చంపఁదగడు" యనునట్టి నివృత్తి రూపోపదేశ వాక్యముల కానర్థక్యము ప్రాప్తించుచున్నది అది (యెల్లరకు) అనిష్టమే కదా! (కావున వేదప్రమాణ విదుఁడు నివృత్తి బోధకమగు వేదవాక్యోపదేశము కలదని యంగీకరింపవలెను) (నఞ్ = కానిది (non) నఞ్ ఇదియొక పదము దీనిని క్రియార్థములకుఁ జేర్చినపుడు, నహంతవ్య = చంపఁదగడు అని యర్థము వచ్చును) స్వభావముగా ప్రాప్తించు హననార్థమందు పట్టుదలతో 'నఞ్' అను దానికి హనన క్రియకంటె భిన్నమైన మరొక క్రియార్థము సూచించుచున్నదనుట చెల్లదు ("చంపవద్దు" అనగా కొట్టవచ్చు తిట్టవచ్చు నను నితర క్రియాకార్యముల సూచించుచున్నదనుట చాల విరుద్ధము 'చంపవద్దు', అనగా చంపునట్టి కార్యమందు నుదాసీనత్వమే యని నిర్దుష్టముగాఁ జెప్పవలెను) నఞ్' నకు స్వభావ సిద్ధమగు నర్థమేమన, అయ్యది యెద్దానితో సంబంధించునో యద్దాని లేమిని మాత్రమే బోధించుచుండును అభావ బుద్ధియే యౌదాసీన్యమునకుఁ గారణంబగు (అది కర్తను కర్తవ్యత నుండి మరలించుచున్నది) ఆ యభావ బుద్ధిగూడఁదనంతట-

దానే యుపశమించును ఎట్లన కట్టెలు కాలుచు కాలుచు చివరకుఁ దమంతట దా మెటుల నుపశమము నొందునో కావున " బ్రాహ్మణో న హంతవ్యః ' మున్నగు ప్రదేశము లందు నఞ్ కు ప్రసజ్య ప్రతిషేధార్థమే గ్రహింపఁబడి, యచట ప్రసక్తమగు క్రియనుండి నివృత్తి రూపమగు నౌదాసీన్యమే యభిప్రేతము (ప్రసజ్యక్రియానివృత్తి ఒకానొకడు కత్తినిబూని బ్రాహ్మణుని జంప పరుగిడుచుండ మరియొకడు " బ్రాహ్మణో న హంతవ్యః ' యని ప్రయోగింప, నతడు విరమించుట) ఇట్టి ప్రసజ్య క్రియానివృత్తి 'నఞ్ కు సర్వథా గ్రహింపవలెనా యన, కాదు ప్రజాపతి వ్రతాదులందు తప్ప అచ్చట "పర్యుదాసార్థము 'ను గ్రహింపవలెను 'ప్రజాపతివ్రత మన వటోర్వ్రతము బ్రహ్మచారి విధుల గురించిన వ్రతము అతడు అధ్యయనము చేయు కాలములో " అనీక్షణం కర్తవ్యం ' అటు ఇటు చూడ కూడదు అను వాక్యమందు, ఈ క్షణ క్రియకన్న భిన్నమైన సంధ్యోపాసనాదికము చేయవలె ననునది 'పర్యుదాసార్థము ' ఇచట వ్రతోపదేశ బలముచే పర్యుదాసార్థము గ్రహింపఁ బడుచున్నది కావునఁ బురుషార్థములకుఁ గర్మకాండలో నుపయోగరహితమైయున్న యుపాఖ్యానాదుల రూపమగు భూతార్థవాదవిషయము శాస్త్రమునకు నానర్థక్యముండుట జూడవచ్చునేమో ! ( కాని స్వతః ప్రమాణములైన వేదాంత వాక్యముల కానర్థక్య ప్రసంగము కలుగనేరదని భావము )

60 (అ) పూర్వపక్షః— యదప్యుక్తం - కర్తవ్య విధ్యను ప్రవేశమంతరేణ వస్తుమాత్రం ఉచ్యమానం అనర్థకం స్యాత్ "సప్తద్వీపావసుమతీ" ఇత్యాది వదితి ।

(ఆ) పరిహార - తత్పరిహృతమ్ । "రజ్జు రియం, నాయం సర్పః" ఇతి వత్ వస్తుమాత్రకథనేఽ ప్రయోజనస్య దృష్టత్వాత్ ।

(ఇ) శంకా - నను శ్రుతబ్రహ్మణోఽపి యథా పూర్వం సంసారిత్వ దర్శనాత్, న రజ్జు స్వరూప కథన వత్ అర్థవత్వమిత్యుక్తం ।

(ఈ) పరిహారః - అత్రోచ్యతే । నావగతబ్రహ్మాత్మభావస్య యథాపూర్వం సంసారిత్వం శక్యం దర్శయితుం, వేదప్రమాణ జనిత బ్రహ్మాత్మభావవిరోధాత్ । నహి శరీరాద్యాత్మాభిమానినః దుఃఖ భయాది మత్త్వం దృష్టమితి తస్యైవ వేదప్రమాణజనిత బ్రహ్మాత్మావగమే తదభిమాన నివృత్తౌ తదేవ మిథ్యాజ్ఞాన నిమిత్తం దుఃఖభయాది మత్వం భవతీతి శక్యం కల్పయితుం । నహి ధనినో గృహస్థస్య ధనాభిమానినో ధనాపహారనిమిత్తం దుఃఖం దృష్టం ఇతి తస్యైవ ప్రవ్రజితస్య ధనాభిమాన రహితస్య తదేవ ధనాపహార నిమిత్తం దుఃఖం భవతి । న చ కుండలినః కుండలిత్వాభిమాన

60 (అ) పూర్వపక్షము - ఏదైతే నీచే చెప్పబడెనో, "కర్తవ్యరూపమైన విధితో సంబంధము లేని యర్థవాదములకుఁ బ్రామాణ్యము సిద్ధింపని విధమున వస్తుమాత్రబోధకములగు వేదాంతములకు బ్రామాణ్యమును, ప్రయోజనమును లేదు ఏవిధముగనైన, "ఏడుద్వీపములు గలది వసుమతి' యను వాక్యమువలె" అని

(ఆ) పరిహారము - ఆ మీరు చెప్పిన యాక్షేపణ పరిహరింపఁబడినది పూర్వమే "ఇది త్రాడు, ఇది సర్పము కాదు యని వస్తువుయొక్క కేవల కథనమందుఁ గూడఁ బ్రయోజనము గన్పడుటవలన

(ఇ) శంక - ఏమండీ వేదాంతశ్రవణపరునికిఁ గూడ, పూర్వమువలెనే సంసారిత్వము కనపడుచుండుటవలన, రజ్జు స్వరూప కథనమువలె అర్థవత్వ మిచట నున్నదన గూడదుకదా!

(ఈ) పరిహారము - ఇచట చెప్పఁబడుచున్నది బ్రహ్మాత్మ భావమును దెలిసికొనిన వానికి నింతకు పూర్వమున్నట్లు సంసారిత్వము గలదని జూపుటకు శక్యము కాదు ఏలన, వేదప్రమాణముచే కలిగిన బ్రహ్మాత్మభావమునకును, సంసారిత్వమునకును విరోధముండుటవలన శరీరాదులందాత్మాభిమానికి దుఃఖభయాదిత్వము జూడఁబడుచున్నట్లుగా, వేదప్రమాణముచే నపరోక్ష బ్రహ్మాత్మ జ్ఞానము గలుగ, శరీరాదులందు నభిమానము నివృత్తికాగా, నట్టివానికి పూర్వమువలెనే దుఃఖభయాదులు కలుగునని

నిమిత్తం సుఖం దృష్టమితి తస్యైవ కుండల వియుక్తస్య కుండలిత్వాభిమాన రహితస్య తదేవ కుండలిత్వాభిమాన నిమిత్తం సుఖం భవతి। తదుక్తం శ్రుత్యా "అశరీరం వావ సంతం న ప్రియా ప్రియే స్పృశతః" (ఛాం 8-12-1)। ఇతి

61 (అ) ఆక్షేపణా - శరీరే పతితే, అశరీరత్వం స్యాత్, న జీవతః — ఇతి చేత్।

(ఆ) సమాధానం - న। సశరీరత్వస్య మిథ్యా జ్ఞాన నిమిత్తత్వాత్। నహ్యాత్మనః శరీరాత్మాభిమాన లక్షణం మిథ్యా జ్ఞానం ముక్త్వా అన్యతః సశరీరత్వం శక్యం కల్పయితుం। నిత్యం అశరీరత్వం అకర్మ నిమిత్తత్వాత్ — ఇత్యవోచామ

చెప్పుట కెంతమాత్రము వీలులేదు (ఇచ్చట రెండు దృష్టాంతములు జూడనగు) 1 గృహస్థుఁడై ధనమందు మోహయుతుఁడైన ధనికునకు ధనమునష్టమైనప్పుడు సహజముగాఁగల్గునట్టి దుఃఖమే, వాఁడే వైరాగ్యముచే సన్యసించినవాఁడై ధనమందుండు మోహమును గోసివేసికొని యున్నప్పుడుగూడ నుండునా! 2 కుండలములను ధరించిన యొకడు కుండలములమీఁది మోహముచేత సంతోషము బొందునట్లు, వాఁడేకుండలములఁదీసివేసి కుండలములమీఁది మోహమును విసర్జించి యున్నప్పుడుకూడ కుండలకారణ సుఖమునుఁబొందుట గలుగునా? (కలుగదు) ఆ విషయమే శ్రుతిచే చెప్పఁబడినది "శరీరములేని (శరీరమందభిమానములేని) సత్పదార్థమగు నాత్మను సుఖదుఃఖములు (ప్రియాప్రియములు) అంటవు (ఛాం 8-12-1)

61 (అ) ఆక్షేపణ - శరీరపాతానంతరము "అశరీరత్వము' సిద్ధించునుగాని జీవించియుండగా సిద్ధింపనేరదు కదా అనినచో—

(ఆ) సిద్ధాంతి సమాధానము - అటులకాదు ఏలన, మిథ్యాజ్ఞానరూపమగు నజ్ఞానము హేతువుగలది గావున (రజ్జుసర్పమట్లు వాస్తవముగా దేహములేదు దేహమున్నదియనుట భ్రాంతిమూలకము) ఆత్మకు శరీరాత్మాభిమానలక్షణమైన మిథ్యాజ్ఞానమును విడిచి, మరొకవిధముగా సశరీరత్వమును గల్పించుట శక్యముగాదు అశరీరత్వము కర్మజన్యముగాక 'స్వాభావికమే' యని యిదివరలోఁజెప్పియుంటిమిగదా!

(ఇ) శంకా - తత్కృత ధర్మాధర్మ నిమిత్తం సశరీరత్వం—ఇతి చేత్ ।

(ఈ) పరిహారః- న । శరీర సంబంధస్య అసిద్ధత్వాత్ ధర్మాధర్మయోః ఆత్మకృతత్వాసిద్ధేః । శరీర సంబంధస్య ధర్మాధర్మయో తత్కృతత్వస్య చ ఇతరేతరాశ్రయత్వ ప్రసంగాత్, అంధపరంపరాచవషా అనాదిత్వ కల్పనా క్రియా సమవాయా భావాత్ చ ఆత్మనః కర్తృత్వా నుపపత్తేః ।

(ఉ) శంకా —సంనిధానమాత్రేణ రాజప్రభృతీనాం దృష్టం కర్తృత్వం—ఇతి చేత్ ।

(ఊ) పరిహారః - న । ధనదానాద్యుపార్జిత భృత్య సంబంధిత్వాత్ తేషాం కర్తృత్వోపపత్తేః । న త్వాత్మనో ధనదానాదివత్ శరీరాదిభిః స్వస్వామి సంబంధ నిమిత్తం కించిచ్ఛక్యం కల్పయితుం । మిథ్యాభిమానస్తు ప్రత్యక్ష సంబంధ హేతుః ।

(ఇ) శంక - సశరీరత్వము మిథ్యాజ్ఞాన నిమిత్తమువలె గాక, ఆత్మకృతములగు ధర్మాధర్మములవలనఁ గలుగు చుండుటచే ధర్మాధర్మములు నశింపకుండగ నశరీరత్వము సిద్ధింపదు అనినచో

(ఈ) పరిహారము - అటులకాదు ఆత్మకు శరీరసంబంధము లేకుండ ధర్మాధర్మముల పుటక కుదురదని ధర్మాధర్మములు లేకుండ శరీరసంబంధము ఘటింపదని చెప్పుట పరస్పరాశ్రయదోషగ్రస్తమగుచు నీయనాదిత్వకల్పనము అంధపరంపర యగుచున్నది ఆత్మ నిష్క్రియమగుటంజేసి క్రియతో నెన్నడును సంబంధము ఘటింపదు గావున ఆత్మకు కర్తృత్వము గలుగుటయు, నద్దానిచే ధర్మాధర్మముల నాచరించుటయు, నట్టి ధర్మాధర్మములచే శరీరము గలుగుటయు నెంతమాత్రము సమంజసముగాదు

(ఉ) శంక - లోకమున భృత్యునిచేఁ జేయఁబడు క్రియయందలి కర్తృత్వము సన్నిధిగతుఁడగు రాజునందుఁ జూడఁబడుచున్నట్లు, శరీరాదులచేఁ జేయఁబడు క్రియయందలి కర్తృత్వము సన్నిధానమాత్రముచే నాత్మయందుఁ దెలియఁ బడుట నొప్పునుగదా యనినచో

(ఊ) పరిహారము - అట్లుగాదు ధనదానాదులచే సంపాదితమైన భృత్యసంబంధముగలవారగుటచే రాజులందు భృత్యకర్తృత్వము కల్పించుట యుక్తమే లోకములో రాజప్రభృతులకును, సేవకులకును యున్న స్వస్వామి భావమునకు నిమిత్తమగు ధన, దానాది సంబంధముతోఁ దుల్యమగు సంబంధము ఆత్మకును, శరీరాదులకును నెంతమాత్రమును

62 (అ) ఏతేన యజమానత్వం ఆత్మనో వ్యాఖ్యాతం।

(ఆ) పూర్వపక్షః – అత్రాహుః – దేహాది వ్యతిరిక్తస్య ఆత్మనః ఆత్మీయే దేహాదౌ అభిమానః గౌణః, నమిథ్యేతి చేత్ ।

(ఇ) పరిహారః– న। ప్రసిద్ధ వస్తుభేదస్య గౌణత్వ ముఖ్యత్వ ప్రసిద్ధేః। యస్యహి ప్రసిద్ధో వస్తుభేదః యథా కేసరాదిమానాకృతివిశేషః అన్వయ వ్యతిరేకాభ్యాం సింహశబ్ద ప్రత్యయభాక్ ముఖ్యోఽన్యః ప్రసిద్ధః తతశ్చ అన్యః పురుషః ప్రాయికైః క్రౌర్య శౌర్యాదిభిః సింహగుణైః సంపన్నః సిద్ధః, తస్య పురుషే సింహ శబ్ద ప్రత్యయౌ గౌణౌ భవతః నా ప్రసిద్ధ వస్తు భేదస్య। తస్యతు అన్యత్ర అన్య శబ్ద ప్రత్యయౌ భ్రాంతి నిమిత్తౌ ఏవ భవతః, న గౌణౌ యథా మందాంధకారే 'స్థాణురయం' ఇత్య గృహ్యమాణ విశేషే పురుషశబ్ద ప్రత్యయౌ స్థాణు విషయౌ, యథావా శుక్తికాయాం అకస్మాత్ రజత మితి నిశ్చితౌ శబ్ద ప్రత్యయౌ, తద్వత్ దేహాది సంఘాతే 'అహ మితి' నిరుపచారేణ శబ్ద ప్రత్యయౌ ఆత్మా నాత్మ వివేకేన ఉత్పద్యమానౌ కథం గౌణౌ శక్యౌ వదితుం। ఆత్మాఽనాత్మ వివేకినా మపి పండితా

గల్పించుటకు శక్యముగాదు ఆత్మకు, దేహాదులకుఁ బ్రత్యక్ష సంబంధ కారణము మిథ్యాభిమానమే

62 (అ) దీనిచే ఆత్మకు దేహేంద్రియాదులతోడి సంబంధమెట్లు మిథ్యాభిమానకల్పితమో, యట్లే యాగముల యందలి కర్తృత్వ నిమిత్తమగు యజమానత్వముగూడ మిథ్యాభిమాన కల్పితమే అని వివరింపఁబడినది

(ఆ) పూర్వపక్షము - దేహాదులకన్న భిన్నమైన యాత్మకుఁ దనకు నాత్మీయములైన దేహాదులందున్న యభిమానము గౌణముకాని, మిథ్య కాదనినచో

(ఇ) పరిహారము - అట్లుగాదు వస్తుభేదము సుప్రసిద్ధముగ గ్రహించినప్పుడే గౌణత్వ ముఖ్యత్వ వ్యవహారము లోకములోఁ బ్రసిద్ధమగుచున్నది (ఎవనికైతే ప్రసిద్ధమైన వస్తుభేదముండునో, అది యెటులన, లోకములో ముఖ్యార్థ ప్రయోగమని గౌణార్థప్రయోగమని రెండువిధములఁ బ్రయోగములు గలవు జూలు, భయకరత్వములు గలిగిన జంతువును సింహమనుట ముఖ్యార్థప్రయోగము సింహము కన్న భిన్నమైన పురుషుఁడొకడు జుట్టుకలిగి క్రౌర్య శౌర్యాదులతో నున్నప్పుడు, ఇట్టివానిని జనులు భయముతో సింహముగా జూడవచ్చును ఇచట "వీడు సింహమురా" యనుట గౌణార్థప్రయోగము) వస్తుభేదజ్ఞానముకలవానికి శౌర్యాదివిశిష్ట పురుషునియందు సింహశబ్దప్రయోగము, తజ్జ్ఞానము గౌణము లగునుగాని వస్తుభేద మెఱుంగనివానివి కావు కాని ప్రసిద్ధవస్తుభేదము లేనివానియొక్క

నాం అజావిపాలానా మివ అవివిక్తౌ శబ్ద ప్రత్యయౌ భవతః। తస్మాత్ దేహాది వ్యతిరిక్తాత్మాస్తిత్వ వాదినాం దేహాదౌ అహం ప్రత్యయః మిథ్యైవ, న గౌణః।

63 (అ) తస్మాత్ మిథ్యా ప్రత్యయ నిమిత్తత్వాత్ సశరీరత్వస్య సిద్ధం జీవతోఽపి విదుషః అశరీరత్వం।

ఒకదానియందు మఱియొక శబ్దప్రయోగముగాని, తజ్ఞానము గాని భ్రాన్తినిమిత్తములే యగునుగాని గౌణములుగావు ఎట్లన కనుచీకటిలో 'ఇది కొయ్య' అని తెలియని సమయమున 'వీడు పురుషు' డని శబ్దప్రయోగముగాని ఆ జ్ఞానముగాని భ్రాన్తినిమిత్తములే పరిశీలింపలేనిచోట 'అది ఇదిగా గాని 'ఇది యదిగా' గాని యనుకొనినచో నచ్చట కారణము భ్రాంతి కాని గౌణము కాదు ఎట్లనగా—

(1) కనుచీకటి సమయమున 'ఇది రాతిగుం' డని తెలియఁజాలక 'నిది పురుషుఁ' డనుట

(2) అకస్మాత్తుగా ముత్యపుచిప్పనుఁ జూచి 'ఇది వెండి' యని భావించుట అటులనే దేహాది సంఘాతమందు 'ఇది నే' నను నిశ్చయింపఁబడిన శబ్ద జ్ఞానములుగూడ ఆత్మ - అనాత్మల వివేకము జేయఁజాలక పుట్టినవి కాని, నిచట గౌణత్వభావ మెటులఁ జెప్పనగు ? ఇంతియకాదు ఆత్మానాత్మవివేకమునుఁ బడసిన పండితులకుఁగూడ వెఱ్ఱి గొల్లలకువలె దేహాదులం దాత్మబుద్ధి నిరుపచారముగఁ గల్గుచుండ నయ్యది గౌణ మెట్లగు ? కావున దేహాదులకంటె నాత్మవిలక్షణ మని తలచు (ఆత్మవాదులు) వారలందరకు దేహాదులందు "అహం" అనెడి జ్ఞానము మిథ్యాభూతమే గాని గౌణ మెంతమాత్రము కాదు

63 (అ) కావున నేను శరీరముగలవాడ నను జ్ఞానము రజ్జు సర్పజ్ఞానమువలె మిథ్యయగుటం జేసి, విద్వాంసునకు జీవించియుండగనే యశరీరత్వము సిద్ధించుచున్నది

(అ) తథాచ బ్రహ్మవిద్విషయా శ్రుతిః –

(1) "తద్యథాఽహి నిర్ల్వయనీ వల్మీకే మృతా ప్రత్యస్తా శయీత, ఏవమే వేదం శరీరం శేతే। అథాయమ శరీరోఽమృతః ప్రాణో బ్రహ్మైవ తేజ ఏవ ' (బృ 4-4-7)

(2) "సచక్షు రచక్షు రివ, సకర్ణోఽకర్ణ ఇవ సవాగ వా గివ, సమనా అమనా ఇవ, స ప్రాణోఽ ప్రాణ ఇవ ' ఇతి చ।

(3) స్మృతిరపిచ – "స్థితప్రజ్ఞస్యకా భాషా" (భగ 2-54) – ఇత్యాద్యా స్థితప్రజ్ఞ లక్షణాని ఆచక్షాణా విదుషః సర్వప్రవృత్త్య సంబంధం దర్శయతి। తస్మాత్ నావగత బ్రహ్మాత్మ భావస్య యథాపూర్వం సంసారిత్వం। యస్యతు యథాపూర్వం సంసారిత్వం నాసౌ అవగత బ్రహ్మాత్మభావః ఇత్యనవద్యం।

63 (ఆ) బ్రహ్మవిత్ యొక్క విషయమును గురించిన శ్రుతి యిట్లున్నది

(1) (తత్) ఆ జీవన్ముక్తుఁడు ఎట్లుండు ననగా, ఏరీతిగా పాముయొక్క కుబుసము విడువబడినదై, పుట్టయందు జీవము లేనిదై శయీాత = పడియుండునో యారీతిగా నీ పరిదృశ్యమానమగు విద్వాంసునిచే విడువబడిన అభిమానము గల యీ శరీరము పడియుండును అథ = ఆరీతిగా విడువఁబడిన కుబుసముగల పామువలె నీ జీవన్ముక్తుఁడు శరీరమందు అభిమానము లేకపోవుటచే శరీరరహితుఁడు మరణరహితుఁడు, ప్రాణః= చేతనస్వరూపుఁడు బ్రహ్మము స్వయంప్రకాశుడునై యున్నాడు (బృ 4-4-7) అనియు

(2) వాస్తవముగా నేత్రములేని వాడయ్యు నేత్రము లున్నవానివలెను చెవులు లేని వాడయ్యు చెవులున్నవాని వలెను, వాగింద్రియ రహితుఁడయ్యు వాగింద్రియ సహితుని వలెను అంతఃకరణ లేనివాఁడయ్యు అంత కరణ సహితుని వలెను, ప్రాణములేని వాడయ్యును సప్రాణునివలె నున్నాడు అని కూడ శ్రుతి

(3) ఇంక స్మృతులలో - భగవద్గీతలలో 2-54 వ "స్థిత ప్రజ్ఞునికి నేమి సంగతి యను శ్లోకమునుండి స్థిత ప్రజ్ఞలక్షణములు జీవన్ముక్తునికిఁ జెప్పఁబడినవి కాన సర్వప్రవృత్తితో (సర్వసంసారముతో) సంబంధముండుటకు వీలు లేదని చూపుచున్నవి కావున బ్రహ్మభావము పొందిన వానికిఁ బూర్వమందువలె సంసారిత్వ మెంతమాత్రము గలుగదు ఒకవేళ వేదాంతశ్రవణము జేసిన వానికి

## 4 చతుర్థ వర్ణకం

64 (అ) పూర్వపక్షః- యత్పునరుక్తం - శ్రవణాత్ పరాచీనయోః మనన నిదిధ్యాసనయోః దర్శనాత్ విధి శేషత్వం బ్రహ్మణో న స్వరూప పర్యవసాయిత్వమితి—

(ఆ) పరిహారః -తత్। న। శ్రవణవత్ అవగత్యర్థత్వాత్ మనన నిది ధ్యాస నయోః। యది హ్యావగతం బ్రహ్మ అన్యత్ర వినియుజ్యేత, భవేత్ తదావిధి శేషత్వం। న తు తదస్తి, మనన నిదిధ్యాసనయో రపి శ్రవణవత్ అవగత్యర్థత్వాత్।

(ఇ) తస్మాత్ న ప్రతిపత్తి విధి విషయతయా శాస్త్ర ప్రమాణకత్వం బ్రహ్మణః సంభవతీతి-అతః స్వతంత్ర మేవ బ్రహ్మ శాస్త్ర ప్రమాణకం వేదాంత సమన్వయాత్ ఇతి సిద్ధమ్।

పూర్వమువలె సంసారిత్వము తెలియఁబడుచున్నదన, నతనికి బ్రహ్మసాక్షాత్కారము గలుగలేదనుట నిరాక్షేప మైనది

## 4 నాల్గవ వర్ణకము

64 (అ) పూర్వపక్షము - తిరిగి మరియొక పూర్వ పక్షము చెప్పఁబడుచున్నది శ్రవణము తర్వాత యుత్తర కాలమున మనన నిదిధ్యాసముల యొక్క విధులు వినఁబడు టచే బ్రహ్మమునకు విధిశేషత్వము చెప్పుచున్నందున, నా శ్రుతియొక్క యభిప్రాయము బ్రహ్మముయొక్క స్వరూప మును బోధించుట మాత్రమే కాదు అని

(ఆ) పరిహారము - అట్లుగాక శ్రవణమునకువలె మనన నిదిధ్యాసములకుఁగూడ నవగతి (బ్రహ్మజ్ఞాన) హేతుత్వమే చెప్పఁగలెను గాన శ్రవణముచే దెలియఁబడిన బ్రహ్మము కర్మమునందుఁగాని, యుపాసనయందుఁగాని విని యోగింపఁబడినచో, నప్పు డా బ్రహ్మమునకు విధిశేషత్వము గలుగును అటుల లేదు గాన, మనన నిదిధ్యాసములుగూడ బ్రహ్మావగతి (జ్ఞానము) కొరకే (శ్రవణ మనన నిధి ధ్యాసముల మూటికిని బ్రహ్మావగతి-బ్రహ్మజ్ఞానమే ప్రయోజ నము అని చెప్ప తీరవలెను అని తాత్పర్యము)

(ఇ) కావున, బ్రహ్మ ముపాసనావిధుల కంగముగా శాస్త్రము చెప్పుచున్నదనుట యసంభవము కాన వేదాంత వాక్యముల సమన్వయముచేత బ్రహ్మ స్వతంత్రముగానే శాస్త్ర ప్రమాణకంబై గోచరించు ననుట సిద్ధమైనది

(ఈ) ఏవం చ సతి "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" ఇతి తద్విషయః పృథక్ శాస్త్రారంభ ఉపపద్యతే। ప్రతిపత్తి విధి పరత్వే హి "అథాతో ధర్మ జిజ్ఞాసా" ఇత్యేవారబ్ధత్వాత్ న పృథక్ శాస్త్ర మారభ్యేత। ఆరభ్యమాణం చైవ మారభ్యేత - "అథాతః పరిశిష్ట ధర్మ జిజ్ఞాసా" ఇతి "అథాతః క్రత్వర్థ పురుషార్థయో ర్జిజ్ఞాసా" (జై 4-1-1) ఇతి వత్। బ్రహ్మాత్మైక్యావగతిస్తు అప్రతిజ్ఞాతా ఇతి తదర్థో యుక్తః శాస్త్రారంభః "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" ఇతి।

(ఉ) తస్మాత్ అహం బ్రహ్మాస్మీతి ఏతదవసానాః ఏవ సర్వే విధయః సర్వాణి చేతరాణి ప్రమాణాని। నహి అహేయానుపదేయ అద్వైతాత్మావగతౌ నిర్విషయాణి ప్రమాతృకాణి చ ప్రమాణాని భవితు మర్హంతి—ఇతి।

(ఈ) వేదాంతములు స్వతంత్రముగ బ్రహ్మను బోధించినపుడే "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా"యని యీ విషయమై (బ్రహ్మైకత్వైక్యావగతియందే యీగ్రంథమున కు దాత్పర్యమని, అట్టిది యిదివరకెట్టి గ్రంథములో లేనిదనియు) ప్రత్యేకముగా శాస్త్రారంభము సేయుట తగియుండును. అటులఁగాక బ్రహ్మము విధికి సంగమే యగుచో విధిశాస్త్రమునకుఁ బ్రవర్తించిన జైమినీయ తంత్రముచేతనే యియ్యదికూడ గతార్థమే యై యుండవలెను 'అథాతో ధర్మ జిజ్ఞాసా'యని గ్రంథారంభముకాగా, నారంభించిన గ్రంథములో "అథాతః పరిశిష్ట ధర్మ జిజ్ఞాస' యను శీర్షిక క్రింద (ఇంతటనుండి శేషించిన ధర్మ జిజ్ఞాసయుక్తమని) గ్రంథముండవలసి యుండెడిది జైమినీయమున "ఇంతట నుండి క్రత్వర్థ పురుషార్థములయొక్క జిజ్ఞాసా' యని చెప్పినట్లు ఇంతకుముందు బ్రహ్మైకత్వైక్యావగతి అప్రతి జ్ఞాతము (చెప్పఁబడలేదు) కనుకనే ఈశాస్త్రము "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' యని నూతనముగా ప్రారంభింపబడుట యుక్తము

(ఉ) కావున సకలములగు విధులును, ప్రత్యక్షాది సకలములగు ప్రమాణములును "అహం బ్రహ్మాస్మి నేను బ్రహ్మము నను జ్ఞానము పరిసమాప్తిగాఁ గల్గియున్నవి హేయోపాదేయరహితమగు అద్వైతాత్మజ్ఞానము గలుగుచుండగా, బ్రమాణము లన్నియు నిర్విషయములై ప్రమాతలేనివై యగుట న్యాయముకాదు గదా!

65 అపిచాహుః-

" 1 గౌణ మిథ్యాత్మనోఽసత్త్వే
పుత్రదేహాది బాధనాత్
సద్బ్రహ్మాత్మాహ మిత్యేవం
బోధేకార్యం కథం భవేత్ ।

2 అన్వేష్ట వ్యాత్మ విజ్ఞానాత్
ప్రాక్ ప్రమాతృత్వ మాత్మనః
అన్విష్టస్స్యాత్ ప్రమాతైవ
పాప్మ దోషాది వర్జితః ।

3 దేహాత్మ ప్రత్యయో యద్వత్
ప్రమాణత్వేన కల్పితః
లౌకికం తద్వదే వేదం
ప్రమాణం త్వాత్మ నిశ్చయాత్ ।"

ఇతి—

ఇతి చతుస్సూత్రీ సమాప్తా

65 మరియు (బ్రహ్మవేత్తల) వాక్యము లిట్లున్నవి

1 పుత్రాదు లందలి యభిమానము గౌణాత్మ, దేహాదులందలి యభిమానము మిథ్యాత్మ - ఈ రెండాత్మలతో లోకయాత్ర జరుగుచున్నది ఛాందోగ్యమందు జగత్కారణము 'సత్' శబ్దముచే తైత్తిరీయమందు 'బ్రహ్మ' శబ్దముచే ఐతరేయమందు 'ఆత్మ' శబ్దముచే నుపదేశింపఁబడినది ఈ మూఁడును నేకార్థబోధకములని సూచించు నట్లుగా "అహం శబ్దముచే నిందు ప్రయోగమయినది ఇట్టి 'అహం బ్రహ్మ యను వాక్యముచే నేను అబాధితమును, పూర్ణమును నగు సాక్షిని అను జ్ఞానము కలుగుచుండగా పుత్రుఁడు, దేహము మొదలగునవి (మాయాకల్పితములని నిశ్చయముచే) బాధితములుకాగా గౌణాభిమానము, మిథ్యాభిమానము (గౌణాత్మ మిథ్యాత్మ భావము) నశించగా లోకవ్యవహారముఁ (విధినిషేధాది వ్యవహారము) ఎట్లుండును ?

2 అన్వేషింపఁదగిన యాత్మ విజ్ఞానమునకు పూర్వమందే ఆత్మకు (జీవునకు) ప్రమాతృభావము ఉండును కాని యా యద్వితీయాత్మ అన్విష్టః=వెదకఁబడినట్టి ప్రమాతయే సకల ధర్మాది దోష శూన్యమగు పరమాత్మయే యగుచున్నాడు

3 దేహేంద్రియాదులందు యాత్మబుద్ధి కల్పితమైన దయ్యును నేరీతిగా ప్రమాణముగా నంగీకరింపఁబడుచున్నదో, యా తీరుననే లౌకికం = లోకమునందలి ప్రత్యక్షాది ప్రమాణ సముదాయము ఆ+ఆత్మనిశ్చయాత్ =ఆత్మజ్ఞానము కలుగు వరకు ప్రమాణమే యగును 'తు శబ్దముచే నాత్మ నిశ్చయానంతరము ప్రమాణ భావము సమసిపోవును అద్వితీ

యాత్మజ్ఞానము గలుగఁగా ప్రమాణములయొక్క ప్రయోజనమునకుఁ బరిసమాప్తి కలుగుచున్నది కావున బ్రహ్మము శాస్త్రప్రమాణకమని భావము

చతుస్సూత్రి ముగిసెను



## టీకా

# అధ్యాస భాష్యము

### 52-వ పుట, పేరాలు 1, 2, 3

బ్రహ్మసూత్రముల గురించి యీ దిగువ తెలిపిన భాష్యకారులు వారివారి మతానుసారము భాష్యముల రచించిరి

| | | | |
|---|---|---|---|
| 1 | శంకరాచార్యులవారు | 3 వ శతాబ్దము | నిర్విశేషాద్వైతవాదము |
| 2 | భాస్కరాచార్యులవారు | 10-వ ,, | భేదాభేదవాదము |
| 3 | యాదవప్రకాశులవారు | ,, | ,, |
| 4 | రామానుజాచార్యులవారు | 1140 | విశిష్టాద్వైతవాదము |
| 5 | మాధవాచార్యులవారు | 1238 | ద్వైతవాదము |
| 6 | నింబార్కులవారు | 13 వ శతాబ్దము | ద్వైతాద్వైతవాదము |
| 7 | శ్రీకంఠాచార్యులవారు | 1270 | శైవవిశిష్టాద్వైతవాదము |
| 8 | శ్రీపత్యాచార్యులవారు | 1400 | భేదాభేదాత్మక విశిష్టాద్వైత వాదము |
| 9 | వల్లభాచార్యులవారు | 1479-1544 | శుద్ధాద్వైతవాదము |
| 10 | శుకాచార్యులవారు | 1550 | భేదవాదము |
| 11 | విజ్ఞానభిక్షువులవారు | 1600 | ఆత్మబ్రహ్మైక్యవాదము |
| 12 | బలదేవాచార్యులవారు | 1725 | అచింత్యభేదాభేదవాదము |

ఈ పై భాష్యముల మీద వార్తికములు, టిప్పణము లెన్నియో గలవు, శంకరభాష్యముపైన సురేశ్వరాచార్యుల

వారు (మండనమిశ్రుడు) 'నైష్కర్మ్యసిద్ధి' అనే స్వతంత్రగ్రంథ మును వ్రాసియున్నారు శంకరాచార్యుల శిష్యులగు ఆనందగిరి 'న్యాయనిర్ణయ మనెడి గ్రంథము వ్రాసియున్నారు తదుపరి గోవిందానందులవారు 'రత్నప్రభ యను వ్యాఖ్యానమును వ్రాసియున్నారు క్రీ శ 841 సంవత్సరమున వాచస్పతిమిశ్రులు భామతి యను వ్యాఖ్యానమును వ్రాసియున్నారు 13-వ శతాబ్దమున అమలానందులవారు 'కల్పతరువు అను వ్యాఖ్య వ్రాయగా, 16-వ శతాబ్దమున అప్పయ్యదీక్షితులవారు 'కల్పతరుపరిమళ మనెడి వార్తికమును వ్రాసియున్నారు

బ్రహ్మసూత్రములలో మొదటి నాలుగు సూత్రములు 'చతుస్సూత్రి యని ప్రసిద్ధిచెందినవి భగవత్పూజ్య పాదులవారి ముఖ్యశిష్యులు పద్మపాదాచార్యులవారు 'పంచ పాదిక యనెడి వ్యాఖ్యానమును రచియించియున్నారు క్రీ శ 1200 కాలములో ప్రకాశాత్మలవారు 'పంచపాదికా వివరణ' మను టిప్పణము వ్రాసియున్నారు తదుపరి విద్యారణ్య స్వామివారు 'వివరణప్రమేయసంగ్రహ' మను విపులమైన టీకను వ్రాసియున్నారు

క్రీ శ 900 సంవత్సర ప్రాంతమున సర్వజ్ఞాత్మముని 'సంక్షేపశారీరక' మనెడు వార్తికము వ్రాసియున్నారు మధుసూదన సరస్వతీస్వామివారు అద్వైతముపై అద్వైతసిద్ధి, 'వేదాంతకల్పలతిక', 'సిద్ధాంతబిందు వనెడి అద్వైత గ్రంథ ములు వ్రాసియున్నారు వీటన్నిటికి మూలగ్రంథమైన శంకరభాష్యము అద్వైత సిద్ధాంతమునకు ముఖ్యబీజమై యున్నది పూజ్యపాదులవారికి పరమగురువైన గౌడపాదా చార్యులవారి మాండూక్య కారికలు అద్వైత సిద్ధాంతమును

ప్రతిపాదించినవి అద్వైతమన "బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవనాపరః యనెడి వాక్యములపై పెరిగిన వృక్షమై యున్నది శంకరాచార్యులవారి భాష్యమునకు 'శారీరక మీమాంస యని పేరు శరీరస్థు డయిన ప్రత్యగాత్మను గురించి ఈ మీమాంసాశాస్త్రము బయలుదేరు చున్నది జగత్తునకు మిథ్యాత్వము ప్రాప్తింపగా జగదంతఃపాతియైన జీవునకు మిథ్యాత్వము ప్రాప్తింపవలసియున్నది మిథ్యకును, శూన్యమునకును అత్యంతభేదము గలదు మూలమైన అధిష్ఠానమునకు, వికారములేకుండా గోచరమగు వస్తువునకు మిథ్యాత్వము చెప్పవలెను రజ్జుస్థానీయమైన బ్రహ్మకు నెట్టివికారములేక గోచరమగు సర్పస్థానీయమైన జగత్తు మిథ్యయగునుగాని శూన్యముగాదు శూన్యమన అధిష్ఠానము, ఆరోపితము (బ్రహ్మ జగత్తులు) రెండునూ శూన్యములై యుండవలెను శూన్యవాదము బౌద్ధముగదా!

అద్వైత సిద్ధాంతమందు జగత్తునకు వ్యావహారికసత్త కలదు బ్రహ్మకు పారమార్థిక సత్తకలదు బ్రహ్మజ్ఞానము ప్రాప్తించినచో సాధకునకు జగత్తుయొక్క మిథ్యాత్మము స్పష్టముగా గోచరించును బ్రహ్మజ్ఞానమే ఆత్మజ్ఞానమని చెప్పు అద్వైతులకు జగత్తుయొక్క విచారము కొంత అవసరమై యున్నది చిదాభాసుడైన జీవుడు జగన్మిథ్యాత్వమును తెలియజాలక జన్మమృత్యు పరంపరలో చిక్కుకొని యున్నాడు ఇట్టి యవిద్యచే సత్యాసత్యములను కలగాపులగముచేసి లోకవ్యవహారమును సృష్టించుచున్నాడు ఇట్టి దుర్ఘటమైన పరిస్థితికి ముఖ్యహేతువు కలదని పూజ్యపాదులవారు అధ్యాసభాష్యమును రచించియున్నారు

ఆత్మానాత్మల ఐక్యము అసంభవమని చెప్పుచు లోకవ్యవహారములో నట్టి ఐక్యము సంభవమని మూడవ పేరాలో తిరిగి చెప్పుచున్నారు

అనాత్మకు 'నీవు' యనెడి సంకేతమును ఆత్మకు 'నేను' యనెడి సంకేతమును కల్పింపబడినది ఆత్మశబ్దము భిన్న భిన్నములైన మతస్థులచే భిన్నభిన్నముగా వాడబడుటచే 'ఆత్మ, అనాత్మ' యనెడి పదార్థముల నుపేక్షించి 'నీవు నేను' యనెడు సంకేతమును కల్పించుట పూజ్యపాదులవారి ప్రజ్ఞను ప్రకటింపచేయుచున్నది ఆత్మయొక్క ధర్మములు సత్యము, జ్ఞానము ఆనందములు అనాత్మయొక్క ధర్మములు తద్వ్యతిరిక్తములైన అనృత, జడ, దుఃఖములు ఈ రెంటికి పొత్తు కుదురుట అసంభవమని 1-వ పేరాలో ప్రతిజ్ఞ సేయబడినది అనగా పారమార్థికమునందు ఆత్మ యొక్కటి తప్ప మఱొకటి లేకపోవుటచే ద్వైతమునకు బాధకలుగుటచే ఆత్మానాత్మల ఐక్యము కూడ అసంభవమే యగును

3-వ పేరాలో మిథ్యాయుక్తమైన జ్ఞానము పురస్కరించుకొని "అహమిదం మమేదం అనెడు లోకవ్యవహారమంతయు నైసర్గికముగా (స్వాభావికముగా) నున్నట్లు కన్పట్టుచున్నది. ఇట్టి పారమార్థిక వ్యావహారిక సత్తాలకు వైషమ్యమునకు హేతు వుండితీరవలయును దానినే అధ్యాసయనియు, ఆరోపమనియు, అవిద్యయనియు, భ్రాంతియనియు, అజ్ఞానమనియు పర్యాయములుగా వేదాంతములలో గన్పట్టుచున్నవి.

# అధ్యాస సామగ్రి

స్వకీయమగు అభావముయొక్క అధికరణమందు నే అవభాసము గలదో దానిని అధ్యాస మందురు పారమార్థికమైన రజ్జుస్థానీయమైన బ్రహ్మయందు వ్యావహారికమై సర్పస్థానీయ అవభాసమున్నూ, మఱియు సర్పజ్ఞానమున్నూ ఏదికలదో దానినే అధ్యాస మందురు అనగా విషమసత్త గల ఏ అవభాసము గలదో అది అధ్యాసమగును పారమార్థిక సత్తయందు వ్యావహారికసత్త అధ్యాసంబగు అటులనే వ్యావహారికసత్తయందు ప్రాతిభాసికసత్త అధ్యాసంబగు అధ్యాసమునకు ఆరు సామగ్రులు కావలసియున్నవి

1 త్యవస్తు జ్ఞాన సంస్కారము పూర్వము ఎచ్చటనో సర్పము చూచినవానికే ఆ వస్తుజ్ఞాన సంస్కారముచే, నిప్పుడు రజ్జువునందు సర్పాధ్యాస మగుచున్నది అన్నడును, సత్య సర్పమును చూడనివానికి సర్పాధ్యాసము భాసించదు

2 ప్రమాతృదోషము ప్రమాతకు (చూచువానికి) సర్పభయదోష ముండుటచే సర్పాధ్యాస కలుగుచున్నది

3 ప్రమాణ దోషము పిల్లికవలె చీకటిలో స్పష్టముగా చూడచాలని మానవ నేత్రమునకు ప్రమాణదోష ముండుటచే సర్పాధ్యాస కలుగుచున్నది

4 చూడబడెడు వస్తువును ప్రమేయ మందురు త్రాటికి తత్తుల్యమైన సర్పముగా భాసించెడి యే యోగ్యత గలదో దానిని ప్రమేయదోష మనెదరు ఎవ్వడును త్రాటిని జూచి గుఱ్ఱమని పొరపాటు పడడుగదా! త్రాటినిజూచి దాని తుల్యమైన సర్పమనిగాని, లేక జలధారయనిగాని,

లేక భూమియొక్క పగులనిగాని పొరపెట్టునట్టి దోష మున్ను ప్రమేయదోష మనవలెను

5 అధిష్ఠాన సామాన్య రూపజ్ఞానము అనగా వస్తువును చూచినపుడెల్ల, ఇది సర్పము ఇది వెండి, ఇది రాయి యను భావములందు ఇది యనునది అధిష్ఠాన మగుచున్నదిగదా! ఈ అధిష్ఠానమైన ఇది లేనిచో అధ్యాసకు సంభవ ముండజాలదు కావున సామాన్య అధిష్ఠానజ్ఞాన ముండితీరవలెను

6 అధిష్ఠాన విశేషరూపముయొక్క అజ్ఞానము అధిష్ఠానము శ్రాడైయుండగా దాని విశేషధర్మము లైన జడత్వము మున్నగునవి తెలియనితనము అధ్యాసకు ఆరవ సామగ్రియై యున్నది

ఈ ఆరింటిలో నే యొక్క పదార్థము లేకున్నను అధ్యాస పుట్టజాలదు

## అధ్యాస విధములు

1 అర్థాధ్యాసము, 2 జ్ఞానాధ్యాసము

భ్రాంతిజ్ఞాన విషయమైన ఏ సర్పాది మిథ్యావస్తువు గలదో అది అర్థాధ్యాసమగును భ్రాంతిజ్ఞాన మేదిగలదో అది జ్ఞానాధ్యాస మగును అనగా సర్పము మిథ్యావస్తువు సర్ప జ్ఞానము మిథ్యాజ్ఞానము

జ్ఞానాధ్యాసము 1 పరోక్ష 2 అపరోక్ష భేదము వలన ద్వివిధముగా నున్నది

## అర్థాధ్యాసము ఆరు విధములుగా నున్నది

1 కామసంబంధాధ్యాసము, 2 సంబంధ సహిత సంబంధ్యధ్యాసము, 3 కేవల ధర్మాధ్యాసము, 4 ధర్మ సహిత ధర్మ్యధ్యాసము, 5 అన్యోన్యాధ్యాసము, 6 అన్య తరాధ్యాసము

ఈ పై విధములను విమర్శించగా స్వాధ్యాసము, ధర్మాధ్యాసము, అన్యోన్యాధ్యాసము ముఖ్యములని తేలుచున్నది

మరొకవిధముగా అర్థాధ్యాసము రెండు విధములుగా నున్నది 1 సంసర్గాధ్యాసము, 2 స్వరూపాధ్యాసము, పూజ్యపాదులవారు ఇట్టి విచారణను క్లుప్తముగా 4-వ పేరాలో విమర్శించియున్నారు

## పంచఖ్యాతి విచారణ

రజ్జువునందు అధ్యాసచే భాసించెడి సర్పముగాని, ముత్యపు చిప్పయందు భాసించెడి వెండిగాని వానియొక్క ఖ్యాతిని [కథనము] దార్శనికులు వారి వారి మతముల కనుకూలముగా విమర్శించియున్నారు

1 నైయాయిక వైశేషికుల వాదము అన్యథాఖ్యాతి అందురు వీరి వాదము ప్రకారము అచ్చట కన్పట్టు సర్పము సత్యమైన సర్పమని చెప్పుదురు కాని, నేత్రములందున్న తిమిరాది దోషమువలన నా నిజమైన సర్పము ఈ రజ్జుదేశము నందు ప్రతీతమైనదని చెప్పెదరు సత్యసర్పము యొక్కయు, నేత్రము యొక్కయు మధ్యభాగమందు భిత్త్యాదికమైన (గోడ మున్నగునవి) అంతరాయములు గలవు అట్టి దోష

సహిత నేత్రమువలన నంతరాయమున్నను, ఇచ్చట గోచరించునది సత్యమైన సర్పమని అన్యథాఖ్యాతివాదము ఇది ముఖ్యముగా ధర్మాధ్యాస యగుచున్నది

2 అఖ్యాతివాదము కపిల సాంఖ్యులు ప్రాభాకర వాదీయులు ఈ వాదము నుద్ఘాటించుచున్నారు 'ఇది సర్పమై యున్నది యను వాక్యమందు రెండు జ్ఞానములు గలవు ఇది యనెడి యంశము సామాన్యమైన ప్రత్యక్ష జ్ఞానము సర్పమున్నది యనెడి అంశము పూర్వము చూచిన సర్పముయొక్క స్మృతిజ్ఞానము ఈ రెండు జ్ఞానములయొక్క యవివేకమును [ విడతీయజాలమిని, అశక్తతను ] భ్రమ యందురు ఈ భ్రమవలన అధ్యాస ప్రాప్తించుచున్నది ఇచ్చట సర్ప భ్రమ రెండు విధములైన జ్ఞానములచే పుట్టు చున్నదని వీరివాదము

3 అసత్ ఖ్యాతివాదము బౌద్ధులలో శూన్యవాదులు చెప్పిన దిది రజ్జుదేశమందు సర్పము లేనే లేదు అనగా అత్యంతాసత్తగుచున్నది అటులనే అన్యదేశమందును సర్పము బొత్తిగా లేదు వీరి వాదమున సర్పమెచ్చటను లేదని [ జగత్తంతయు అత్యంత శూన్యము గావున ] త్రాడుయందు గూడా సర్పము శూన్యమని చెప్పుదురు అనగా వంధ్యా పుత్రుడు, గగనకుసుమము, ఇత్యాది అలీకములను [ నామ మాత్రమేగాని, వస్తుశూన్యమని ] వీరు జగత్తును చూచుటచే దీనిని అసత్ ఖ్యాతివాదమందురు

4 ఆత్మఖ్యాతి వాదము బౌద్ధులలో నొకతెగవారైన క్షణికవిజ్ఞానవాదులు గలరు వీరు శూన్యవాదమును ఖండించి క్షణికవిజ్ఞానవాదమును ఉద్ఘాటించెదరు. బుద్ధియే

పరిణామమ్ములైన భయకంపాదులు గలుగుట వలన సర్పము అసత్తు గాదు త్రికాలాబాధిత సత్తయందు అస్తిత్వశూన్యమైనట్టి వంధ్యాపుత్రాది పదార్థములను అసత్ అందురు కావున, భాసించెడి సర్పము సదసత్ పదార్థముయొక్క గ్రహణమగుచున్నది ఇది సత్తుకన్నను, అసత్తు కన్నను విలక్షణముగ నున్నది సదసద్ విలక్షణమునే అనిర్వచనీయమందురు ఈ ఖ్యాతి ననుసరించి సర్పస్థానీయమగుచున్న జగత్తు రజ్జుస్థానీయమైన బ్రహ్మజ్ఞానముతోడనే నివర్తించు చున్నది ఇదమిత్థమని స్పష్టముగా ఉద్ఘాటించుటకు వీలు లేని సర్ప స్థానీయమైన ఖ్యాతిని అనిర్వచనీయఖ్యాతి యందురు

పుట 54 భాష్యమందు పూజ్యపాదులవారు సంక్షిప్తముగా ఖ్యాతులను 4-వ పేరాలో నుటంకించి అధ్యాస ధర్మమును అన్నిమతములవారికి సమ్మతమని సమన్వయించుచూ, ఒక ధర్మమును అన్యమందు ఆరోపింపచేయుటయే అధ్యాసమని సెలవిచ్చియున్నారు

అయిదవ పేరాలో ఉద్ఘాటించిన పూర్వపక్షమును [ అనగా ఆక్షేపణను ] పూజ్యపాదులవారు బహునేర్పుతో ఖండించిరి సాక్షాత్ పురోగత [ ముందున్న ] వస్తువులయందే కాక, అప్రత్యక్షమైన వస్తువులను గురించికూడా అధ్యాస కార్యము సంభవమగునని ఆకాశదృష్టాంతము నిచ్చి యున్నారు రూపశూన్యమైన ఆకాశమందు ఎరుపు, నలుపులను రంగులను కల్పించి, ఆకాశమునకు విరుద్ధమైన ధర్మములను ( నల్లని ఆకాశమని గుండ్రని ఆకాశమని ) పామరులు చెప్పుటను అధ్యాసయని చెప్పవచ్చును అటులనే ఆత్మను విషయముగా చేసి, ( అస్మత్ ప్రత్యయమునకు ) ఆత్మను

విషయముగా చేసినట్లు వేదాంత గ్రంథములలో గన్పట్టు చున్నది మఱియును, అపరోక్షమునకు విషయముగా ఆత్మ ఉద్ఘాటింపబడుచున్నది కావున ఆత్మానాత్మలకు వ్యవహార దశయందు అధ్యాస సంభవమగుచున్నదని పూర్వపక్షమును ఖండించిరి

ఈ 5-వ పేరాలో అధ్యాసము అవిద్యయనియు, వివేకముచే ప్రాప్తించిన వస్తురూపజ్ఞానమును విద్యయనియును నిర్వచించిరి మీదుమిక్కిలి అధ్యాసవలన అనగా ప్రపంచము వలన, జీవులవలన కల్పించెడి అధ్యాసయొక్క దోషములు ఈషణ్మాత్రమైనను, సర్వాధిష్ఠానమైన బ్రహ్మను బాధింప జాలవు ఈ ప్రతిజ్ఞావాక్యముల వలన బ్రహ్మయొక్క నిత్య, శుద్ధ బుద్ధ ముక్తస్వభావము నిశ్చయింపబడినది

పుట 58 ఆరవ పేరాలో లౌకిక వ్యవహారము లన్నియు, విధినిషేధశాస్త్రములును, మోక్షపరములైన వేదాంతములును అధ్యాసను బురస్కరించుకొనియే చెప్ప బడినవని పూజ్యపాదులవారు నిశ్చయించినారు దీనివలన ప్రత్యక్ష ప్రమాణ శబ్దాది ప్రమాణములు కూడా బాధింప బడుచున్నవని తేలుచున్నది సర్వ వ్యవహారముల ప్రవృత్తులు గూడ నిష్ఫలము లగుచున్నవి ఈ సిద్ధాంతము చక్కని యుక్తులతో పూజ్యపాదులవారు సమర్థించిరి

పుట 60 అహం - మమ - అభిమాన రహితునకి కర్తృత్వము లేమిచే నతనికి ప్రత్యక్షాది ప్రమాణములతో బని లేదు అటులనే ఇంద్రియములందు అభిమానము లేని వానికి ప్రత్యక్షాది ప్రమాణములతో పనియుండదు దేహమందు అభిమానము లేని వానికి నింద్రియ వ్యవ

హారము సంభవము గాదు దేహమందు ఆత్మభావము ఆరోపింపని జ్ఞానికి లోకవ్యాపారమునందు ప్రవర్తన యుండదు సంగహీనుడైన ప్రత్యగాత్మను నేను అనెడి జ్ఞానికి కర్తృత్వము (ప్రమాతృత్వము) సంభవింపదు ప్రమాతృత్వము లేకుండా వేద వేదాంతాది శాస్త్రము లందును ప్రత్యక్ష అనుమానాది ప్రమాణము లందును ప్రవృత్తి కలుగదు కావున సర్వప్రమాణములును శాస్త్రము లును అవిద్యావంతునిగూర్చియే యుత్పన్నమగుచున్నవి

పుట 62 7 ఈ పేరాలో పశువులకును విద్యాహీను లకును విద్యావంతులకును జ్ఞానులకును కూడ ప్రమా తృత్వము సమానమని నిశ్చయింపబడినది దేహము దు యత్కించిత్ అభిమానముగాని, ఆత్మాధ్యాసగాని సమస్త ప్రాణులకున్నదని ఈ పేరాలో నిశ్చయింపబడినది

పుట 64 8 ఈ పేరాలో శాస్త్రీయ వ్యవహార మంతయు పరలోక వాంఛయు ఉత్తమజన్మ కాంక్షయు అవిద్యాత్ములకు (వేదాంతశాస్త్రజ్ఞాన రహితులకే) యుండునని, మఱియు, తత్తత్ కర్మలను బురస్కరించుకొని, కుల మత వయోవిషయములందు అధికృత మగుచున్నదని చెప్పబడినది కాని, ఆత్మతత్వము కర్మలతో సంబంధ రహితమని కుల మత భేదరహితమని, అధికారాపేక్ష రహితమని పూజ్యపాదులవారు నిశ్చయించుటచే జ్ఞాన మార్గము సర్వులకు అపేక్షణీయమని ప్రకటింప బడినది ముముక్షువులకు కూడా ఆత్మజ్ఞానము కలుగక పూర్వము వైరాగ్యాదులను పుట్టించుటకై వేదాంతశాస్త్రము చెప్ప బడినదని ఉద్ఘాటించుటచే, వేదవేదాంగ శాస్త్రములన్నియు

అధ్యాసను బురస్కరించుకొనియే ప్రవర్తించుచున్న వనియు నిశ్చయింపబడినవి

పుట 66 9 ఈ పేరాలో

"అధ్యాసోనామ అతస్మిన్ తద్బుద్ధిః"

అధ్యాస యన అది గానిదానియందు దాని బుద్ధి (సర్పము గానిదానియందు సర్పబుద్ధి) యని ప్రసిద్ధమైన నిర్వచనము

పుత్రభార్యాదులందున్న మోహబుద్ధిచే వారల యోగక్షేమములను తనయాత్మయం దధ్యసించుకొని సంసారులు మోహపడుచున్నారు స్వదేహధర్మములైన స్థూలత్వ కృశత్వాదులను తనయాత్మయందు అధ్యసించు చున్నారు ఇంద్రియధర్మములైన మూకత్వ, బధిరత్వ అంధత్వములను తనయాత్మయందు అధ్యసించుచున్నారు అంతఃకరణ ధర్మములైన కామములను, సంకల్పములను, సంశయములను, నిశ్చయములను తనయాత్మయం దధ్యసించుచున్నారు ఇదంతయు ఆత్మయందు జేయబడు అనాత్మాధ్యాసయని చెప్పబడును అనగా సప్తధాతు వుల వికారమైన దేహము ప్రాణాపాన వ్యానోదాన సమానమనెడి పంచవాయువులు, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ లనెడి కర్మేంద్రియములు, శ్రోత్ర, ఘ్రాణ, నేత్ర, రస, త్వగింద్రియములనెడి జ్ఞానేంద్రియములును అంతఃకరణము లైన మనో, బుద్ధి, చిత్త, అహంకారములు, ప్రియ, మోద, ప్రమోదములనెడి ఆనందమయకోశ ధర్మములు, చిదా భాసుడైన జీవునియొక్క జననమరణాది ధర్మములు తన

ప్రత్యగాత్మయందు దధ్యసించుటయే యీ యధ్యాసయొక్క ప్రభావమని తెలియనగును

అటులనే సత్య జ్ఞానానందమైన అహం ప్రత్యయమును తన ప్రత్యగాత్మయందు అధ్యసించుచున్నాడు ఇట్టి అధ్యాస (అన్యోన్యాధ్యాస) అనర్థహేతువై యున్నది ఇది స్వాభావికముగా నున్నట్లు కనబడుచున్నది కాని, ఇది మిథ్యాజ్ఞానచిహ్నమని తెలియజాలక లోకమందు జీవులు కర్తృత్వభోక్తృత్వ కారకులై జనన మరణాది చక్రమందు పరిభ్రమించుట సర్వులకు విదితము

పుట 68 10-వ పేరా ఈ అధ్యాస యనెడి హేతువు వలన ప్రాప్తించిన యనర్థమును పరిహరించుటకై సమస్త వేదాంతశాస్త్రము ప్రారంభించుచున్నది మఱియు ఈ వేదాంతశాస్త్రమువలన నానాత్వమనెడి ద్వైత సిద్ధాంతము ఖండింపబడి ఆత్మ ఒక్కటియే యను జ్ఞానము కలుగుచున్నది

మోక్ష విద్యాజ్ఞానము కలుగుటకై వేదాంతశాస్త్రము లుత్పన్నమైనవి కావున సర్వవేదాంతములకు (ఉపనిషత్తులకు) ఆత్మైక విద్యయే పరమ తాత్పర్యమని స్థాపించుటకు శారీరక మీమాంసా అనే శాస్త్రమునందు పూజ్యపాదుల వారు ప్రదర్శింపబోవుచున్నారు

పేరా 10 (అ) ప్రతి శాస్త్రమునకు అనుబంధ చతుష్టయ మని నాల్గవయవము లుండుట ప్రాచీన పద్ధతి శారీరక మీమాంసా శాస్త్రమునకు అధికారి 1 సాధన చతుష్టయ సంపన్నుడైన ముముక్షువు 2 విషయము -బ్రహ్మజ్ఞానము, 3 సంబంధము-గ్రంథము ప్రతిపాదకము, బ్రహ్మజ్ఞానము ప్రతిపాద్యము, 4 ఫలము- ఆత్మైకత్వము, బ్రహ్మవిజ్ఞానప్రాప్తి,

పుట 70 పేరా 11 సమన్వయాధ్యాయః

పేరా 11 బ్రహ్మసూత్రములో నాల్గు అధ్యాయములు కలవు

1 సమన్వయాధ్యాయము, 2, అవిరోధాధ్యాయము, 3 సాధనాధ్యాయము 4 ఫలాధ్యాయము ప్రతి అధ్యాయములోను 4 పాదములు గలవు మొత్తము గ్రంథములో 192 అధికరణములు గలవు 555 సూత్రములు గలవు మొదటి అధికరణము జిజ్ఞాసాధికరణము ప్రతి అధికరణమునకును అయిదు అవయవములుండును 1 విషయవాక్యము, 2 సంశయము, 3 పూర్వపక్షము 4 సిద్ధాంతము, 5 సంగతి ప్రస్తుత అధికరణములో నొక్కటే సూత్రము గలదు (' అథాతో బ్రహ్మ జిజ్ఞాసా )

సూత్రము బహ్వర్థసూచకముగా నుండవలెనని భామతికారుడు చెప్పెను ( సూత్రే బహ్వర్థసూచనాత్ - భామతి 1-1-1 ) సూత్రములు లఘువుగా నుండవలెనని, స్వల్పాక్షరములుండవలెనని సారభూతముగా నుండవలెనని, సందిగ్ధముగా నుండరాదని కొందరు చెప్పియున్నారు

శ్లో॥ లఘూని సూచితార్థాని । స్వల్పాక్షర పదానిచ
సర్వతః సారభూతాని । సూత్రాణ్యాహుర్మనీషిణః॥

శ్లో॥ అల్పాక్షరం, అసంగిద్ధం సారవత్ విశ్వతోముఖం
అస్తోభం అనవద్యంచ, సూత్రం సూత్రవిదోవిదుః॥

ఇట్టి లక్షణములు గలిగిన సూత్రములు పాణిని, ఆపస్తంబుడు జైమిని మున్నగు మహనీయులు వ్రాసియుండిరి పూజ్యపాదులవారు ( శంకరులవారు ) ఇటులు

చెప్పుచున్నారు "వేదాంతవాక్యకుసుమ గ్రథనార్థత్వాత్ సూత్రాణాం" ( 1-1-2 భాష్యము )

వేదములను విభాగించి పురాణములను రచించి భారత గ్రంథకర్తయైన కృష్ణద్వైపాయనుడే బ్రహ్మసూత్రములను రచించిన బాదరాయణులవారు ద్వాపర కలియుగముల సంధికాలమందు వీరు బదరికాశ్రమంబున నుండుటచే బాదరాయణ వ్యాసాచార్యులవారను పేరు వచ్చినది అంతకుపూర్వము వృత్తికారులను జ్ఞానకర్మ సముచ్చయవాదులు కొందరుండిరి పక్షికి రెండు రెక్కలు లేనిచో నెటుల నెగురజాలదో, అటులనే జ్ఞానము, కర్మము రెండునూ నిత్యము అభ్యసించినగాని మోక్షప్రాప్తి యుండదని జ్ఞానకర్మ సముచ్చయవాదమును వీరు ప్రకటించు చుండిరి అయినను అద్వైతులు లేకపోలేదు "జ్ఞానాదేవతు కైవల్య" మను నైష్కర్మ్యముచేత ముక్తి ప్రాప్తియని చెప్పునట్టి అద్వైతులు కొందరున్నట్లు సూత్రములలో స్పష్టముగా కన్పట్టుచున్నది వారెవరన, బాదరి, ఔడులోమి కాశకృత్స్నుడు, ఆశ్మరథ్యుడు మున్నగు వారలు కృష్ణద్వైపాయనుకు జైమిని యనెడు శిష్యుడు గలడు ఇతడు పూర్వమీమాంస ( కర్మకాండ ) ను గురించి సూత్రములను వ్రాసియున్నాడు పెక్కుచోట్ల కర్మకాండను వ్యాసులవారు తనసూత్రములలో ఖండించినారు

11-వ పేరాలో సూత్రము, పదవిభాగములే కాక వాక్యపూరణము, వృత్తియు వ్రాయబడినది మరియును, అధికరణముయొక్క పంచావయవములు గూడ వ్రాయబడినవి సాధారణముగా వేదాంతవాక్యములలో స్పష్టత

లేని సందర్భమున గాని, పరస్పర విరుద్ధవాక్యము లుండిననే గాని అధికరణము ( Topic ) పుట్టఁజాలదు ఈ యధికరణముల ద్వారా వేదాంతములలో ( ఉపనిషత్తులలో ) ప్రాప్తించెడు సంశయములు, విపర్యయములు ( Contradictions ) నిర్మూల ముగాఁ జేయఁబడి వేదాంతమునకు శాస్త్రత్వము కల్పింపఁ బడినది

పుట 72, పేరా 12 – అథ శబ్దమున కయిదర్థ ములు గలవు

1 మంగళార్థము, 2 తదుపరి యనుట, 3 ఆరంభించు చున్నామనుట 4 ప్రశ్నార్థకము 5 అంతయు అయినది యనుట

" మంగళానంతరారంభప్రశ్న కార్త్స్న్యేష్వథో అథ " యని యమరకోశము ఈ యయిదర్థములలో రెండ వదియైన ' తరువాత యనెడి యర్థమునే గ్రహించవలెనని భాష్యము ' తరువాత ' యని చెప్పుటచే దేని తరువాత ? యనెడు పశ్న యుత్పన్న మగుచున్నది పూజ్యపాదులవారు పూర్వమీమాంసకుల పద్ధతిని పరిహరించి సాధనచతుష్ట యానంతరము బ్రహ్మజిజ్ఞాస కధికార మేర్పడునని స్పష్టీకరించినారు మంగళార్థము కుదురకపోయినను, శ్రవణమాత్రముతో మంగళప్రయోజనకారియగుచున్నదని 12 ( అ ) పేరాలోఁ జెప్పియున్నారు ఇక పూర్వ మీమాంసకుల వాదన ననుసరించి వేదాధ్యయనముగాని, ధర్మజిజ్ఞాసగాని బ్రహ్మజిజ్ఞాస కనవసరమని ( ఆవశ్యకములు కావని ) 74–వ పేజీలోఁ జర్చించినారు.

76-వ పుట, 13-వ పేరాలో బ్రహ్మజిజ్ఞాస ఫలమును, ధర్మజిజ్ఞాస ఫలమును విపులీకరించినారు బ్రహ్మజిజ్ఞాసకు నిశ్శ్రేయస్సు అనగా (నిరంతరము ఆనందమనెడు) నిత్యముక్తి ఫలమగుచున్నది ధర్మజిజ్ఞాస (కర్మకాండ) కు అనగా వేదాధ్యయనాదుల ఫలము అభ్యుదయము (ఉత్తమ జన్మ, స్వర్గలోకాది ప్రాప్తి) కేవల ధర్మజిజ్ఞాస వలన నీయభ్యుదయ ఫలము ప్రాప్తింపదు

ఆ జిజ్ఞాసానుకూలముగా యజ్ఞయాగాది క్రతువులు గాని, కృచ్ఛ్రాది తపస్సులుగాని యిష్టాపూర్తముల యనుష్ఠానముగాని సల్పినచో సాధకున కపూర్వ మనెడి ఫలము సిద్ధించి మరణానంతరమున తత్తల్లోకప్రాప్తి గలుగును. కావున ధర్మజిజ్ఞాస కనుష్ఠాన మవసరమైయున్నది ఇక బ్రహ్మజిజ్ఞాస కనుష్ఠానముతో నెట్టి యావశ్యకతయు లేదు "న కర్మణా న ప్రజయా ధనేన " అని శ్రుతి చెప్పుచున్నది కర్మగ్రహణముల కన్న కర్మ త్యాగముల వల్లనే (సన్యాసము వలననే) నిశ్శ్రేయస ఫలప్రాప్తియగు మఱియును ధర్మమనునది సాధ్యముగాని సిద్ధము గాదు అనగా అనుష్ఠానము చేత పుట్టింపఁదగినదై యున్నది కావున కేవల ధర్మజిజ్ఞాసకాలమందు ధర్మఫలము పుట్టుటకు వీలులేదు ధర్మజిజ్ఞాసానంతరమందున పురుష వ్యాపారము (క్రతువులు, ఉపాసనలు మున్నగు వైదికక్రియ) లను బట్టి ఫలము బుట్టఁగలదు దీనినే "పురుషతంత్ర' మందురు ఇక బ్రహ్మజిజ్ఞాసకు పురుషతంత్ర మెట్టిదియు లేకనే జిజ్ఞాసకాలమందే జీవన్ముక్తి ప్రాప్తించు నవకాశము గలదు ఇచ్చట పుట్టవలసిన ఫలము లేకపోవుటయేగాక, నిత్యసిద్ధమై

యున్న బ్రహ్మ గోచరించుటయే ఫలము దీనినే ' వస్తుతంత్ర ' మందురు

76-వ పుట, 14-వ పేరా ధర్మము కర్మయందు "చోదన ' (ప్రేరేపణ) చే పురుషుని నియమించును బ్రహ్మజిజ్ఞాసయందు క్రియాచరణతో సంబంధములేని బ్రహ్మసాక్షాత్కారము గలుగును ఇందు చోదన యెచ్చటను గోచరించదు కావున ధర్మజిజ్ఞాసకు బ్రహ్మ జిజ్ఞాసకు మిక్కిలి వ్యత్యాసము గలదు కావున కర్మ సముచ్చయవాద మనుపపన్నమని యద్వైతుల వాదము జిజ్ఞాసము వలననే కైవల్యమనియు, కర్మోపాసనలవలన చిత్తశుద్ధి ఏకాగ్రతలు మాత్రమే కలుగునని అద్వైతులు సిద్ధాంతీకరించిరి ద్వైత సాధకులైన సగుణోపాసకులకు కర్మలు ఉపాసనలు ఇష్టాపూర్తములు విహితములే అధికార భేదముచేత అద్వైతులలో మందాధికారులకును, మధ్యమాధికారులకును సగుణారాధనయందు భక్తియందు, వేదాధ్యయనమందు, యజ్ఞయాగాది క్రతువులందు అధికార ముండవచ్చును కాని యదియే "పరమ తాత్పర్య 'మను చెప్పు ద్వైతులయొక్క పూర్వ మీమాంస కుల యొక్క మతము అద్వైతులకు సమ్మతము గాదు

పుట 78, 15-వ పేరా బ్రహ్మజిజ్ఞాసులకు సాధనములు పరమతాత్పర్యము కాకున్ననూ కొలదిగా చతుర్విధము లయిన సాధనచతుష్టయమును పూజ్యపాదుల వారు విధించి యున్నారు అదియేమన 1 వివేకము 2. వైరాగ్యము, 3 శమాదిసంపత్తి 4 ముముక్షుత్వము వివేకమన నిత్యా నిత్య వస్తువిజ్ఞానము శాస్త్రమువలనను, గురుముఖమునఁ దెలిసి

కొనుట ఆత్మ నిత్యమనియు, శరీరత్రయము అనిత్యమనియు తెలియుటయే ఇట్టి వివేకము కేవలము యుక్తులపై, ఉపమానములపై, వాక్చాతుర్యముపై సాధించరాదు. వేదాంతాది పారమార్థిక గ్రంథములను గురుముఖమున శ్రవణముచేసిన గాని నిత్యానిత్యవస్తు వివేక మలవడదు ఇక, "వైరాగ్య మన్న యిహలోక పరలోక భోగము లన్నియు అనిత్యములని నిశ్చయమేర్పడుట శమదమాదులు, యమ నియమములును పరిపాటించిననేగాని శమాది సంపత్తి చేకూరదు తదుపరి జీవన్ముక్తి, మరణాంతే విదేహ ముక్తియందు అభినివేశము (పట్టుదల) బుద్ధియందు సంపాదించుటయే ముముక్షుత్వము ఈ సాధన చతుష్టయ సంపత్తిలో నేది లోపమైనను బ్రహ్మజిజ్ఞాస కాటంక మేర్పడవచ్చును కావున ముముక్షువులే యీ సంపత్తిని సంపాదించినచో బ్రహ్మజిజ్ఞాసకు నర్హులగుదురు

కావున 'అథ శబ్దమునకు సాధన చతుష్టయ సంపత్త్యనంతరమని అర్థము చెప్పవలెను

పుట 80, 16-వ పేరా "అతః" శబ్దము తసిల్ ప్రత్యయముతో పంచమీ విభక్తిన హేత్వర్థమున ప్రయోగించబడిన అవ్యయము హేతువనగా కార్యమునకు సాక్షాత్తుగా పూర్వముండునది ఎట్టి హేతువువలన వైరాగ్య మలవడునో యట్టిది అతః శబ్దముచేఁ జెప్పబడుచున్నది వేదమందే అగ్నిహోత్రాదుల కనిత్యఫలత్వము సూపబడినది మఱియును బ్రాహ్మణుఁడు కర్మరూపమైన, లేక కర్మచే పొందఁబడు "ఇహపరలోకము లన్నియు అనిత్యము" లని

నిశ్చయించి, నిత్యఫలమును గురించి ప్రయత్నము చేయతగు నని ముండకోపనిషత్తులో "పరీక్ష్యలోకాన్" అను వాక్యముచే నిశ్చయింపఁబడినది కావున నిహపరసౌఖ్యముల త్యజించుట ప్రథమ సోపానమై యున్నది మఱియును కర్మజిజ్ఞాసను తదుపరి బ్రహ్మజిజ్ఞాసయందు నిమగ్నులైన వారికి పరమపురుషార్థమును, అమృతత్వమును ఆత్మసాక్షాత్కారమును ప్రాప్తించునని యుపనిషద్వాక్యములు పెక్కులు వక్కాణించుచున్నవి

పుట 82, 17-వ పేరా బ్రహ్మ విచారింపదగినదని బ్రహ్మవలన భూతముల సృష్టి స్థితి లయములగుచున్నవని తైత్తిరీయ ఉపనిషత్ చెప్పుచున్నది అటులనే బృహదారణ్యకమునందు ఆత్మయే శ్రవణ మనన, ధ్యానములకు యోగ్యమైనదని విధివాక్యము కలదు

ఇచ్చట "బ్రహ్మ" శబ్దమునకు చతుర్ముఖబ్రహ్మ యని గాని బ్రాహ్మణాది మానవజాత్యర్థము గాని చెప్పగూడదు సృష్టి స్థితి లయములకు కారణమైన బ్రహ్మనే "బ్రహ్మజిజ్ఞాస" శబ్దములో చెప్పవలెను కాని, బ్రహ్మజిజ్ఞాసయను సమాసము కర్మణిషష్ఠిగా అనగా షష్ఠితో విగ్రహము చెప్పుచూ, అర్థమందు కర్మణ్యర్థము జెప్పవలెను బ్రహ్మజిజ్ఞాస యనగా బ్రహ్మయొక్క జిజ్ఞాస యని గాని, బ్రహ్మకు జిజ్ఞాసయనిగాని శేషషష్ఠి చెప్పరాదు అదియును గాక జిజ్ఞాస్యమగు వస్తువు నిచ్చట నిర్దేశింపఁబడక పోవుటచేత "బ్రహ్మనుగూర్చిన జిజ్ఞాస" యని కర్మణిషష్ఠి చెప్పవలెను ఇచ్చట సమాసార్థమును గురించి కించిత్ వ్యాకరణ సంబంధమైన యర్థము చర్చింపబడినది షష్ఠి విభక్తిలోనే

అనగా బ్రహ్మ సంబంధమైన జిజ్ఞాస యని చెప్పవచ్చునేమో యని పూర్వపక్షమును బురస్కరించుకొని పూజ్యపాదులవారు అదంతయు వ్యర్థప్రయాసయనియు కర్మణి షష్ఠి చేత చెప్ప దగిన యర్థమును వదలి సంబంధషష్ఠిని గ్రహించుటలో విశేషమేమియును లేదనియు చెప్పియున్నారు మఱియును, ఇట్టి సందర్భములలో కర్మణ్యర్థము సమంజసమని సెప్పుటకు 88–వ పేజీయందు శ్రుతివాక్యము లుటంకింపబడినవి కావున బ్రహ్మజిజ్ఞాసయనగా "బ్రహ్మను గురించిన జిజ్ఞాస" (విచారణ) యని సెప్పుట నుత్తమమని సిద్ధాంతీకరించిరి

88–వ పుట, 18–వ పేరా 'జిజ్ఞాసా శబ్దమునకు వ్యాకరణార్థకమైన యర్థమును పూజ్యపాదులవారు అతిదేశించి జిజ్ఞాస యనగా తెలుసుకొనవలెనను కోరికతో ప్రారంభించి బ్రహ్మావగతి (బ్రహ్మసాక్షాత్కార) పర్యంతము నర్థమగునని చెప్పియున్నారు బ్రహ్మ జిజ్ఞాసవలన సంసారబీజము (అవిద్య) నాశన మగును కాబట్టి బ్రహ్మయే తెలియదగిన వస్తువని సిద్ధాంతీకరించిరి

పుట 90 19–వ పేరా బ్రహ్మపదార్థమునకు ప్రసిద్ధత యున్నదా ? లేదా ? యను విషయము ఇచ్చట చర్చనీయ మైనది బ్రహ్మ ప్రసిద్ధమైనచో దానిని గురించి వెతుక వలసిన పనిలేదు అప్రసిద్ధమైనచో వెతకినను దొరకుట యసంభవమగును యనెడు పూర్వపక్షమును పూజ్యపాదుల వారు సమాధానరూపముగ బ్రహ్మ ప్రసిద్ధ మనియు నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావమనియు, సర్వజ్ఞమనియు సర్వశక్తి సమన్వితమనియు 'బృహి–వృద్ధౌ' అనే ధాత్వర్థము, ఇట్టి యర్థమునే సూచించుచున్నదనియు సిద్ధాంతీకరించిరి

ఇట్టి బ్రహ్మ సర్వజీవులయందును, ఆత్మరూపముగా ప్రసిద్ధముగా నున్నదని సర్వులకు ననుభవమై యున్నది ఎవ్వఁడును తను లేనట్టివానినిగాఁ జెప్పుటలేదుగదా! కావున నట్టి యుక్తి ననుసరించి ఆత్మప్రసిద్ధతయే బ్రహ్మయొక్క ప్రసిద్ధత యని స్పష్టమగుచున్నది అయినను ఇట్టి స్పష్టమైన బ్రహ్మను గురించి నన్వేష్టవ్యత (వెదుకవలసిన ఆవశ్యకత) లేనే లేదు గదా యని పూర్వపక్షము ప్రాప్తించుచున్నది ఇందుకు సమాధానముగా పూజ్యపాదులవారు చక్కని సమాధానము నిచ్చిరి బ్రహ్మ ప్రసిద్ధమైనను బ్రహ్మను గురించి విరుద్ధములైన పెక్కు భావములుండుటచేత నట్టి యవైదిక అయుక్తిక భావములను పరిహరించుటకై జిజ్ఞాస ఆవశ్యక మగుచున్నదని చెప్పిరి అట్టి విప్రతిపత్తులు (Contradictions) ఎనిమిది విధములుగా నున్నవి అవియేవన (పేజీ 92 పేరా 20) (1) చార్వాక మతస్థులు (Materialists) చైతన్యముతోఁగూడిన దేహమునే ఆత్మ యనుచున్నారు వీరిలో "ధూర్త" లని "సుశిక్షిత" లని రెండు తెగలు కలవు ధూర్తులు శరీరముతో ఆత్మ పుట్టుచున్నదనియు, మరణముతో ఆత్మ నశించుచున్నదనియు పలికెదరు వీరిమతమున ఆత్మ శరీరమున్నంతవరకే యుండునని పలికెదరు సుశిక్షిత చార్వాకులు ఆత్మగాని, జీవుడుగాని ఒక శరీరమునుండి ఇంకొక శరీరము లోనికి ప్రవేశింప జాలదని చెప్పుదురు కావున చార్వాకులకు దేహాత్మవాదులని పేరు వీరినే లోకాయతికులని కూడ యందురు ఈ మతమును వాత్స్యాయనుఁడు, ఉదయనుఁడు, జయంతుఁడు, విజ్ఞానభిక్షువు,

వాచస్పతిమిశ్రుఁడు, శంకరాదులు తీవ్రముగా ఖండించిరి ఆత్మ దేహముతో తాదాత్మ్యమును బొందియున్నచో దేహమువలె ఆత్మకూడ నింద్రియ గోచరము కావలసి యున్నది అటుల అనుభవములో లేదు మరియును దేహము నందు అంగవిశేషములు పెక్కులు గలవు కన్ను, ముక్కు కాలు మొదలగునవి సర్వాంగములందు చైతన్యము గోచరించుట సర్వుల కనుభవమే అట్టితఱి ఆత్మ చైతన్యము శరీరములో నేభాగమున నున్నదో చెప్పుటకు వీలుపడదు కదా! మరియును ఒకటి రెండు అంగములు వికలమైనపుడు ఆత్మకు కూడా వికలత్వము ప్రాప్తించవలెను కావున వాత్స్యాయనుని వాదము ప్రకారము ఆత్మకును దేహము నకును తాదాత్మ్యము లేదని చార్వాకవాదము ఖండింప బడినది

ఉదయనుఁడు చార్వాకవాదమును ఖండించుచు స్మృతివాదమును అభిజ్ఞావాదమును బట్టి ఆత్మకు దేహముతో తాదాత్మ్యము కుదురదని చెప్పియున్నారు బాల్యములో నుండు చైతన్యమునకు,వృద్ధాప్యములోనుండు చైతన్యమునకు భేదము గన్పట్టుటలేదు బాల్యాది దశలలో నున్న యనుభ వము లన్నియును వృద్ధాప్యమున స్మృతికి వచ్చుటచే దేహము నకును, చైతన్యమునకును తాదాత్మ్యము కుదురదని చెప్పి యున్నారు

జయంతుఁడు, చైతన్యమునకు శరీరముతో తాదాత్మ్యము చేసినచో దేహమునకు మూర్ఛగాని, మృత్యువుగాని ప్రాప్తించుటకు వీలులేదని యుక్తి చెప్పినాడు మరియును దేహముయొక్క వృద్ధి క్షయములనుబట్టి ఆత్మకు చైతన్య

వృద్ధి క్షయము లేర్పడవలసి యున్నది అట్టిది అనుభవములో కానరాదు

విజ్ఞానభిక్షువు చైతన్యము యొక్క యుత్పత్తిని గురించి కొన్ని విప్రతిపత్తుల నుటంకించినాడు దేహములోనున్న పంచభూతముల సమ్మేళనమువలన నాత్మకాని, చైతన్యము కాని యుద్భవించినట్లయినచో ఏ ఒక్క తన్మాత్రకు లోపము వచ్చినను చైతన్యమునకు లోపము రావలయును అటుల జరుగుట లేదు పక్షవాతరోగికి కూడా తన యాత్మయందు న్యూనత గన్పట్టకపోవుట సర్వులకు విదితమే మఱియును శరీరమునకు చైతన్యము గూడ నొక సహజ లక్షణమే యైనచో శరీరములో నొక భాగమైన యొక కాలుగాని చెయ్యిగాని తెగకొట్టిన పక్షమున ఆ కాలుకు చేతికి కూడా చైతన్య ముండితీరవలయును కాని అనుభవములో నట్లు లేదు

వాచస్పతిమిశ్రుని వాదము— చైతన్యము శరీరము యొక్క విశేష గుణమని చెప్పనచో నట్టి విశేష గుణము (చైతన్యము) నిద్రలోను మూర్ఛలోను భాసింపవలసినదే కాని, భాసించుట లేదు

మరియును చైతన్యము ఆత్మయొక్క ధర్మమైనచో నది సర్వులకు గోచరింపవలసియున్నది కాని అటుల గోచరించుట లేదు మరియును చైతన్యము జడమా, లేక జీవము గలిగినదా యనెడి ప్రశ్నకు చార్వాకులు చైతన్యము జడమని చెప్పియున్నారు అనుభవములో ఒక జడపదార్థము మరియొక జడపదార్థమును గ్రహింపఁజాలదు గదా! కావున చైతన్యము జడపదార్థము కాదని నిశ్చయము చేయవలసి

యున్నది మరియును స్మృతి అనగా బాల్యాద్యవస్థల యందు జరిగిన అనుభవము వృద్ధాప్యమున స్మృతికి వచ్చు చున్నదని చెప్పినచో ఆత్మ నిత్యమని వికారరహితమని యొప్పుకొనవలసి యున్నది ఇదియునుకాక, ఇంద్రియానుభ వము ఆత్మచైతన్యము లేనిచో నిష్ప్రయోజన మగును కావున చైతన్యము శరీరసంబంధమైనది కాదనియును, ఆత్మ సంబంధమైనదనియును అంగీకరించవలసి యున్నది మరి యును శరీరము దృశ్యము, ఆత్మ అదృశ్యము ఈ రెండింటికి తాదాత్మ్యము కలుగుటకు వీలు లేదు

ఈ పై వాదములను పురస్కరించుకొని చార్వాక వాదము అనగా దేహాత్మవాదము అనుపపన్న మగు చున్నది

2 ఇంద్రియాత్మవాదులని చార్వాకులలో నొక తెగ కలదు బాహ్య ప్రపంచమును గ్రహించుటకు, అనుభ వించుటకు ఇంద్రియములు ముఖ్యములనియును, ఇంద్రియము లేనిదే దేహయాత్ర గడవదనియు, కావున ఇంద్రియములే ఆత్మ యని వీరి వాదము కాని వాస్తవమున నింద్రియములు జడపదార్థములు గాన చైతన్యము లేక ప్రబోధము లేనిచో నింద్రియములకు వ్యర్థత సంభవించును కొన్ని ఇంద్రియములు క్షీణి చినను,నశించినను ఆత్మయొక్క చైతన్యమునకు న్యూనత లేకుండుట లోకానుభవమైయున్నదికదా! మరియును, గాఢ నిద్ర (సుషుప్తి) యందు ఇంద్రియములయొక్క కలాపము ఉపరమించగా నింద్రియములకు వ్యర్థత యేర్పడుచున్నది కావున ఇంద్రియములు ఆత్మచైతన్యమే యని చెప్పుట పొసగదు

3 మనస్సే ఆత్మ యని లోకాయతికులలో నొక తెగవారు కలరు సంకల్ప వికల్పాదులతో దేహయాత్ర జరుగుచున్నదని, కావున మనస్సే ఆత్మయని వీరి వాదము కాని అనుభవములో మనస్సుకు నిశ్చలత లేకపోగా సంకల్పించుట, తిరిగి సందేహించుట పొరపాటు చెందుట, సమయమునకు సరియైన భావము జ్ఞప్తికి రాకుండుట - యిట్టి దోషములతో కూడిన మనస్సు ఆత్మయగుట చెల్లనేరదు

4 బౌద్ధమతములో యోగాచార్యులని లేక విజ్ఞాన వాదులని ఒక తెగ కలదు సమస్తము విజ్ఞానముచే నుత్పన్న మగుచున్నదని వీరి వాదము చిత్తమే 'ఆలయ విజ్ఞాన మని వీరందురు సమాధిలో సమస్తమైన జగత్తు చిత్తములో లీనమగుననియును సమాధి వదలిన దశలో చిత్తము జగత్తును బయటకి వదలుచున్నదనియును వీరు వాదించెదరు ఈ విజ్ఞానముతప్ప మిగిలిన దంతయు అసత్యమని చెప్పెదురు ఈ విజ్ఞానము కూడా క్షణ క్షణమునకు మారుచుండుటచే బుద్ధియందు చలన మేర్పడుచున్నది ఈ చలనమే ఆత్మ యని వీరి వాదము విజ్ఞానవాదులు రెండు విధములైన జ్ఞానము కలదని యందురు ఒకటి గ్రహణమని, రెండు అధ్యవసాయమని వీరి వాదము గ్రహణము వలన పరోక్ష జ్ఞానము వచ్చుననియును అధ్యవసాయము వలన అపరోక్ష జ్ఞానము ప్రాప్తించుననియు వీరు చెప్పెదురు విజ్ఞాన వాదులు కేవలము వాగ్రూపమైన సిద్ధాంతులేగాని, అనుభవాత్మకమైన మార్గము వీరియందు లేదు. వీరి ఆలయవిజ్ఞానమును శంకరాదులు తీవ్రముగా ఖండించిరి జగత్తునకు శూన్యత నాపాదించి జగదంతఃపాతియైన

జీవునియొక్క విజ్ఞానమునకు సత్యత్వమును నాపాదింపఁ జేయుట హాస్యాస్పదము అదియునుగాక, లోకానుభవము ననుసరించి యేది శాశ్వతమో యది సుఖప్రదముకదా! కాని క్షణికమై దుఃఖదాయకముకదా! కావున విజ్ఞాన వాదుల క్షణికాత్మవాదము దుఃఖభూయిష్ఠమగును

5 బౌద్ధులలో నొక తెగవారైన మాధ్యమికులు ఆత్మశూన్యమని వాదించెదరు వీరిలో నాగార్జునుఁడు శూన్యతకు "ప్రత్యేక సముత్పాద మని ఒక పేరును కల్పించినాడు ఈ వాదము ప్రకారము సర్వము శూన్యము నుండి యుద్భవించుచున్నదనియు, గాఢనిద్రలో ఏమియును గోచరించుట లేదనియు మరణానంతర మేదియును గోచ రించుట లేదనియు కావున సర్వము శూన్యమని వీరి వాదము వీరి వాదములో నిర్వాణము అసంభవమనియు, నిజముగా నున్నది మాయ మాత్రమే ననియు మాయ యన్న అనృతము కాన అనృతముద్వారా ఋతమును (సత్య మును) గ్రహించుటకు వీలు లేదనియు, కావున నిహపరములు రెండును శూన్యములనియు వీరు చెప్పుదురు నాగార్జునుఁడు సమస్త సృష్టిని ఖండించి కేవల యుక్తులచే నితర బౌద్ధ వాదములను కూడ చెదరగొట్టినాడు బంధము మోక్షము అనునవి రెండు కూడా మిథ్యావస్తువులని, కల్పితములని, నిర్వాణము కూడా సత్యముకాదని మాయా మాత్రమే యని యితని సిద్ధాంతము శంకరులవారు ఈ వాదమునకు "వైనాశికవాద మని పేరు పెట్టిరి ఈ వాదము సర్వ ప్రమాణములకు విరుద్ధముగా నున్నదని ఖండించినారు

శూన్యవాదులను మాధ్యమికులని యందురు అనగా సత్యపదార్థము సత్యము కాదనియు, అసత్యము కాదనియు చెప్పుచూ మాధ్యమిక పద్ధతిని వీరు చెప్పుటచే వీరిని మాధ్యమికు లందురు శంకరవాదము ప్రకారము శూన్యమునుండి జగత్తుగాని, జీవులుగాని పుట్టుటకు వీలు కాద"యు, అనుభవ విరుద్ధమనియు ఋజువు చేసినారు

6 వైశేషికులను నైయ్యాయికులు ఆత్మను భోక్తగా వర్ణించెదరు

వీరు సమస్త జగత్తును ఏడు భాగములుగా విభజించిరి (1) ద్రవ్యము (2) గుణము (3) కర్మ (4) సామాన్యము (5) విశేషము (6) సమవాయము (7) అభావము వీరి మతమున "అభావము కూడా నొక ముఖ్యమైన భాగమై యున్నది ద్రవ్యమనగా తొమ్మిది పదార్థములు గలవు అవేవన పృథ్వి జల, తేజః, వాయు, ఆకాశ కాల, దిక్కు, ఆత్మ, మనస్సులు ఈ తొమ్మిది పదార్థములు భిన్నభిన్నమైన గుణములు గలవి వీరి మతానుసారము ఆత్మకూడా ద్రవ్యమే ఈ ద్రవ్యమునకు చైతన్య మనెడు గుణము గలదు ఇది (ఆత్మ) మనస్సునకు గోచరమగును కావున శరీరములలో భిన్నభిన్నములైన, అసంఖ్యాకములైన ఆత్మలు గలవు మనుష్యులలో నుండు జీవుడే ఆత్మ జగత్తులో నుండు ఆత్మయే పరమ త్మ

భిన్నభిన్న శరీరములలో భిన్నములై, విశేషములైన నాత్మలుండుటచే, వీరి సిద్ధాంతమునకు 'వైశేషిక'మని పేరు వచ్చినది వీరి వాదమునందు అణువులు (Atoms) నిత్యములు ఈ యణువులకు భిన్నభిన్నమైన పరిమాణములు

గలవు ఈ యణువులు కలిసినపుడు జగత్తేర్పడుచున్నది. ఈ యణువులు విచ్ఛిన్నమైనప్పుడు ప్రళయము ప్రాప్తించు చున్నదని వీరి వాదము వీరి వాదములో జగత్తుకు కర్తయైన సమష్టి ఆత్మ భోక్తయని, జగత్తు ననుభవించువాఁడనియుఁ జెప్పుచు ఆత్మకు భోక్తృత్వ కర్తృత్వముల నాపాదించెదరు వీరి వాదములోని ముఖ్యదోష మేమన ఆత్మకు ద్రవ్యత్వము కల్పించుటయే ఆత్మ ద్రవ్యమే యయినచో దానియొక్క గుణములు క్షీణ వృద్ధులను పొందుట కవకాశ మున్నది భోక్తృత్వ కర్తృత్వములు కలవాఁడగుటచే ప్రారబ్ధ సంచితకర్మ లాత్మకు ప్రాప్తించి జీవులవలె ఆత్మ కూడా సంసారి కాఁగలదు ఇట్టివాదము వేదవాక్యములకు సాక్షాత్ విరుద్ధమై యున్నది

7 కపిలసాంఖ్యమని ప్రసిద్ధిచెందిన పురుష ప్రకృతి ద్వైతవాద మొకటి కలదు ప్రకృతిని "ప్రధాన మనియును, ఆత్మను పురుషుఁడనియు వీరందురు జగత్తు ఉత్పన్న మగుచున్నదనియు, నీ రెండును (పురుషుఁడు, ప్రకృతి) నిత్యములనియు, వీరిరువురును స్వతంత్రులు కారనియు పరస్పర సహాయముచే జగత్తును సృష్టించుచున్నా రనియు వీరి ముఖ్య సిద్ధాంతములు వీరి మతము ప్రకారము పురుషుఁడని చెప్పు ఆత్మ, ప్రధానమని చెప్పెడు ప్రకృతిని నిత్యమును భోగించుచున్నాడని చెప్పుదురు వీరి మతములో ఈశ్వర ప్రసక్తి లేనే లేదు ఆత్మలకు భిన్నత్వమును, భోక్తృత్వమును చెప్పుటచే, పుణ్య పాపములను సంసారివలె ఆత్మ యనుభవించుట పొడగట్టుచున్నది ఈ వాదమును ఖండించుట యందు వ్యాసాచార్యులవారు చాలా పరిశ్రమ చేసిరి

8 సాంఖ్యులలో సిద్ధాంతము లన్నియు నొప్పుకొనుచు, ఈశ్వరుఁడను నొక పురుషవిశేషుని పతంజలి మహర్షి చూపినాడు ఇచ్చట నీశ్వరుఁడు సర్వజ్ఞుఁడని, సర్వశక్తి మంతుఁడని, అతఁడే యాత్మయని చెప్పుటచే నీ వాదమునకు "సేశ్వరసాంఖ్య మని పేరు వచ్చినది ఈ వాదము వేదాంత వాక్యములకు విరుద్ధముగా నున్నది ఈశ్వరుఁడు కూడ జీవుఁడని చెప్పుటచే నానాత్వము భాసించుటయే గాక, ఈశ్వరునకు పక్షపాతిత్వమును అనగా సృష్టిలో కొందరిని సకలులుగాను, కొందరిని వికలులుగాను సృష్టించుట యను మహాదోష మాపాదించుచున్నది

9 అద్వైత వాదము కర్తయు, భోక్తయు నగు జీవునకు (చిదాభాసునకు) ముఖ్యబింబమగు ఆత్మయే సత్య జ్ఞాన, ఆనంద లక్షణములు కలిగియున్నదని చెప్పుదురు అవిద్యోపాధియగు భోక్తయొక్క ఆత్మ, యనగా అవి క్రియాత్మక వ్యక్తియే యా పరమాత్మ - అనగా బ్రహ్మమని వేదాంతభావము ఈ పై విధముగా బహువిధముగా విప్రతిపత్తులకు గుఱియై బ్రహ్మశబ్దము చెప్పబడినది ఈ విప్రతిపన్నములు యుక్త్యాభాసములుగను, వాక్యాభాస ములుగను మిక్కిలి పట్టుదలతో నాశ్రయించుటచే పలువురు పలువిధములుగా నొకే బ్రహ్మమందు విరుద్ధార్థమును గ్రహించిరి కావున బ్రహ్మ ప్రసిద్ధమైనను ఈ యాభాస వాక్యములను, నీ ఆభాసవృత్తులను పరిష్కరించుటకై బ్రహ్మజిజ్ఞాస అత్యవసర మగుచున్నది ఈ యథార్థము గ్రహింపజాలక అభినివేశముతో బ్రహ్మ శబ్దమును గ్రహించినచో విపరీతమును గ్రహించుటయేగాక, అనర్థము

నకు కూడ శ్రోవదీయును ఈ మీమాంస వలన నిశ్శ్రేయసమే ప్రయోజనము మరియును శ్రుతి కనుకూలమైన తర్కసహాయముచేత, వేదాంతవాక్యములను విచారింపవలసి యున్నదని యీ జిజ్ఞాసాధికరణము ప్రారంభింపఁబడుచున్నది

1 జన్మాద్యధికరణము

96-వ పుట 23-వ పేరా బ్రహ్మమును గురించిన జిజ్ఞాస ఆవశ్యకమని పూర్వసూత్రములో జెప్పుటచే నిప్పుడు బ్రహ్మము యొక్క లక్షణము, ప్రమాణము, యుక్తి, సాధనము, ప్రయోజనము యను సర్వమును తెలిసికొనవలసిన యావశ్యకత సువ్యక్తమగుచున్నది కావున జన్మాద్యధికరణము ప్రారంభింపఁబడుచున్నది

2 సూత్రము జన్మాద్యస్యయతః

"అస్య" = ఈకనపడు ప్రపంచమునకు జన్మాదులు (అనగా జన్మ ఉనికి, వృద్ధి పరిణామము, అపక్షయము, నాశనము) ఎవనివలన నుద్భవించుచున్నవో యది యే బ్రహ్మమని, యీ సూత్రము యొక్క వాచ్యార్థము దీనికి పంచావయవము లేవన, విషయవాక్యము - "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ ప్రయంత్యభిసంవిశంతి తద్ బ్రహ్మ" (తైత్తిరీయ) దేనివలన నీ భూతములు (చరాచరములు) పుట్టుచున్నవో, పుట్టినవి యెవనిచేత జీవించుచున్నవో, ఏవి యెవనియందు లయించుచున్నవో అది బ్రహ్మయని వాక్యార్థము 2 సంశయము అద్వైత సిద్ధాంతము ననుసరించి బ్రహ్మకన్న

మఱొకటి లేమిచే శ్రుతివాక్యమందుఁజెప్పబడిన లక్షణము (జగజ్జన్మాది లక్షణము) కలదా, లేదా? 3 పూర్వ పక్షము - బ్రహ్మకు అద్వితీయ సిద్ధాంత ప్రకారము లక్షణ ముండుటకు వీలులేదు లక్షణ మెప్పుడునూ లక్ష్యముకన్న అభిన్నముగా నుండవలెను భూమికి గంధము లక్షణము, అగ్నికి ఉష్ణత జలమునకు శీతలత, యిటుల ద్రవ్యములకే లక్షణ ముండవలెగాని, ద్రవ్యము కానట్టి అద్వితీయ మగునట్టి (పురుష ప్రకృతి) భేదములేనట్టి బ్రహ్మకు లక్షణము సాధించుట యుక్తము కాదు విషయ వాక్య మందున్న జగజ్జన్మాది లక్షణము జగత్తును గురించి చెప్పినది గాని, బ్రహ్మను గురించి చెప్పినది కాదు. అదియునుగాక, బ్రహ్మకు ప్రసిద్ధత యుండుటచేతను, లక్షణ రహితుఁడగుట చేతను బ్రహ్మ విచారణీయము కాదు 4 సిద్ధాంతము-లక్షణములు రెండు విధములుగా నున్నవి ఒకటి - స్వరూప లక్షణము, రెండు - తటస్థ లక్షణము బ్రహ్మకు పారమార్థిక ముగా అద్వితీయత్వ మున్నది సత్యము జ్ఞానము, అనంతము బ్రహ్మకు స్వరూప లక్షణ మగుచున్నది ఇక, వ్యవహార సత్త ననుసరించి బ్రహ్మకు (ఈశ్వరునకు) జగజ్జన్మాది కారణత్వ లక్షణము శ్రుతిచేఁజెప్పఁబడుచున్నది ఈ జగత్తుకు నుపాదాన కారణత్వమును, నిమిత్త కారణత్వమును బ్రహ్మకు తటస్థ లక్షణమై యున్నది కావున బ్రహ్మ విచారణీయమై యున్నది 5 సంగతి - మొదటి (అథాతో బ్రహ్మ జిజ్ఞాసా) సూత్రములో బ్రహ్మ విచారణయే చెప్పఁ బడి యుండగా అద్వితీయ బ్రహ్మకు లక్షణ మెట్లుండు

నని ఆక్షేపమే, యీ యధికరణమునకు సంగతియై యున్నది

పుట 100, 24-వ పేరా - జన్మాది శబ్ద విచారః- ఇది తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి సమాసము శ్రూయమాణమగు విశేషణ మనబడు విశేష్యమున కంగముగా గావించి క్రియాన్వయము చేయునపుడు తద్గుణ విజ్ఞాన బహువ్రీహి యందురు ఉదా - 'లంబకర్ణమానయ (పొడుగాటి చెవ్వు వానిని పట్టుకు రమ్ము) అని చెప్పనచో అట్టి గుణములు, లేక చిహ్నములు గలిగిన వానిని తీసికొని వచ్చెదరు 'తద్గుణాః సంవిజ్ఞాయంతే అత్ర ఇతి తద్గుణ సంవిజ్ఞానః, సచ అసౌ బహువ్రీహిః ఇది విగ్రహము ప్రస్తుతమున తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహిని గ్రహించుటయందు కలుగు ప్రయోజనము జన్మస్థితి భంగము సమాసార్థమని వివరింప బడుచున్నది ఈ లోకములో పుట్టుట ఉండుట లయించుట యనునది సర్వవస్తువులకు ప్రాప్తించుటచే ఆ వస్తువు వస్తుధర్మముల దృష్టిలోఁబెట్టుకొని శ్రుతికూడ జన్మ, స్థితి లయములనే క్రమముగా నిర్దేశించినది విషయవాక్యములో ఆ క్రమము గన్పడుటచేత లోకయుక్తిని శ్రుతి యుటంకించు చున్నది.

పుట 100, పేరా 25 - ''అస్య' శబ్ద విచారః- అస్య యనునది ఇదం శబ్దము యొక్క షష్ఠీ యేకవచనమై యున్నది అనగా దీనియొక్క యని యర్థము దీనియొక్క యనుటచే మనకు ప్రత్యక్షముగాఁ గనబడు ప్రపంచము యొక్క యని యర్థము ఇచ్చట షష్ఠీ విభక్తికి సంబంధా

ర్థము చెప్పవలెను అనగా ప్రపంచ (చరాచర) సంబంధమైన అని యర్థము

పుట 100 పేరా 26 - "యతః - శబ్ద విచారః - యత్ అనుశబ్దము తసిల్ ప్రత్యయముతో గూడి యత శబ్దమై అవ్యయ మగుచున్నది యతః అనగా దేనివలన లేక ఏ హేతువువలన ననెడు కారణమును నిర్దేశించుచున్నది ఈ జగత్తు నామరూపములచే వికారింపఁబడినది అస్తి ప్రియం, భాతి యనెడి బ్రహ్మ లక్షణములున్నా నామము రూపములను జోడు సేయగా జగత్ అనెడు వికారము ప్రాప్తించుచున్నది ఈ జగత్తు బ్రహ్మాది పిపీలికా పర్యంత భోక్తలై దేశ, కాల, నిమిత్త క్రియా ఫలములను కలిగిన కర్మలతో గూడి యున్నది ఇట్టి జగత్తు బుద్ధిచే నూహించుటకు నసంభవమైన రచన కలది దీనికి పుట్టుక, యునికి, నాశము లెవనినుండి (ఎవనివలనఁ) ప్రాప్తించుచున్నవో యట్టి సర్వజ్ఞుఁడును సర్వశక్తిమంతుఁడును (ఉభయ కారణాత్ముఁడును) అయిన బ్రహ్మమే హేతువై యుండవలెనని వాక్యపూరణము చేయుచు నీ సూత్రమున కర్థము జెప్పవలెను ఇచ్చట నొక చిన్న పూర్వపక్షము ప్రాప్తించఁగలదు యాస్కాచార్యులవారి నిరుక్తశాస్త్రము ననుసరించి ఆరు వికారము లుండగా జన్మ, స్థితి భంగము లని మూడు వికారములే చెప్పుట యుక్తము కాదని చెప్పవచ్చును కాని, యీ మూడు వికారములు ఉపలక్షణములని షడ్వికారములను గ్రహించుటలో వాక్య విరోధముండదు యాస్కాచార్యులవారి షడ్వికారములేవనగా పుట్టుట,

ఉండుట, వృద్ధిబొందుట, పరిణమించుట, క్షీణించుట, నశించుట యను షడ్వికారములు పూర్వమీమాంసకులచే గ్రహింపఁబడినవి. అదియునుగాక, యీ యారు వికారములు జగదంతఃపాతి యయిన చరాచరమునకు వర్తించునుగాని, జగత్తుకు వర్తింపకపోవచ్చునని పూర్వపక్షి శంకింపగా పూజ్యపాదులవారు అట్టి శంకను నివర్తించి జగత్ మూల కారణము యొక్క విచారణ నిందు గ్రహింపవలెనుగాని, జగత్తులోనున్న వస్తుజాతమునకు జీవజాతమునకు కాదని చెప్పయున్నారు అనగా జగత్తు ( బ్రహ్మాండ భాండములు ) యొక్క జన్మ స్థితి, లయములకు నేది మూలకారణమో యది బ్రహ్మయని గ్రహింపవలెనని యాశయము

పుట 104, పేరా 26 ( ఇ ) – పూర్వము వర్ణింపబడిన జగత్తునకు ఈశ్వర చైతన్యము లేకుండా జగత్తు సృష్టి యగుచున్నదని చెప్పెడి వాదములను పూజ్యపాదులవారు ప్రత్యేకముగా నిందు ఖండించిరి కపిల సాంఖ్యులు ప్రకృతి యొక్క ( ప్రధానముయొక్క ) పరిణామమునే జగత్తని యనెదరు బీజము చెట్టుగా పరిణమించినట్లు, ప్రకృతియే జగత్తుగా పరిణమించినదని చెప్పుదురు వీరు కార్యకారణ వాదులు ప్రకృతి కారణమనియు, జగత్ కార్యమనియు, ప్రకృతి జడమనియు గుణత్రయము కలిగినదనియు, సమస్తమునకును మాతృకయనియు వీరు ఉద్ఘాటించెదరు ఈ వాదమును ' పరిణామవాద " మందురు ఈ వాదములో చైతన్య ప్రసక్తి లేనందువలన ప్రకృతి జగత్కారణము కాజాలదని పూజ్యపాదులవారు ఖండించిరి

వైశేషికులు అణువుల నుండి జగత్తు ఏర్పడుచున్నదనియు, అణువులు నిత్యమనియు చెప్పెదరు అణువుల యొక్క సమ్మేళనమే సృష్టియనియు, అణువియోగమే ప్రళయమనియు వీరి వాదము వీరి వాదములో ఏడు పదార్థములు (ద్రవ్య గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ, అభావములు) కలవనియును, 'పంచభూతములు, కాలము దేశము ఆత్మ మనస్సు అను తొమ్మిది ద్రవ్యములును రూప రస గంధ స్పర్శ, శబ్ద, సంఖ్య, పరిమాణ, పృథక్త్వ సంయోగ విభాగ, పరత్వ అపరత్వ, సుఖ, దుఃఖ ఇచ్ఛ ద్వేష, ప్రయత్న గురుత్వ ద్రవ్యత్వ, స్నేహ సంస్కార ధర్మ అధర్మ' యనెడి వస్తు జీవధర్మములును కలిగి ప్రపంచమగుచున్నదని వీరు వాదించెదరు ప్రతిద్రవ్యమునకును 'సమవాయ'మనెడి ధర్మము శాశ్వతముగా నుండునని వీరి వాదము జగత్తునకు 'సంసర్గాభావము అన్యోన్యాభావము అనునవి కలవని చెప్పుదురు అణువులు నిత్యములు శాశ్వతములని చెప్పుటచే భగవంతుని ప్రసక్తి వీరికి లేదు మరియును, ఆత్మ ద్రవ్యమని, చైతన్యము దాని గుణమని చెప్పుటచే ఆత్మకు వస్తుత్వాత్వము ప్రాప్తించుట వలన, వీరి సిద్ధాంతము అనాత్మవాదమగునని చెప్పనగును కావున ఈశ్వరచైతన్య రహితమైన అణువుల నుండి జగదుద్భవించుట సమంజసము కాదు బౌద్ధవాదమైన శూన్యమునుండి జగదుద్భవించుట లోక యుక్తులకే విరోధము పూర్వమీమాంసకులు హిరణ్యగర్భుని నుండి జగదుద్భవమైనదని చెప్పుట సందర్భ సహితముగా నుండదు ఏలయన, హిరణ్యగర్భునకు కూడా మూల

కారణమైన శుద్ధబ్రహ్మము మాతృకమై యుండగా, హిరణ్యగర్భుఁడు జగత్తును సృష్టించుచున్నాడని చెప్పుట యుక్తముకాదు

కేవలము స్వభావము వలననే జగత్తు ఉత్పన్నమగుచున్నదని చెప్పుట సమంజసము గాదు ఏలయన, జగత్తులో చరాచరములకు దేశము, కాలము నిమిత్తము ఉపాదానములై యుండగా నట్టి యుపాదానములను వదలి కేవలము స్వభావము నుండి (ప్రకృతినుండి) జగత్తు ఉద్భవించుట యుక్తిరహితము, లోకవిరుద్ధము కూడ నయ్యాయికులు కేవలము యుక్తి నపేక్షించి హేతువాదమును, కార్య కారణ వాదములను బురస్కరించుకొని యీశ్వరునికి సృష్టి కర్తృత్వమును చెప్ప బూనదురు కాని, శ్రుతి వాక్య మందు విశ్వాసమును వదలి బుద్ధి కల్పితముగాఁ జెప్పెడి వాదములకు నెట్టి ప్రామాణికత యుండఁజాలదని పూజ్య పాదులవారు అన్ని మతములను ఖండించి యీశ్వరుఁడే ఉభయకారకుఁడని చెప్పుచున్నారు ఉభయకారణ మనగా ఉపాదాన కారణము, నిమిత్తకారణము మట్టి ఉపాదాన కారణము, కుమ్మరి నిమిత్త కారణము ఇది వ్యవహార దశలో భిన్నభిన్నముగా నుండును కాని, పారమార్థిక దశలో ఈశ్వరుడే ఉభయ కారణము దీనికి ఊర్ణనాభి దృష్టాంతమును ఉపనిషత్తు చెప్పుచున్నది ఊర్ణనాభి యనగా సాలెపురుగు దీని చొంగతో గూటి నల్లుకొని, మరల నా గూటిని తినుచుండును అటులనే స్వప్నమందు కూడా జీవుడు తనవృత్తులను బురస్కరించుకొని తనే కర్తగా, భోక్తగా స్వప్నము ననుభవించుచున్నాడు,

ఇట్టి లోకదృష్టాంతములను "సదేవసౌమ్యేద మగ్రఆసీత్" (ఓ సౌమ్యుడా! సృష్టికి పూర్వమందు సత్ పదార్థ మొక్కటియే కలదు) అనెడి శ్రుతివాక్యము ననుసరించి జగదుభయకారణాత్మకమే బ్రహ్మమని అద్వైత సిద్ధాంతము

పుట 104 మొదటి సూత్రములో నీ విషయ మంతయు విచారింపబడగా, తిరిగి జన్మాది సూత్రములను చెప్ప నేల యనెడు పూర్వపక్షమును 106-వ పేజీలో పూజ్య పాదులవారు ఖండించినారు సూత్రము లన్నియును వేదాంత వాక్యములనెడి పూలను గ్రుచ్చుటకేయని, పూజ్యపాదుల వారు చెప్పుచూ వేదాంతవాక్య విచారణము వలన బ్రహ్మ సాక్షాత్కారమగునని ప్రతిజ్ఞ చేసియున్నారు అనుమాన, ప్రత్యక్ష, ఉపమాన మున్నగు ప్రమాణములచేత బ్రహ్మ సాక్షాత్కారము కలుగునని కూడా చెప్పియున్నారు కావున శబ్దప్రమాణమే బ్రహ్మజ్ఞానమునకు ముఖ్యమని యుద్ఘాటించుచూ వేదాంతవాక్యములను, తదర్థమును దృఢముగా మననము చేయుటకై విచారించుటకై అను మాన ప్రమాణము కూడా సందర్భసహితముగా, వాదసహిత ముగా నుపయోగించుట శ్రుతికి కూడా సమ్మతమని పూజ్య పాదులవారు సెలవిచ్చి యున్నారు మందాధికారులకును, మధ్యమాధికారులకును యుక్తియుక్తముగా వేదాంత వాక్య క్రమము విహితమగుచున్నది ఎటుల గాంధార దేశస్థుడు అడవిలో దొంగలచేత హింసింపబడి దిక్కులేనివాడై యుండగా అతడు స్వబుద్ధినాశ్రయించి పండితులను, బుద్ధిమంతులను విచారించుచు, నిజమైన త్రోవలను తెలుసు

కొని స్వగృహము చేరుచున్నాడో, అటులనే జిజ్ఞాసువు తన నిజస్వరూపమును బుద్ధిమంతుల వలనను, శ్రమము వలనను, వేదాంతవాక్యముల వలనను, తదవిరుద్ధ తర్కముల వలనను సాక్షాత్కరించుకొనవచ్చును

పుట 108, పేరా 27 - ధర్మజిజ్ఞాసయందు (పూర్వమీమాంసయందు) యజ్ఞ యాగాది అనుష్ఠానములయందు శ్రుతివాక్యమే ప్రమాణము అచ్చట యుక్తులు గాని, అనుభవములు గాని, హేతువాదములు గాని వాడుటకు వీలులేదు కనుక కేవల వేదవాక్యమే ప్రమాణమైన పూర్వమీమాంసకు తర్కాదులతోఁ బనియుండదు కాని, బ్రహ్మజిజ్ఞాసయందు వేదాంత వాక్యములును, యథా సంభవమైన అనుభవములును అవసర సమయములందు వాడుచుండవలయును ఏమనగా, బ్రహ్మజ్ఞానము సిద్ధమైన వస్తువిషయకమగుటచే దాని యనుభవమే బ్రహ్మజిజ్ఞాసకు పరమావధి యగుచున్నది కదా! కావున అనుభవము కూడా బ్రహ్మ జిజ్ఞాసయందు ఒక ముఖ్యసాధనమైయున్నది మరియును, ధర్మజిజ్ఞాస (కర్మకాండ)యందు చోదనము (విధి - ప్రేరణము - నీవు యిది చేయవలెను) ముఖ్యమగుటచే ననుభవాపేక్ష యుండజాలదు ఉదా 'స్వర్గ కామోయజేత' స్వర్గమును కోరువాడు యజ్ఞమును చేయవలెను ఇచ్చట యజ్ఞము చేయుట కర్తవ్యము స్వర్గమనునది అదృష్టఫలమగుటచే, మరణానంతరమున ప్రాప్తించునట్టిదగుటచే జీవించియుండగా ననుభవమున కసంభవమగును కావున ధర్మజిజ్ఞాసకు శ్రుతియే ప్రమాణమగును

పేజీ 108, పేరా 27 (ఇ) - కర్మకాండయంతయు (యజ్ఞ యాగాది) యజమానిపై నాధారపడియుండును అట్టి కర్త లౌకిక వైదికధర్మములను స్వంతముగా చేయుటగాని చేయకుండుటగాని లేక మరియొక విధముగా చేయించుటకు గాని యోగ్యుఁడగును ఉదా ఒకఁడొక గ్రామమును చేరుటకు గుఱ్ఱముమీఁదగాని, తన కాళ్ళతోఁగాని, బండిమీఁద గాని ప్రయాణముచేసి చేరవచ్చును లేక ప్రయాణమే మానుకొనవచ్చును కావున కర్మకాండ యంతయు పురుషాధీనమై యున్నది అందుచేతనే యాగాదులలో స్వంతముగా చేయుట చేయించుట, లేక ప్రాయశ్చిత్తము లను నిర్వర్తించుట మున్నగు విధానములు పురుషాధీనములై యున్నవి

పుట 110 - ఈ పురుషాధీన సిద్ధాంతము శ్రుతులనుండి కర్మకాండనుండి ఉదాహరింపబడుచున్నది - అతిరాత్రము అనెడి క్రతువునందు సోమపాత్రను (షోడశిని) గ్రహింప వచ్చును, లేక గ్రహింపకపోవచ్చును మరియొకచోట, సూర్యోదయానంతరము హోమము చేయవచ్చును, లేక తత్పూర్వము చేయవచ్చును ఇటుల వైకల్పికవిధులు గలవు

మరియును హింసచేయరాదు అని సామాన్యవిధిని ఉత్సర్గవిధి యందురు అగ్నిష్టోమములందు, పశువును హింసింపవలెను అనునది అపవాదవిధి అశ్వమేధ యాగమందు పాదపాదమందు హోమముచేయవలెను ఇది క్రమవిధి ఇటుల కర్మకాండయందు వైకల్పిక విధులు, ఉత్సర్గ విధులు, అపవాద విధులు, క్రమ విధులు, నిషేధ విధులు కలవు

ఇట్టి విధులు, బ్రహ్మజిజ్ఞాసయందు కుదురుటకు వీలు లేదు బ్రహ్మవస్తువు నిత్యసిద్ధమైన దగుటచే వికల్పములకు గాని హేయోపాదేయములకుగాని నెట్టి తావు లేదు వికల్పాదులు పురుషాధీనములై కర్తయొక్క బుద్ధి నపేక్షించి యుండును బ్రహ్మజిజ్ఞాస కేవలము శ్రవణముపై తన్నిశ్చిత ధ్యానముపై ఆధారపడియుండును మరియును, బ్రహ్మవస్తువుయొక్క యాథాత్మ్యము పురుష బుద్ధి నపేక్షించి యుండదు ఏలన, బ్రహ్మము వస్తు తంత్రముగాని పురుషతంత్రము గాదుగదా! విష్ణు రుద్ర శక్త్యాదులు మంత్రయంత్రాది కల్పిత రూపములతో పురుష బుద్ధి నాశ్రయించి యుండుటచే కల్పిత రూపములగుట వలన కర్మోపాసనలు పురుషతంత్రమై యున్నవి బ్రహ్మవస్తు వెటుల యుండునో యటులనే గోచరమగునుగాని, పురుషుల బుద్ధినిఁబట్టి కల్పించుటకుగాని, చెందుటకుగాని వీలుపడదు స్థాణు పురుష భ్రాంతిలో (చీకటిపడు సమయమున నొక రాతిగుండును చూచి యిది పురుషుఁడా, లేక రాతిగుండా యనెడి సందేహము ) పురుషతంత్రముగాని వస్తుతంత్రము గాదు ఇది రాతిగుండని చెప్పుట సర్వులకు అనుభవమే గానినే వస్తుతంత్ర మందురు దానికి భిన్నముగా సందేహించుట లేక కల్పించుట పురుషతంత్రంబగును స్ఫురితవస్తువైన రాతిగుండును ఆలస్యముగా పోల్చుకొని బ్రహ్మవస్తువు కూడా వస్తుతంత్రమని, లేక ( భూతవస్తువని, సిద్ధమైన వస్తువని ) నిశ్చయించుట బ్రహ్మజిజ్ఞాస ఫలమై యున్నది.

పుట 112 పేరా 27 (ఋా) - "బ్రహ్మ పదార్థము భూతవస్తువని నిర్ణయించినచో దానిని ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియుట యుక్తము కాని, వేదాంతవాక్య విచారణవలన (శబ్దప్రమాణము వలన) తెలియుటకు అనవసరమగుచున్న దని పూర్వపక్షి ప్రశ్నించుచున్నాడు ఇందులకు సమాధానము — బ్రహ్మపదార్థము ప్రత్యక్ష ప్రమాణముచేత నిశ్చయింపఁదగినది కాదు జీవుల కింద్రియము లన్నియు బహిర్ముఖములగునట్లుగా చతుర్ముఖబ్రహ్మ శరీరమును సృష్టించియున్నారు కావున ఇంద్రియములు (కన్ను ముక్కు చెవి మొదలగునవి) బాహ్యపదార్థములైన శబ్ద స్పర్శ రసాదులను గ్రహింపఁగలవుగాని అంతః పదార్థమైన ఆత్మను కనజాలకున్నవి కావున బ్రహ్మ అతీంద్రియ (ఇంద్రియాతీత) మగుటచే ఇంద్రియములకు గోచరము కాదు కాన ప్రత్యక్ష ప్రమాణము బ్రహ్మయందు సంభవమగును బ్రహ్మను ఇంద్రియములు గ్రహింపగలిగినచో (బ్రహ్మ యిట్టిది) నిశ్చయించుటకు వీలుండెడిని కాని జగత్ లోని పదార్థములకు బ్రహ్మతో సంబంధమున్నదా లేదా యని నిశ్చయించుట శక్యమగుట లేదుగదా! బ్రహ్మకు, జగత్తుకు నేలాటి సంబంధము కలదో యని మనము మా బుద్ధిచేత నిర్ణయింపజాలకున్నాము కావున 'జన్మాద్యస్యయతః' అను సూత్రము బ్రహ్మను గురించి అనుమాన ప్రమాణమును, చెప్పుటకు బయలుదేర లేదు ఆ సూత్రము వేదాంతవాక్యమును ప్రదర్శించుటకే చెప్పబడినది.

పైన తెల్పిన సూత్ర ప్రదర్శిత వేదాంతవాక్యము లేవన — తైత్తిరీయోపనిషత్తులో భృగువల్లిలో చెప్పిన సిద్ధాంత వాక్యమైన "యతో వా ఇమాని భూతాని జాయంతే" అనెడి వాక్యములతోఁ బ్రారంభించి, "ఆనందం ప్రయంత్యభి సంవిశంతీతి అనే వాక్యములను అనగా జగత్ సృష్టికారణ వాక్యములను బ్రహ్మ ఉభయ కారణమని చెప్పు వాక్యములను ప్రదర్శించుచున్నది అటులనే, బ్రహ్మ లక్షణములైన నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావ సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్వ ఉభయకారణ వాక్యములను ఈ సూత్రమున ఉదహరించవలెను

పుట 116 పేరా 29 - ఈ సూత్రమునకు రెండు విధములుగా సమన్వయించవలసినది ఒకటి, షష్ఠీతత్పురుష లక్షణపరార్థము రెండు, బహువ్రీహి ప్రమాణ పరార్థము మొదటిది బ్రహ్మయొక్క సర్వజ్ఞత్వలక్షణమును జెప్పునది రెండవది, బ్రహ్మజ్ఞానమును సంపాదించుటకు శాస్త్రమే (అనగా శబ్దప్రమాణమే) ఆధారమని చెప్పునది

## ప్రథమ వర్ణకము

### లక్షణ పరార్థము

(1) విషయవాక్యము "అస్య మహతో భూతస్య నిశ్వసితమేవ
ఏతత్ యద్ ఋగ్వేదో యజుర్వేదః
సామవేదోఽథర్వాంగిరసః
(బృహ 4-4-5)

దీని కర్థమేమన—ఈ గొప్ప భూతము (బ్రహ్మ) యొక్క నిశ్వాసమే (ఊపిరి బయటకు వదలుటయే) ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణ వేదము లగుచున్నవి అనగా బ్రహ్మయొక్క నిశ్వాసములే చతుర్వేదములు

2 సంశయము వేదమునకు కర్త బ్రహ్మమగునా, కాదా ?

3 పూర్వపక్షము వేదమునకు బ్రహ్మ కర్తకాదు కారణ మేమన వేదము నిత్యమని వేదములోనే వాక్యమున్నది 'వాచా విరూప నిత్యయా' అను మంత్రములో నిత్యమైన వాక్కు వేదమని చెప్పబడినది మఱియును 'అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా' అను వాక్యములో వేదవాక్కు ఆద్యంతములు లేనిదనియు, నిత్యమయినదనియు స్పష్టముగా నుండుటచే వేదములకు బ్రహ్మ కర్తయగుటకు వీలులేదు

4 సిద్ధాంతము వేదము బ్రహ్మయొక్క నిశ్వసితమని శ్రుతివాక్య ముండుటచే దానికి బ్రహ్మమే కర్త కావలయును అది నిత్యమయినదే మఱియు అది సమస్తమును భాసింపఁ జేయునది అట్టి వేదమునకు బ్రహ్మ కర్తయగుటచే బ్రహ్మ సర్వవిత్ అయియుండవలెను మఱియు వేదములో 'తస్మాత్ యజ్ఞాత్సర్వహుతః। ఋచస్సామాని జజ్ఞిరే ఈ పంక్తిలో యజ్ఞశబ్దవాచ్యుడు బ్రహ్మమే కావున బ్రహ్మనుండియే ఋగ్, యజుర్వేదాది వేదములు పుట్టుటచేత వేదములకు బ్రహ్మ కర్తయని సిద్ధాంతము మఱియు 'ధాతా యథాపూర్వ మకల్పయత్' (పూర్వ

విధముగా చతుర్ముఖుడు సృష్టిచేసెను) అనెడి వాక్యముచేత వేదము అనాది యనియును, అపౌరుషేయ మనియును స్పష్టమైనది కాని, వాస్తవ నిత్యత్వమును అంగీకరించినచో అద్వైతశ్రుతికి భంగము కలుగును ఈ సూత్రము వలన బ్రహ్మము సర్వవిత్ అని సిద్ధాంతము

5 సంగతి – పూర్వసూత్రమందు బ్రహ్మమునకు సృష్టి స్థితి లయములను తటస్థ లక్షణముగా చెప్పుటచే బ్రహ్మ సర్వశక్తిమంతుడని నిశ్చయమైనది కాని, సర్వజ్ఞత్వము లేనిచో అనగా మిక్కిలి తెలివి లేనిచో, శక్తిని సక్రమముగా వినియోగించుట కుదురదు గావున సర్వజ్ఞత్వము లేనిచో జగత్ సృష్టి స్థితి లయము లెటుల జరుగగలవు అనునట్టి యాక్షేప సంగతి ప్రాప్తించుచున్నది

పుట 118, పేరా 30 (అ) – ఋగ్వేదాది చతుర్వేదములును తిరిగి మంత్ర బ్రాహ్మణ, ఉపనిషత్తులును, చతుశ్శాస్త్రములును షడంగములును వేదములచే వృద్ధిచెందినవై మహాత్వమును పొందియున్నవి ఇట్టి రచనను ప్రకాశింప చేయుటకు కారణము సర్వజ్ఞుడయిన బ్రహ్మయే యయి యుండవలెను ఈ సూత్రములో శాస్త్ర'మనగా చతుర్వేదములే గాక షడంగములు, స్మృతులు, మీమాంసలు, ఇతిహాసములు ఇట్టి విద్యాసమూహమును గ్రహించవలయును

పుట 120, పేరా 30 (ఆ) – పూజ్యపాదులవారు ఈ సూత్రభావముల నొకయుక్తిచే బలపరచిరి లోకములో కావ్యముకన్న కావ్యకర్త యధికుడై యుండవలయును ఉదా॥ వ్యాకరణశాస్త్రముతో పాణిని సూత్రములు

చదివిన తదుపరి యా సూత్రముల గంభీరత, చతురత, సార్థకత మనకు గోచరించగా నట్టి రచనకు కర్తయైన పాణిని యొక్క గొప్పతనము గోచరించుచున్నది అనగా కావ్యమునుబట్టి కర్తయొక్క మహిమ వెల్లడియగుట లోకానుభవముగాన, యిట్టి గంభీరమైన వేదవేదాంగ శాస్త్రమునకు శాస్త్రకర్త సర్వజ్ఞుడైన బ్రహ్మమే కావలెను కాని మరియొకని నుండి కలుగుట యసంభవము

పుట 120, పేరా 30 (ఇ) - ఇటుల పైన తెలిపిన విధముగా వేదవేదాంగములను ప్రయత్నరహితముగా, నిశ్వాసముగా మహాభూతమగు బ్రహ్మనుండి బయల్వెడలిన దానిని బట్టి యట్టి మహాత్తుగల బ్రహ్మమునకు సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్వము, నిరతిశయము విషయవాక్యము వలననే గోచరించుచున్నది కావున వేదమునకు బ్రహ్మమే కర్త అట్టి బ్రహ్మము సర్వజ్ఞమై యుండుటచే జగత్తు రచనకు యుక్తమై యున్నదని తాత్పర్యము

## ద్వితీయవర్ణకము

పుట 122, పేరా 31 - 'శాస్త్రయోనిత్వాత్' అనెడి సూత్రమునకు బహువ్రీహిసమాసముతో సమన్వయించి ప్రమాణపరముగా జెప్పుటకు నీ ద్వితీయవర్ణకమేర్పడి యున్నది ఇందుభావ మేమన బ్రహ్మ యుపనిషత్ వలననే వేద్యమగునుగాని ప్రత్యక్ష అనుమానాదులవలన వేద్యము కాదు షడ్విధప్రమాణములలో శబ్దప్రమాణము వలననే బ్రహ్మసాక్షాత్కారము గలుగునుగాని అన్యప్రమాణములవలన బ్రహ్మావగతి సంభవము కాదని యీ సూత్రమున కర్థము

అనగా, జ్ఞానకాండ ననుసరించి శ్రవణ, మనన, నిధి ధ్యాసల వలన బ్రహ్మ గోచరమగును శ్రవణ మనగా, గురుముఖతః ఉపనిషత్తులను సంప్రదాయానుసారముగా భక్తిశ్రద్ధలతో శ్రవణముచేసిన శాస్త్రజనిత బ్రహ్మజ్ఞాన మలవడును అట్టి జ్ఞానముయొక్క దార్ఢ్యత, ఉపనిషదాది కమే బ్రహ్మావగతికి ప్రమాణమని సిద్ధాంతము

పుట 124, పేరా 31 (ఇ) - ఇచ్చట నొక పూర్వ పక్షము వచ్చుచున్నది పూర్వ సూత్రమునందే బ్రహ్మ జగత్కారణమని చెప్పుచు శాస్త్రయోనిత్వము బ్రహ్మకు చెప్పబడినది తిరిగి శాస్త్రయోనిత్వము బ్రహ్మకు చెప్పనేల అని సందేహము సూచించబడినది

పుట 124, పేరా 31 (ఈ) - జన్మాది సూత్రముచే అనుమాన ప్రమాణముచే (యుక్తిచే) జగత్కారణము చెప్పబడినట్లు భాసించుటచే శాస్త్రయోనిత్వమును గురించి విస్పష్టత లేని హేతువుచే నిట్టి సందేహము బయలుదేరు చున్నది కావున నట్టి సందేహమును నివర్తించుటకును, బ్రహ్మకు సర్వజ్ఞత్వమును స్పష్టీకరించుటకును శాస్త్రయోనిత్వ సూత్రము చెప్పబడినది

## సమన్వయాధికరణము

పుట 124, పేరా 32 - మొత్తము బ్రహ్మసూత్ర గ్రంథములో సమన్వయాధికరణము చాలా పెద్దదియు, సర్వసందేహనివృత్తిని కలుగచేయునదై యున్నది పూర్వ సూత్రమైన శాస్త్రయోనిత్వాత్ పై పూర్వమీమాంసకు లాక్షేపణ రూపముగా వేదాంతశాస్త్రమునకు న్యూనత చేయు నట్టి వాదములను నుటంకించిరి వేదాంత శాస్త్రమునకు

ప్రమాణత్వము లేదని భాట్టీయులు చెప్పెదరు బ్రహ్మను తెలియుటకు వేదమే ప్రమాణముగాని వేదాంతము (ఉపనిషత్తులు) ప్రమాణము కాదందురు

పూర్వమీమాంసకులలో జైమిని శిష్యుడైన కుమారిలభట్టు ఈ ఆక్షేపణ లేవదీసెను కుమారిలభట్టు యొక్క అనుయాయులు భాట్టీయులని చెప్పబడుదురు వీరి వాదమిది "వేదమంతయు, క్రియాపరమనియు క్రియాపరముగాని వేదభాగమంతయు నిష్ఫల మని వీరి వాదన జైమినీ సూత్రముల ననుసరించి "ఆమ్నాయస్య క్రియార్థత్వాత్ - ఆనర్థక్యమ్ అతదర్థానాం" (జై సూ 1-2-1) ఉదా – 'స్వర్గకామోయజేత' (స్వర్గము కోరువాడు జ్యోతిష్టోమయజ్ఞము చేయవలయును) ఈరీతిగా నిహ పర లోక భోగమును గురించి, యుత్తమ లోకమును గురించి, అనిష్ట నివారణమును గురించి, యిష్టమైన కార్యములను గురించి వేదమందు పెక్కు ప్రక్రియలు క్రతువులు, ఇష్టులు, ఉపాసనలు చెప్పబడియున్నవి అటుల క్రియాపరమైన వేదమే సార్థకమగునుగాని, మిగిలిన వేదవాక్యములన్నియు అనర్థకములని వీరి వాదము కనుక వేదములకే ప్రామాణ్యము కలదు గాని, ఎట్టి చోదనను (ప్రేరణను) విధించని వాక్యములకు ప్రమాణత్వముగాని, ప్రయోజనముగాని లేదని వీరి వాదము

ఉదా "తత్త్వమసి" (నీవు అదై యున్నావు), "ప్రజ్ఞానం బ్రహ్మ" (ప్రజ్ఞానము బ్రహ్మమైయున్నది),

అహం బ్రహ్మాస్మి (నేను బ్రహ్మమునై యున్నాను), అయం ఆత్మా బ్రహ్మ (ఈ ఆత్మయే బ్రహ్మ పదార్థము)— ఇట్టి వాక్యములు వేదములందును వేదాంతములందును బహుళముగా నున్నవి ఈ వాక్యములందు సాధకున కెట్టి ప్రేరణగాని, విధిగాని, చోదనగాని, కర్మగాని, ఉపాసనగాని విధింపబడలేదు కావున భాట్టీయుల వాదన ప్రకార మీ వాక్యములన్నీ నిరర్థకము లని వారి నిశ్చయము

పుటలు 124, 126 పేరా 32 (అ, ఆ, ఇ) - కాని భాట్టీయులకు కొన్ని సందేహములు కలిగి వానిని నివర్తించుకొనుటకు ప్రయత్నించిరి వేదాంతములు కూడా వేదభాగములే గాబట్టి వానికి నిరర్థకత కల్పించుట వైదికమతమునకే విరుద్ధమని భయపడిరి అందుచే యత్ కించిత్ ప్రయోజనము కల్పించవలెనని ప్రయత్నము చేసిరి అది యేమన, యజ్ఞ యాగాది క్రతువులలోని యజమానునిస్తుతియు, ఉపాస్య దేవతా స్తుతియు, వైదిక కర్మలో వేద ంతము ఒక అంగమని చెప్పిరి అనగా, ఒక క్రతువునందు దేవతా పూజలకు సంసిద్ధుడైన యజమానిని స్తుతి చేయనిచో నతనికి క్రతువులందు అభిరుచి పుట్టదు గావున "నీవే బ్రహ్మ" నీ ప్రజ్ఞయే బ్రహ్మ" యని, "నేనే బ్రహ్మ" యని యిట్టి కర్తృస్తుతి వైదిక కర్మలందు ఒకానొక అంగమగుచున్నదని (క్రియా విధి శేషత్వము) చెప్పిరి 'శేషి' యనగా పూర్ణమైన కర్మ లేక ధర్మి శేష మనగా కర్మాంగము, లేక ధర్మియొక్క ధర్మము ఉదా ప్రతి వ్రతమునందును విఘ్నేశ్వర పూజ, కలశ పూజ, కలశోదక పూజ మున్నగు శేషములను గావించి తదుపరి ముఖ్యకర్మను ప్రారంభించుట లోక ప్రసిద్ధము అట్టి అముఖ్యమైన కర్మలను

క్రియావిధి శేషము లందురు అటులనే పూజించబడు ముఖ్య దేవతలను, అముఖ్య దేవతలను గాని (నీవే బ్రహ్మయనిగాని, నీవే ఈశ్వరుడవనిగాని) స్తుతించువాక్యములు పెక్కులుండును అట్టి స్తుతివాక్యములు కూడ క్రియావిధి శేషములే భాట్టీయుల వాదన ప్రకారము వేదాంతములన్నియు, కర్తృస్తుతి వాచకములనియు, లేక దేవతా స్తుతివాచకములనియు వక్కాణింతురు ఆత్మ విద్యయంతయు, (ఉదా మాండూక్యోపనిషత్) కర్తృస్తుతివాచకమనియును, బ్రహ్మ విద్యయంతయు (ఉదా ఈశోవాస్యోపనిషత్) దేవతాస్తుతి వాచకమనియు వీరు వాదించెదరు.

వేదాంత శాస్త్రమంతయు నిత్యసిద్ధవస్తు ప్రతిపాదకమని (పరినిష్ఠిత ప్రతిపాదకమని) చెప్పుటచే వేదాంత శాస్త్రము వలన ప్రయోజన మెట్టిదియు చేకూరజాలదు ఏలయన, ప్రసిద్ధ వస్తువును గురించి వర్ణించిన మాత్రమున మానవులకు పాపనివృత్తిగాని, పుణ్యముగాని (హేయముగాని, ఉపాదేయముగాని) చేకూరజాలదు గదా! కావున, వేదాంత శాస్త్రమువలన యెట్టి పురుషార్థము చేకూర జాలదని వారి వాదన

ఈ పై వాదనలన్నియును వేదాంతశాస్త్ర సంబంధములై యుండగా కర్మకాండ ప్రకరణమందు జ్ఞానకాండ వాక్యము లప్రసక్తములని లేక అసమంజసములని భీతిల్లి భాట్టీయులు వేదాంత వాక్యములను (జ్ఞానకాండను) స్వల్పప్రయోజనములను జేకూర్పదలచి యిట్లు చెప్పుచున్నారు "ఒకవేళ జ్ఞానకాండవాక్యములను కర్మకాండ

ప్రకరణములందు వాడకూడదని వాదించినచో జ్ఞానకాండలో నిర్దేశింపబడిన యుపాసనలగు శాండిల్యవిద్య, దహరవిద్య, ఉపకోసలవిద్య, పంచాగ్నివిద్య మున్నగు వానియొక్క సందర్భములో కర్తృస్తుతి వాచకములుగానో, బ్రహ్మస్తుతి వాచకములుగానో సమన్వయింపవలసి యున్నది

పుట 128 (ఉ) (ఊ) – వేద వాక్యములకు విధితో (చోదనతో) సంబంధముండి తీరవలయును ఇష్ట ప్రాప్తిని గురించి చెప్పునది విధి అనిష్ట నివారణను గురించి చెప్పునది నిషేధము విధి ఉపాదేయము నిషేధము హేయము హేయోపాదేయములు లేనిచో, అనగా విధి నిషేధములు లేనిచో, శాస్త్రమునకు నిష్ప్రయోజనత కలిగి, ప్రమాణము కాజాలదు కావున వేదాంత వాక్యములు వైదిక కర్మోపాసనలయందు విధివిహితములైన కర్తృ దేవతా స్తవము చేయునట్టివి కాన వేదాంతములకు కర్మాంగరూపములుగా ప్రయోజనము కలుగవచ్చునని భాట్టీయులు వాదించెదరు ఒకవేళ ప్రకరణభంగమై (కర్మకాండయందు జ్ఞానకాండలు సమన్వయించుట, లేక జ్ఞానకాండయందు కర్మలను సమన్వయించుట) యుక్తము కాదని అద్వైతులు వాదించినచో వేదాంతములలో ప్రతిష్ఠితములైన దహరాది విద్యలందు వేదాంతములు స్తుతివాచకములుగా ఉపాసనాంగములుగా పరిగణింపవచ్చునని భాట్టీయులు వేదాంతమును తృణీకరించుచు శాస్త్రయోనిత్వాత్ సూత్రమును ప్రతిఘటించిరి

## పుట 130, పేరా 33 – సూత్రము 4, తత్తుసమన్వయాత్ ( తత్ తు, సమన్వయాత్ )

పూరణము వేదాంతములలో ప్రతిష్ఠితమైన బ్రహ్మమును సంబోధించు వాక్యములు కర్తృప్రస్తావక లేక దేవప్రస్తావక శేషములు కావు మరియును కర్మకాండయందుగల ఆమ్నాయ నియమములు, జ్ఞానకాండయందు లేమిచే శేష శేషిన్యాయము ధర్మ ధర్మి న్యాయము జ్ఞానకాండయందు ప్రవేశపెట్టుట శాస్త్రవిరుద్ధమగును కాని వేదాంతము లలో ( ఉపనిషత్తులలో ) పరస్పరవిరుద్ధ వాక్యములుగాని సందేహాస్పదమైన వాక్యములుగాని ప్రాప్తించినచో షడ్విధ లింగములచే సమన్వయముచేయుటచేత బ్రహ్మావగతి చేకూరును అంతేగాని కర్మకాండ వాదములను బ్రహ్మ కాండయందు ప్రవేశపెట్టి వేదాంతముల కించపరచుట యోగ్యము కాదని సూత్రము సూచించుచున్నది

అధికరణమ్—పంచావయవాః

( 1 ) విషయః – ఈ అధికరణమునందు సర్వ వేద వేదాంత వాక్యములును విషయవాక్యము లగుచున్నవి అనగా (1) సదేవసోమ్యేద మగ్ర ఆసీత్ ఏకమేవా ద్వితీయం-ఛాం – ( 2 ) ఆత్మావా ఇదమేకఏవాగ్ర ఆసీత్ – ఐత ( 3 ) తదేతత్ బ్రహ్మ పూర్వ మనవరమనంతర మబాహ్య మయమాత్మా బ్రహ్మ సర్వాను భూః – బృహా (4) బ్రహ్మై వేదమమృతం పురస్తాత్ –ముం ఈవిధముగా అన్ని వేదము లలో నున్న వేదాంతవాక్యములన్నియును ఈ సమన్వయాధి కరణమునందు విషయ వాక్యము లగుచున్నవి.

2 సంశయః - వేదాంతములు బ్రహ్మపరములా, లేక బ్రహ్మపరములై కర్తృదేవతా స్తావకములా ?

3 పూర్వపక్షః - కర్మకాండవలె వేదాంతములును క్రియను విధించుచున్నవి కేవల పరినిష్ఠిత నిత్యసిద్ధమైన బ్రహ్మవస్తువును గురించి చెప్పుచున్నచో, అట్టి వానికి ప్రామాణ్యముగాని, శాస్త్రీయతగాని యుండుటకు వీలులేదు కావున వేదాంతములు కర్తృదేవతాస్తావకములై యున్నవి గాని కేవల బ్రహ్మనుగురించి చెప్పుటలేదు

4 సిద్ధాంతః - వేదాంతములు బ్రహ్మబోధకములే షడ్విధలింగములచే శాస్త్రీయముగా సమన్వయము చేసినచో బ్రహ్మబోధకము లగును మరియును ముక్తిని చేకూర్చును కావున శాస్త్రీయత వేదాంతములకు కలదు అదెట్లన, తెలియని దానిని తెలియజేయుటయే శాస్త్రము యొక్క ప్రయోజనంబగు ' అజ్ఞాత జ్ఞాపకత్వాత్, ప్రమాణాని '

5 సంగతిః - పూర్వ ( శాస్త్రయోనత్వాత్ ) సూత్రమందు బ్రహ్మవేదైకవేద్యమని చెప్పబడినదిగదా ! పూర్వమీమాంసాశాస్త్ర రీత్యా వేదము కర్మబోధక మగుచున్నదిగదా ! కావున వేదము బ్రహ్మబోధక మెట్లగు నని ఆక్షేపసంగతి

పుట 132 పేరా 34 - ఈ బ్రహ్మసూత్రము నందు 'తు అనెడి అవ్యయము పూర్వపక్ష నిరాకరణార్థై ప్రయోగించబడుచున్నది 'తు' ఛీ యని పూర్వపక్షము చెల్లనేరదు అనెడి విధముగా సూత్రమునందు సమన్వయము చేయవలయును కనుక 'శాస్త్రయోనిత్వాత్ ' అను సూత్రము

ననుసరించి బ్రహ్మకు సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్వ జగదుత్పత్తి లయకారణత్వములు వేదాంతశాస్త్రముచేతనే (ఉపనిషత్తుల వలననే) తెలియనగును ఉపనిషత్తులలో వైషమ్యమేర్పడి నప్పుడు సమన్వయము నాశ్రయింపవలయును సమన్వయించుట యనగా వాచ్యార్థమునకును, లక్ష్యార్థమునకును వైషమ్యము కలిగిన సందర్భములో ప్రకరణమునుబట్టి ఉపసంహారములనుబట్టి సందర్భహేతువులనుబట్టి శాస్త్రజ్ఞుని నిజాభిప్రాయమును కనుగొనుట దీనినే ఆంగ్లములో (ఇంటర్ప్రటేషన్) అని యందురు సమన్వయముచేసి తాత్పర్య నిర్ణయము చేయుటకు ఆరు విధములైన గుర్తులు (లింగములు) కావలయును

1 ఉపక్రమోపసంహారములు

2 విషయము అపూర్వమా? (ఇదివరకెప్పుడును ఎవ్వరికిని తెలియనిదా?)

3 మరల మరల అభ్యాసము (ఆవృత్తి) చేయబడినదా?

4 దీని ఫలమేమి?

5. దీని నేమని ప్రశంసించిరి?

6 దీనికి నుపపత్తులు గలవా?

వీటిని క్లుప్తముగా చెప్పవలెనన్న—

1 ఉపక్రమోపసంహారములు 2 అపూర్వత

3 అభ్యాసము, 4 ఫలము, 5. ప్రశంస (అర్థవాదము),

6 ఉపపత్తి (యుక్తి)

(1) ఉపక్రమోపసంహారములు - అనగా రచన కర్తయొక్క భావము రచన ప్రారంభమునుబట్టి, ముగింపును బట్టి నొకేవిధముగా నున్నదా, లేదా యని విచారించుట.

ఉదా - ఛాందోగ్యోపనిషత్తులో ఉపక్రమములో "సదేవసోమ్యేదమగ్ర ఆసీ దేకమేవాద్వితీయం" అని ప్రారంభించి 'ఐ తదాత్మ్య మిదం సర్వం తత్ సత్యం స ఆత్మా, తత్త్వమసి' అని ముగించుటచే ప్రారంభించిన బ్రహ్మవిషయమే ఆత్మవిషయమని నిశ్చయింపబడినది ఉపక్రమోపసంహారములు సమముగా నున్నవిగదా!

2 పై ప్రకరణములో బ్రహ్మ ప్రతిపాద్యమని చెప్పుటకు "తదౌపనిషదం పురుషం పృచ్ఛామి అని ఉపనిషత్ ప్రతిపాద్యుడు పరమపురుషుడనియెడు విషయము అపూర్వముగా చెప్పబడినది అపూర్వమనగా యిదివరకు నెచ్చటను గోచరించనిది, ఇప్పుడు క్రొత్తగా గోచరింప చేయుట

3 'ఐతదాత్మ్య మిదం సర్వం అనెడి వాక్యమును తొమ్మిది పర్యాయములు చెప్పుటచే పై విషయము అభ్యాసము చేయబడినది అనగా, అభ్యాసము వలన, మరల మరల చెప్పుటవలన అది ప్రకరణముయొక్క ముఖ్యాభిప్రాయమని తెలుచున్నది

4 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ అని ఫలము చెప్ప బడినది బ్రహ్మమును ఎరిగినవాడు బ్రహ్మమే యగుచున్నా డని ఫలము

5 "యేనా శ్రుతం శ్రుతం భవతి, అమతం మతం అవిజ్ఞాతం విజ్ఞాతం" యని ప్రశంసింపబడినది ఈ ప్రశంసా వాక్యమును అర్థవాదవాక్య మనికూడా చెప్పుదురు

6 'యథా సౌమ్య ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతంస్యాత్' యని చెప్పుటవలన నాకానాక లోకయుక్తి(ఉపపత్తి) చెప్పబడినది ఒక మట్టిపెళ్లను చక్కగా పరీక్షించినచో లోకములోనున్న మట్టియొక్క సర్వవికార ములు ఎట్లు తెలియుచున్నవో అటులనే బ్రహ్మపదార్థమును విచారించినచో సర్వపదార్థములు గోచరించునని యుపపత్తి (యుక్తి) చెప్పబడియున్నది

ఈ యారు విధములైన లింగములచే (గుర్తులచే) వేదాంతవాక్యములను పరీక్షించగా వాక్యముల తాత్పర్యము స్పష్టముగా గోచరించును

పుట 134 పేరా 35 (అ) - ఈ పేరాలో నాలుగు వేదములనుండి నాలుగు వాక్యములు చెప్పబడినవి పుట 136, 'ఇ పేరా సమన్వయము చేసినచో బ్రహ్మ స్వరూప విషయము నిశ్చయింపబడుచుండగా ఆ వాక్యములకు మరియొక అర్థమును కల్పనచేయుట మంచిదికాదు గోచరించుచున్న అర్థమును త్రోసివేయుట లేని యర్థమును కల్పించుట దోషముగదా!

పుట 136, పేరా (ఈ) - వేదాంత వాక్యములు కర్తను స్తుతించుచున్నవని చేసిన పూర్వపక్షమును పూజ్యపాదుల వారు ఖండించుచున్నారు బ్రహ్మజ్ఞానికి క్రియ కారకము, ఫలము అనునట్టివి యుండకపోవుటచే నతడు ఆత్మభూత మగుటచే "తత్కేన కంపశ్యేత్" (బృహ), ఏ సాధనముచే దేనిని ఎవడు చూచునో యని వేదము చెప్పుటవలన, కర్తను స్తుతించుటయను పూర్వపక్షము నిరాకరింపబడు చున్నది

పుట 136, పేరా (ఉ) - బ్రహ్మము సిద్ధవస్తువే యయినను అది సిద్ధవస్తువని బోధించుటకు శాస్త్రము గావలసి యున్నది గావున నట్టి శాస్త్రము లేకుండా విషయము తెలియ జాలదు కనుక శాస్త్రము తప్పించి (శబ్దప్రమాణమును తప్పించి) ప్రత్యక్ష, అనుమాన ప్రమాణములచే బ్రహ్మాత్మ భావము గ్రాహ్యము గాదు కావున శాస్త్రమువలననే బ్రహ్మ అవగతమగును

పుట 138, పేరా 36 (అ) - హేయోపాదేయములు (పాపపుణ్యములు) వేదాంతశాస్త్రములు చెప్పకపోవుటచే వేదాంతశాస్త్రము నిరర్థకమని చెప్పెడి పూర్వపక్షమును పూజ్యపాదులవారు ఖండించుచున్నారు హేయోపాదేయ శూన్యమగు బ్రహ్మమొకటి గలదనియును, అదియే మన యాత్మయనియు చక్కగా తెలిసికొన్నచో సర్వక్లేశములు నశించి పరమపురుషార్థమైన ముక్తి దొరుకగలదు కావున హేయోపాదేయ రహితత్వమువలన వేదాంతశాస్త్రము నిరర్థకమని చెప్పుట సమంజసముకాదు

పుట 138, పేరా 36 (ఆ) - వేదాంతములలో నుపాసనార్థము అచ్చటచ్చట నున్న వాక్యములకును, కర్మకాండలో నుపాసనలకు సంబంధించిన వాక్యములకును మిక్కిలి భేదమున్నది ఏమన, బ్రహ్మకు ఏకత్వము నిశ్చయింపబడగా హేయమగు వస్తువుగాని, యుపాదేయ వస్తువుగాని లేకుండా పోవును మఱియును క్రియాకారక ఫలాది ద్వైతవిజ్ఞానము పూర్తిగా నశించును కావున బ్రహ్మకు ఉపాసనావిధి శేషత్వము ఉండుటకు వీలులేదు.

పుట 138, పేరా (37) – బ్రహ్మజ్ఞానముచే నొక పర్యాయము నశించిన ద్వైతభావము కొంతకాలమునకు తిరిగి ఉద్భవింపజాలదు ఒక పర్యాయము ఇది త్రాడు యని తెలిసిన తరువాత మరెప్పటికిని త్రాడునందు సర్పభ్రమ పుట్టదుకదా! కావున బ్రహ్మమునకు ఉపాసనా విధి శేషత్వము గలుగదు అనగా ఉపాసించుటగాని, తత్ విధులకు నంగములుగా పూజాదులు సేయుటగాని యెన్నటికి గలుగదు

పుట 139 పేరా (38) – వేదములో అర్థవాద వాక్యములు పెక్కులు గలవు ఒక స్వల్పక్రియకు అత్యధిక ఫలము చెప్పుటయు, కర్తకు రుచ్యర్థముగా కర్మయందాసక్తి పుట్టించుటయు, ఈ అర్థవాద వాక్యములకు ప్రయోజనమై యున్నది ఇట్టి యర్థవాదవాక్యములను సిద్ధాంతవాక్యములుగా జెప్పుట యసమంజసము ఈ అర్థవాద వాక్యములకు స్వతంత్రముగా ప్రామాణ్యము లేదు ఇవి విధివాక్యములతో జేర్చినపుడే (సంయోగించనపుడే) కొంచెము రుచ్యర్థమును అనగా ప్రబోధనమును కర్తయందు గల్పించుటచే ప్రమాణములు ఇక జ్ఞానకాండలో నాత్మజ్ఞానము, అనగా వేదాంత జనిత విజ్ఞానము సంపూర్ణముగా ఫలపర్యవసాయి యగుటచే తద్విషయక శాస్త్రముయొక్క ప్రామాణ్యము త్రోసిపుచ్చుటకు శక్యముగాదు

పుట 140, పేరా 39 – వేదాంతశాస్త్రము యొక్క ప్రామాణ్యము తర్కాదులచే (అనుమాన ప్రమాణముచే) సాధించుటకు వీలులేదు ఏలన అనుమాన ప్రమాణమునకు ఒక ప్రసిద్ధమైన నిదర్శన ముండితీరవలయును,

ఉదా - "యత్రధూమః తత్రాగ్నిః" ఎచ్చట పొగయున్నదో యచ్చట నిప్పుండును విడిసమయములలో నెక్కడెక్కడ పొగను చూచుచున్నామో, యక్కడ నిప్పున్నదని ప్రసిద్ధమైన నిదర్శనమును (దృష్టాంతమును) లేక లింగమును పురస్కరించుకొని యట్టి దృష్టాంత బుద్ధితో పర్వతమున గనబడు ధూమమువలన నగ్నియున్నదని సాధించుచున్నాము కనుక ప్రసిద్ధమైన నిదర్శనము (దీనినే తార్కికులు వ్యాప్తి యందురు) కావలెను ప్రసిద్ధమైన నిదర్శనము లేనిచో ననుమాన ప్రమాణమునకు తావు దొరకదు వేదాంతములందున్న వాక్యములు స్వతః ప్రమాణములు గావున ప్రసిద్ధమైన నిదర్శనము బ్రహ్మను గురించి దొరకజాలదు గావున, వేదాంతశాస్త్ర ప్రామాణ్యము అనుమాన ప్రమాణముచే సాధించుటకు వీలులేదు

ఈ పై వాదములను బురస్కరించుకొని పూజ్యపాదుల వారు భాట్టీయవాదమును ఖండించి, వేదాంతశాస్త్రమునకు ప్రామాణ్యమును, శాస్త్రీయతను పురుషార్థతను సిద్ధాంతీకరించిరి

పుట 140, పేరా 40 - ఈ వర్ణకములో వృత్తికారు లొక పూర్వపక్షమును లేవదీయుచున్నారు బ్రహ్మము శాస్త్రముచే నుపదేశింపబడుచున్నప్పటికిని యట్టి యుపదేశము ఉపాసనల విధికి అంగముగా బోధింపబడుచున్నది ఉపాసన లనగా ఉపాస్యదేవతయందు నిష్ఠగా యమనియమముల పాటించుచు తపోజపములు సల్పుట కర్మమీమాంసయందు యూప స్తంభమున పశువును గట్టవలెనని, ఆహవనీయాగ్నియందు ఆహుతి చేయవలయునని,

ఇంద్రుని బూజింపవలెనని విధుల ననుసరించి తత్కర్మాంగ ముగ ఆ యా వస్తువుల బోధించినటులనే వేదాంతశాస్త్రము బ్రహ్మోపాసనయందు బ్రహ్మ నంగముగ విధించునని వీరు చెప్పుదురు ఇట్టి వాదనను బలపరచుచు శబర భాష్యమున వేదాంతము లుపాసనాంగముగా బ్రహ్మాదులను విధించుచున్న వని వీరు చెప్పిరి వీరి వాదనప్రకారము (1) కర్మయొక్క జ్ఞానమే వేదముయొక్క ప్రయోజన మని (2) అట్టి జ్ఞానము ద్వారా క్రియలను ప్రవర్తింపచేయు వాక్యము చోదన యని, (3) కర్మమును తెలుపు వాక్యము ఉపదేశ మని, (4) ఈ క్రియతో సిద్ధవస్తు ప్రయోజనమేది గలదో యదియే వేదము యొక్క యుద్దేశ్య మని (5) క్రియార్థకములు కాని వాక్య ములు నిష్ప్రయోజనము లని జైమినీ సూత్రములలో సిద్ధాంతీకరించిరి వీరి వాదములో సత్కర్మలను ప్రవర్తింప చేయుట "ఉపాదేయ' మని, దుష్టవిషయము నుండి నివారించుట "హేయ" మని జెప్పెదరు ప్రవృత్తి నివృత్తులే శాస్త్రమునకు ముఖ్యప్రయోజనమని చెప్పుదురు కావున వేదాంతశాస్త్రమున కూడా హేయోపాదేయ కర్మవిశేష బోధ యుండితీరవలయు నని యుద్ఘాటించెదరు

కావున, స్వర్గాదుల నభిలషించువారికి నగ్నిహోత్రాది సాధనమెట్లు విధింపబడుచున్నదో, యటులనే మోక్షాభి లాషులకు బ్రహ్మజ్ఞానము సాధనముగా విధింపబడుచున్నదని చెప్పెదరు కావున బ్రహ్మజ్ఞానము సిద్ధవస్తువు కాదని, సాధనవస్తువనియే వీరి వాదము.

పుట 144 - పేరా 41 (అ) - ఈ సిద్ధాంతమును ఖండించుచు పూజ్యపాదులవారిట్లు జెప్పుచున్నారు. పూర్వ

గ్రంథమందు కర్మకాండకు, బ్రహ్మకాండకు భేదమున్నదని చెప్పబడినదిగదా! కర్మకాండయందు భవ్యధర్మము అనగా చేయదగిన ధర్మము జిజ్ఞాసింపదగినది బ్రహ్మకాండయందు నిత్యసిద్ధమగు బ్రహ్మము జిజ్ఞాసింపదగినది మఱియును కర్మజ్ఞానఫలము అనుష్ఠానము నపేక్షించుచున్నది బ్రహ్మజ్ఞానఫల మనుష్ఠానము నపేక్షించుటలేదు ఇదే ముఖ్యమైన భేదము

పుట 146 - పేరా 41 (అ) - దీనికి పూర్వపక్షి యెదురుప్రశ్నను వేయుచున్నాడు అద్వైతులయొక్క బ్రహ్మశాస్త్రమందు కూడ క్రియను బోధించు విధులు గలవు అవి ఏవన (1) ఆత్మావారే ద్రష్టవ్యః (ఆత్మయే చూడదగినది - (బృహ) (2) "య ఆత్మా - అపహతపాప్మా, సోఽన్వేష్టవ్యః సవిజిజ్ఞాసితవ్యః' - (ఛాందో) (పాపరహితాత్మ యేదియో, యదియే వెదుకదగినది తెలియదగినది ) (3) 'ఆత్మేత్యేవ ఉపాసిత' - (బృహ) (తాను ఆత్మయే యని ఉపాసించ వలయును) (4) "ఆత్మానమేవ లోకముపాసీత' - (బృహ) (ఆత్మయను లోకమునే యుపాసింపవలయును ) (5) "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ముండకో) బ్రహ్మ నెరిగినవాడు, బ్రహ్మయే యగుచున్నాడు.

కావున వేదాంతములయందు విధిరూపములైనవాక్యము లుండగా, ఆ ఆత్మయెట్టిది? ఆ బ్రహ్మమేది? అను నాకాంక్ష యుండగా, అట్టి యాత్మ నిత్యుడని, సర్వజ్ఞుడని, సర్వత్ర యున్నవాడని, నిత్యతృప్తుడని, నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావుడని, విజ్ఞానము, ఆనందము బ్రహ్మయని, యట్టి

బ్రహ్మము నుపాసించుట శాస్త్రదృష్టఫలకమని, పరలోకమందు అదృష్టమగు మోక్షరూపఫలము కలుగునని చెప్పుచున్నవి

పుట 148 - పేరా 41 (ఇ) - కావున కర్తవ్యవిధి సంగము కాకుండా కేవల వస్తుమాత్ర కథనముచే నా వస్తువుయొక్క హానముగాని, ఉపాదానముగాని సంభవించదు సప్తద్వీపములు గలది భూమి' 'ఈ రాజు వెళ్లుచున్నాడు' అనునట్టి వాక్యములవలె వేదాంతవాక్యములవలన నెట్టి పురుషార్థము లేదు అని చెప్పుదురు

పుట 148, పేరా 42 (అ) - ఈ వాదమును ఖండించుచు పూజ్యపాదులవారు కేవల వస్తుకథనముచేత కూడా ఫలమున్నదని చెప్పుచు, రజ్జుసర్పభ్రాంతిగలవానికి "ఇది త్రాడు ఇది పాముకాదు, అని చెప్పుటవలన భ్రాంతి భయము పోవుట లోకప్రసిద్ధముగదా! అటులనే సంసార రహితమగు ఆత్మవస్తువును నెరిగించుటచే ఆత్మసంసారియను భ్రాంతిని వేదాంతవాక్యము పోగొట్టుటచేత వేదాంతవాక్యము అర్థవంతమైయున్నదని చెప్పుచున్నారు

పుట 148, పేరా 42 (ఆ) - ఆక్షేపము మీరు చెప్పిన దృష్టాంతమువలన కేవల రజ్జుస్వరూప శ్రవణమువలన సర్పభ్రాంతి తొలగినటుల బ్రహ్మస్వరూపశ్రవణమాత్రము క వేదాంత వాక్యముచే సంసారిత్వభ్రాంతి నశించినచో వేదాంత శ్రవణము ప్రయోజనవంతమగు కాని, లోకములో నటుల సంసారభ్రాంతి నాశనము కనిపించుటలేదు. వేదాంత శ్రవణానంతరమున కూడా శ్రోతలకు పూర్వమందువలెనే, సుఖదుఃఖాది సంసారి భ్రాంతికలుగుచున్నది కదా!

పుట 150, పేరా 42 (ఇ) – మఱియును బృహదారణ్యక శ్రుతిలో "శ్రోతవ్యో, మంతవ్యో, నిదిధ్యాసితవ్యః" శ్రవణము చేయవలెను, మననము చేయవలెను, ధ్యానము చేయవలెను అని శ్రవణానంతరము మనన నిది ధ్యాసనముల విధులు కన్పట్టుటచే ఉపాసనా విధుల కంగముగా బ్రహ్మమును శాస్త్రము బోధించుచున్నదని స్పష్టమగుచున్నది ఇది పూర్వపక్ష వాదము

పుట 150, పేరా 43 – దీనిని పూజ్యపాదులవారు సమాధానించుచున్నారు కర్మమీమాంస ఫలమునకును, బ్రహ్మమీమాంస ఫలమునకును అత్యంత భేదమున్నది శారీరక వాచిక మానసికమగు కర్మ శ్రుతులచేత నుపదేశింపబడి "ధర్మము పేర ప్రసిద్ధి చెందియున్నది మఱియును ప్రతిషేధ ప్రేరణచే అధర్మముకూడా (అనగా హింసాదికము) జిజ్ఞాస్యమగుచున్నది అర్థముయొక్క ఫలము సుఖమనియు అనర్థముయొక్క ఫలము దుఃఖమనియు ఇట్టి సుఖదుఃఖముల ననుభవించుట (విషయముల యింద్రియముల సంయోగముచే జన్యములగు శీతోష్ణాదులను, శుభాశుభములను, హర్ష విషాదముల ననుభవించుట) చతుర్ముఖ బ్రహ్మనుండి వృక్షాది సావరములవరకు సుప్రసిద్ధముగా తెలియబడుచున్నవి మరియును నరుడు మొదలు బ్రహ్మ దేవుని వరకు గల దేహధారులకు సుఖముయొక్క తర తమ భావము కనుపడుచున్నది

పుట 150, పేరా 43 (అ) – సుఖదుఃఖమందలి తారతమ్యమునకు కారణ మేమన ? ఆ యా వ్యక్తులచే నాచరింపబడి ధర్మమందలి తారతమ్యమే యని తెలియబడుచున్నది

ధర్మమందలి తారతమ్యమునకు కారణమేమన, యా కర్తల యొక్క సామర్థ్యాదులు కారణమగుచున్నవి దీనికి ఉదాహరణమేమన, యాగాదు లనుష్ఠించువారలకు బ్రహ్మ లోకప్రాప్తియు, ఇష్టాపూర్తములచే దక్షిణమార్గ గమనమును సుఖతారతమ్యమును, సాధక తారతమ్యమును పూర్వమీమాంస శాస్త్రముచే వ్యక్తమగుచున్నవి మరియు పుణ్యఫలము అంతయు కాగా చంద్రలోకమునుండి తిరిగి భూమిపైకి వచ్చెదరని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది.

పుట 152, పేరా 43 (ఇ) - మనుష్యులు మొదలు నరక సంబంధమగు వృక్షములు వగైరా ప్రాణులయందు గల సుఖస్వల్పత్వముయొక్క తారతమ్యమునకు కారణము ఆ యా ప్రాణులచే నాచరింపబడిన ధర్మతారతమ్యమని యూహింపవచ్చును కావున బ్రహ్మనుండి వృక్షాది స్థావరాంతములవరకు గల దుఃఖమునకు కారణమగు ధర్మములో కూడ హెచ్చుతగ్గులున్నవని నిశ్చయమగుచున్నది.

పుట 152, పేరా 44 (అ) - ఇట్టి ధర్మాధర్మముల తారతమ్యమున కనుగుణమైన శరీరము కారణముగా గలిగినట్టి సుఖదుఃఖతారతమ్యత యున్నదియును, అనిత్యమైన సంసార రూపమని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి ఇట్టి శ్రుతిప్రమాణమేమన "సహవై సశరీరస్య సతః ప్రియాప్రియయోరపహతిరస్తి" శరీరమునందు నాత్మభావము గలవానికి ప్రియాప్రియములయొక్క అపహతి (నాశత్వము) లేదు గదా యని సంసారస్వరూపము విపులముగా చెప్పుచున్నది

పుట 154, పేరా 44 (ఆ) - తత్వజ్ఞానముచే శరీరమునం దాత్మభావన లేనివానిని సుఖదుఃఖములు స్పృశించవు(ఛాందో) అని ప్రియాప్రియ స్పర్శ లేదని చెప్పుటవలన చోదనాలక్షణ మైన ధర్మాధర్మములు మోక్షమను పేరుగల అశరీరత్వము నకు నిషేధింపబడుచున్నవని తెలియుపర్చుచున్నది కావున ప్రియాప్రియస్పర్శ మోక్షమునకు కుదురదు

పుట 154, పేరా 45 (అ) - ఇచ్చట పూర్వపక్ష మొకటి యున్నది ధర్మముచే అశరీరత్వము కలుగవచ్చు నని చెప్పకూడదా? ధర్మముచే విచిత్రములగు ఫలములు పుట్టుచున్నవి గదా!

పుట 154, పేరా 45 (ఆ) - ఈ శంకను పూజ్యపాదుల వారు పరిహారించుచున్నారు అశరీరత్వము ధర్మాదులచే పుట్టెడిది కాదు అది స్వభావసిద్ధమైన సిద్ధవస్తువు దీనికి శ్రుతిప్రమాణము లేవన (1) "అశరీరం శరీరేషు అనవస్థేషు అవస్థితం, మహాంతం విభుం ఆత్మానం మత్వాధీరోనశోచతి" (కఠ) శరీరరహితమును (అశరీరమును), అశాశ్వతమైన శరీరములందున్నదియు,గొప్పదియు సర్వవ్యాపకమునగు నాత్మను తానుగా తెలుసుకొని వివేకి దుఃఖంపడు (2) "అప్రాణో హ్యామనాః శుభ్రః" (ముండక) ప్రాణరహితుడును, మనో రహితుడును, శుద్ధుడును (రాగాది దోషరహితుడు) ఐన వాడు ఆత్మ (3) "అసంగోహ్యాయం పురుషః (బృహా) ఈ యాత్మ నిస్సంగుడు అనగా రెండవదానితో సంబంధము లేనివాడు ఇట్టి శ్రుతులవలన ననుష్ఠేయముగు కర్మయొక్క ఫలముకంటె వేరైన మోక్షమను పేరుగల అశరీరత్వము నిత్యమని సిద్ధించుచున్నది,

పుట 156, పేరా 46 (అ) :- ఇచ్చట పూర్వపక్ష మొకటి వచ్చుచున్నది. అద్వైతులగు మీరు అశరీరమునకు జెప్పు నిత్యత ఎట్టిదది ? అది పరిణామి నిత్యతయా ? లేక సాంఖ్యులు చెప్పు సత్త్వరజస్తమోగుణముల నిత్యతా ? ద్వైత వాదములో నిత్యత యనగా కించిత్ వికారమున్నను, నిదియే యది యనుబుద్ధి చెదరకుండ నుండునట్టి దానిని 'పరిణామి నిత్యము' అని యందురు అటులనే సాంఖ్యులు కూడ సత్త్వరజస్తమో గుణములు కూడ నిత్యములని చెప్పుదురు కావున అశరీరత్వమును గురించి స్పష్టార్థత విచారింపబడు చున్నది

పుట 156, పేరా 46 (ఆ) - ఈ శంకకు పూజ్యపాదుల వారు సమాధానమిచ్చుచున్నారు అశరీరమగు ఆత్మ కూటస్థ నిత్యము, ఆకాసమువలె సర్వవ్యాపి, సర్వవిక్రియా రహితము, నిత్యతృప్తము, నిరవయము, స్వయంజ్యోతి స్వభావ మయియున్నది కావున పరిణామి నిత్యతగాని, గుణ నిత్యతగాని కర్మముల వలన ప్రాప్తించుటచే దానికి నుండజాలదు

పుట 158 పేరా 46 (ఇ) - మరియును, ధర్మాధర్మ ములు వాటికార్యములైన సుఖదుఃఖాదులు త్రికాలములందును నెచ్చట సంభవింపవో దానికి నశరీరత్వము అని లేక మోక్షము అనిపేరు దీనికి శ్రుతిప్రమాణ మేమన "అన్యత్ర ధర్మాత్ అన్యత్రాఽధర్మాత్, అన్యత్రాస్మాత్, కృతా కృతాత్, అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ" (కఠ)

ధర్మముకన్న భిన్నమైనదియు, అధర్మముకన్న భిన్న మైనదియు, కార్యముకంటె కారణముకంటె భిన్నమైనదియు,

భూతముకంటె భవిష్యముకంటె వర్తమానముకంటె భిన్నమైనదియు కావున కూటస్థబ్రహ్మమును గురించి జిజ్ఞాస ప్రస్తుతింపబడుచున్నది

పుట 158 పేరా 46 (ఈ) – బ్రహ్మము కర్తవ్యమునకు అనగా క్రియాదులకు శేషముగ (అంగముగ) ఉపదేశింపబడినచో, దానిచే మోక్షము సాధ్యమయినచో, అనిత్యవస్తువే కావలసివచ్చును అది అనిత్యమైనచో తరతమభావములచే అనిత్యములగు కర్మఫలములలో నేదియో నొకయతిశయఫలముగా మోక్షము తలంపబడవలయును ఇట్టియనర్థవాదన లోకమునకు సమ్మతికాదు మోక్షవాదులందరు, మోక్షము నిత్యమని యొప్పుకొనుటచే క్రియావిధికి సంగముగా బ్రహ్మ ముపదేశింపబడుచున్నదని చెప్పుట సమంజసము గాదు

పుట 158, పేరా 47 (అ) – బ్రహ్మజ్ఞానములు సమకాలికములని చెప్పు శ్రుతులున్నవి అవియేవన 1 "బ్రహ్మవేద బ్రహ్మైవభవతి" (ముండక) ఎవడు బ్రహ్మమును తన స్వస్వరూపముగా తెలిసికొనుచున్నాడో యట్టివాడు బ్రహ్మమే యగుచున్నాడు 2 క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ముండక) ఎవడు కార్యకారణరూపమగు బ్రహ్మము నేనే యని చూచునో ఆవిద్వాంసునికి కర్మలన్నియూ నశించును 3 'ఆనందం బ్రహ్మణో విద్వాన్, నబిభేతి కుతశ్చనేతి' (తైత్తి) బ్రహ్మముయొక్క యానందమును లేక బ్రహ్మభిన్నమగు ఆనందము తెలిసికొనినవాడు దేనివలనను భయము నొందడు 4 "అభయంవై జనకప్రాప్తోసి' (బృహ) ఓ జనకా! భయరహితమైన

బ్రహ్మభావమును పొందియున్నావు 5 "తదాత్మాన మేవావేదహం బ్రహ్మాస్మీతి, తస్మాత్ తత్సర్వమభవత్" (బృహ) ఆ బ్రహ్మమును స్వరూపముగా నేనే బ్రహ్మనైతినని తెలిసికొనెను ఆ తెలిసికొనుటవలన ఆ పూర్ణమగు బ్రహ్మమే అంతయును ఆయెను 6 "తత్రకో మోహః, కశ్శోకః ఏకత్వ మనుపశ్యతః" (ఈశావాస్య). ఏకత్వమును (సార్వాత్మ్యభావమును) తెలిసికొనుచున్న వానిక మోహమేది? శోకమేది? మోహశోకములుండవని తాత్పర్యము

ఈ పై తెల్పిన శ్రుతులు బ్రహ్మవిద్యానంతరమున మోక్షమును చూపుచు మధ్య యెట్టి విరామ విలంబములుండ రాదని వారించుచున్నవి మరియొక శ్రుతి యిట్లు చెప్పు చున్నది 'తద్ధైతత్ పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతిపేదే అహంమనుః అభవం సూర్యశ్చ" (బృహదా) ఆ బ్రహ్మమును ఆత్మగా తెలుసుకొన్న వామదేవుడను ఋషి 'నేను మనువునైతిని సూర్యుడనైతిని యని చెప్పెను ఈ శ్రుతి వలన పశ్యన్ అను శతృప్రత్యయాంతము వలన బ్రహ్మ దర్శనకాలమందు ఎట్టి కర్తవ్యముండజాలదని వారించుట నుదాహరించుచున్నది పశ్యన్, తిష్ఠన్ గాయన్ అనెడి ప్రయోగములచే క్రియల మధ్యయందు స్వకర్తృకమైన మరియొక కార్యము లేదని తెలియునట్లుగా (పశ్యన్ ప్రతిపేదే) చూచుచూ పొందెను ఆత్మను తెలియుచూ తాదాత్మ్యమును బొందెనని యర్థము

పుట 162, పేరా 47 (ఆ) – ప్రశ్నోపనిషత్తులో భరద్వాజులవారు పిప్పలాదునివలన జ్ఞానముం బడసి చెప్పిన వాక్యములు "త్వం హి నః పితా, యోఽస్మాకం అవిద్యాయాః పరం పారం తారయసి" (ప్రశ్నోప) ఏ నీవు మమ్ములను అవిద్యయొక్క యుత్కృష్టమగు ఒడ్డును జ్ఞానముచే దాటించుచున్నావో అట్టి కారణముచే నీవు మాకు నిశ్చయముగ తండ్రివే 2 ఛాందోగ్యములో నారదుడు సనత్కుమారునితో చెప్పిన వాక్యములు— "శ్రుతం హ్యేవ" భగవంతుడవగు నీతో సమానులైన మహానీయుల వలన స్వస్వరూపమును తెలిసికొనినవాడు దుఃఖమును దాటును అని విన్నట్టి నేను మహానుభావ! దుఃఖించుచున్నాను మహానుభావులగు మీరు అట్టి నన్ను దుఃఖముయొక్క యొడ్డును దాటింపుడు 3 "తస్మై మృదిత" (ఛాందో) భగవానుడైన సనత్కుమారుడు కాలుష్యము నశించుటచే చిత్తశుద్ధినొందిన ఆ నారదునికి అజ్ఞానముయొక్క అవధిని చూపించుచున్నాడు

ఇట్టి శ్రుతులు ఆత్మజ్ఞానముయొక్క ఫలమును మోక్షమునకు ప్రతిబంధకమైన యజ్ఞానముయొక్క నివృత్తి మాత్రముగనే చూపుచున్నవి

పుట 164, పేరా 48 – గౌతములవారిచే రచితమై యుక్తులచే ఘోషింపబడినట్టి న్యాయసూత్రము ఈ విషయమునే చెప్పుచున్నది 'దుఃఖజన్మప్రవృత్తి దోష మిథ్యాజ్ఞానానాం ఉత్తరోత్తరాపాయే తదనంతరాపాయాత్ అపవర్గః" (న్యాయసూ 1-1-2) దుఃఖము, జన్మ, ప్రవృత్తి, దోషము, మిథ్యాజ్ఞానములలో ఉత్తరోత్తరములు నశించుట

వలన పూర్వ పూర్వము నశించుచున్నది అనగా జన్మ నశించినచో దుఃఖము నశించును ప్రవృత్తి నశించినచో జన్మదుఃఖములు నశించును దోషము నశించినచో ప్రవృత్తి జన్మదుఃఖములు నశించును మిథ్యాజ్ఞానము నశించినచో దోషము ప్రవృత్తి, జన్మదుఃఖములు నశించును అందుచే మిథ్యాజ్ఞాన నివృత్తియే సర్వదోషాదికమును నశింపచేయు నని తాత్పర్యము దాన అపవర్గము (మోక్షము) లభించు చున్నది మిథ్యాజ్ఞాన నాశనము బ్రహ్మాత్మైక్య విజ్ఞానము వలన కల్గునని పండితాభిప్రాయము

పుట 164, పేరా 49 - పూజ్యపాదులవా రిచ్చట కొన్ని వాదములను ఖండించుచున్నారు (1) సంపద్రూప వాద ఖండన సంపదుపాస్తి యనగా ఒక అల్పవస్తువునకు, ఉత్కృష్ట వస్తువునకు కేవల ధర్మసామ్యముచే ఏకత్వమును భాసించి యల్పము నుత్కృష్టముగా భావన చేయుట అద్వైత సిద్ధాంతము ననుసరించి బ్రహ్మాత్మైకత్వము సంపద్రూపాత్మ కోపాసనము కాదు ఏలయన మన మనస్సు అనంతములగు వాసనలతో వృత్తులతో నొప్పారుటంచేసి, యనంత సంఖ్యలో నున్న విశ్వదేవతల సామ్యముతో మనస్సును విశ్వేదేవతలకు ఐక్యమును కల్పించి యుపాసించుటవలన నా యుపాసకుడు నానాధర్మములతో కూడిన అనంతలోకమును జయింప వచ్చును "అనంతంవై మనోఽనంతాః విశ్వేదేవాః, అనంత మేవ సతేవ లోకం జయతి" (బృహదా) (2) అధ్యాసరూప వాదఖండన —బ్రహ్మాత్మైకత్వము అధ్యాసరూపోపాసన కాదు ఒకదానిని మరియొకదానిగా, అనగా సాలిగ్రామ మును విష్ణువుగా నుపాసించుట అధ్యాసరూపోపాసన అటులనే

బ్రహ్మముగానట్టి మనస్సును బ్రహ్మమని, బ్రహ్మముగానట్టి ఆదిత్యుని బ్రహ్మమని మనస్సు ఆదిత్యుడు మున్నగు వానిని బ్రహ్మదృష్టితో నుపాసించుట, అధ్యాసరూపోపాసన యనబడు ఇట్టిది బ్రహ్మాత్మైకత్వమునకు జెల్లదు (3) విశిష్ట క్రియాయోగవాదఖండన - రెండు వస్తువులయందు తెలియ వచ్చెడి క్రియకు సామ్యముండుటవలన నా రెండు వస్తువులు ఒకటియే యను ఉపాసన ప్రలయమందు పృథివ్యాపస్తేజము లను వాయువు తనయందు యిమిడ్చుకొనును అట్లనే సుషుప్తియందు ముఖ్యప్రాణమనునది, సకలేంద్రియములను తనయందు నిమిడ్చుకొనును దీనినే సంవర్గమందురు ఇట్టి సంవర్గసామ్యముచే ప్రాణమే వాయువని యుపాసించు విధము జీవునియందును బ్రహ్మమందును క్రియాసామ్య ముండుట చేసి, జీవుడే బ్రహ్మమని యుపాసించుట విశిష్ట క్రియాయోగవాదమందురు అట్టి ఉపాసన బ్రహ్మాత్మైక్య విజ్ఞానమందు జెల్లదు

"వాయుర్వావ సంవర్గః ప్రాణోవావ సంవర్గః" (ఛాందోగ్య) 4 కర్మాంగసంస్కారవాదఖండన - యజ్ఞకర్మలందు దర్శపూర్ణమాసప్రకరణమందు నేతిని యజమానుని పత్నికి చూపించెదరు. అట్టి నెయ్యి హోమద్రవ్య యోగ్యతను పొందును దీనినే కర్మాంగ సంస్కార మందురు అటులనే బ్రహ్మాత్మైకత్వజ్ఞానము కర్మాంగ సంస్కారముకాదు

పుట 168 పేరా 50 (అ) - బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానము పైన తెల్పిన సంపదాది ఉపాసనారూపమే యైనచో బ్రహ్మాత్మైకత్వ ప్రతిపాదక వాక్యములకు బాధకలుగును

అనగా "తత్త్వమసి" "అహంబ్రహ్మాస్మి" "అయమాత్మా బ్రహ్మ" ఇత్యాది మహావాక్యములు బ్రహ్మాత్మైకత్వమును బోధించుచున్నవి అవి యన్నియు సంపదాది వాదనలచే బాధింపబడి అద్వైత సిద్ధాంతమును భేదింపగలవు అట్టిది ఎవ్వరికిని సమ్మతము గాదుగదా!

పుట 168, పేరా 50 (ఆ) – వేదాంతములందు అవిద్యానివృత్తి ప్రతిష్ఠాపించు వాక్యములుకూడా నిరర్థకములు కావలసివచ్చును అట్టి వాక్యములేవన, 'భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః''– (ముండక) హృదయగ్రంధి వచ్చిపోవును సర్వసంశయములు భేదించబడును

పుట 168, పేరా 50 (ఇ) – జీవునకు బ్రహ్మభావాపత్తిని బోధించు వాక్యములుకూడా సంపదాది వాదపక్షమున సమన్వితములు కావు 'బ్రహ్మవేద బ్రహ్మైవభవతి'– (ముండక) బ్రహ్మము నెరిగినవాడు బ్రహ్మమే యగుచున్నాడు కావున బ్రహ్మాత్మైకజ్ఞానము సంపద్రూపము, అధ్యాసరూపము, విశిష్టక్రియాయోగము, కర్మాంగసంస్కారము కాజాలదు కావుననే బ్రహ్మవిద్య పురుషవ్యాపారతంత్రము కాదని వస్తుతంత్రమే యని నిశ్చయింపదగును. బ్రహ్మవిద్య, ప్రత్యక్షాదిప్రమాణములకు విషయములగు వస్తుజ్ఞానమువలె వస్తుతంత్రమే యగును కావున బ్రహ్మమునకుగాని, బ్రహ్మజ్ఞానమునకుగాని యెట్టి యుక్తిచేనైన కర్మతో సంబంధము కల్పించుట శక్యముకాదు

పుట 168, పేరా 51 (అ) – ఇచ్చట తొలగించవలసిన శంక యొకటి గలదు. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ

భవతి  ఇట్టి వేదాంతవాక్యముచే బ్రహ్మను తెలియుట, బ్రహ్మవేదనము పురుషార్థముగా మన్నింపబడుచుండగా, బ్రహ్మము విషయమగుటంచేసి, కర్మగా (ద్వితీయావిభక్తిగా) ప్రయోగింపబడుచుండ, బ్రహ్మకు క్రియతో నెట్టి సంగతి కుదురదని చెప్పుటెట్లు అనెడు శంకయుద్భవించవచ్చును దానికి పరిహారమిది బ్రహ్మము విద్య అనే క్రియకు కర్మ యెంతమాత్రముకాదు ' అన్యదేవ తద్విదితాత్ అధో అవిధాతధి' (కేన) ఆ బ్రహ్మము తెలియబడిన కార్యము కంటె విలక్షణమే, ఇంకను తెలియబడని కారణము కంటెను భిన్నమే అనెడు శ్రుతివాక్యము బ్రహ్మమునకు విద్య - జ్ఞానే తెలియుట అనే క్రియకు కర్మత్వము నిషేధించుచున్నది మరియును "యేనేదం సర్వం విజానాతి తం కేనవిజానీయాత్ ?' (బృహ) దేనిచేత (ఏ బ్రహ్మముచేత) ఈ సర్వము నెరుగు చున్నాడో దానిని దేనిచేత తెలియనగును అని శ్రుతికూడ నిషేధించుచున్నది

పుట 170, పేరా 51 (ఆ) – ఆ విధముగానే ఉపాసనా క్రియకు బ్రహ్మము విషయముకాదని తెలియుచున్నది దీనికి మరి ప్రమాణములేవన—కేనోపనిషత్తులో "యద్ వాచానభ్యుదితం యేన వాగభ్యుధ్యతే" (కేన) ఏ వస్తువు వాగింద్రియముతో చెప్పబడదో, ఏ వస్తువుచే వాగింద్రియము బయల్వెడలుచున్నదో, నను శ్రుతి బ్రహ్మదేనికిని విషయము కాదని వివరించి, "తదేవ బ్రహ్మత్వం సిద్ధి నేదం యదిద ముపాసతే '-అట్టి బ్రహ్మము నీవేయని తెలిసికొనుము ఏ యీ పురోవర్తియగు వస్తువు నుపాసించుచున్నావో, ఆ యీ పరిదృశ్యమానమగు వస్తువు బ్రహ్మము కాదని

పుట 172, పేరా 51 (ఇ) - ఇచ్చట మరియొక శంక బయలుదేరుచున్నది బ్రహ్మ ముపాసనాదిక్రియలకు విషయముగానిచో పూర్వసూత్రములందు జెప్పబడిన శాస్త్రయోనిత్వము గూడ నసమంజసమగునేమో యనినచో

పుట 172 పేరా 51 (ఈ) - పరిహారము అటుల కాదు అవిద్యచే గల్పింపబడిన దేశ కాల వస్తు భేదములను దొలగించుటయే శాస్త్రముయొక్క తాత్పర్యము, విషయరూపములగు ఘట పటాదులవలె (కుండ, గుడ్డ మున్నగువానివలె) ఇదమిద్ధమని అనగా ఇదిగో బ్రహ్మమని ప్రతిపాదించుటకు శాస్త్రమిచ్ఛగించుట లేదు మఱి యింకేమనగ, స్వస్వరూపముచే విషయభావ మొందదని సర్వసాక్షిరూపమును బోధించుచు వేద్యము - వేదిత - వేదనము అను భేదమును ( తెలియ తగినది, తెలియువాడు, తెలిసి యనెడి త్రిపుటిని ) తొలగించుచున్నది త్రివిధ భేదములను బోగొట్టి సాక్షిస్వరూపమును సూచించుచున్నది ఇందుకు శ్రుతి వాక్యములేవన, 1 ' యస్య అమతం తస్య మతం, మతం యస్య న వేద సః - అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాతం అవిజానతాం ' (కేన) ఎవనికి బ్రహ్మము మనస్సునకు నవిషయమని నిశ్చయమో వానికి బ్రహ్మ తెలియబడినది ఎవనికి బ్రహ్మము మనసుచే జ్ఞేయమని నిశ్చయమో యట్టివాడు బ్రహ్మము నెఱుగడు బ్రహ్మము మనోగోచరమగునట్టిదని తెలిసికొన్నవారలకు బ్రహ్మ మవిషయంబగు ( తెలియబడనిదగు). బ్రహ్మము మనోగోచరముకాదని తెలిసినవారికి బ్రహ్మము తెలియబడెనని తెలియును.

(2) "నదృష్టేః ద్రష్టారం పశ్యేః, 'న విజ్ఞాతేః విజ్ఞాతారం విజానీయాః (బృహ) (దృష్టియొక్క ద్రష్టను (సాక్షియగు నాత్మను) దృష్టిచే జూడలేవు విజ్ఞానమును తెలిసికొనువానిని—అనగా బుద్ధివృత్తికి సాక్షియగు నాత్మను బుద్ధిచే దెలిసికొనలేవు) ఇట్టి శ్రుతులు పెక్కులు గలవు

పుట 174, పేరా 52 అవిద్యచే (అధ్యాసచే) గల్పింపబడిన సంసారిత్వమును దొలగించి నిత్యముక్తాత్మ స్వరూపమును శాస్త్రము బోధించుటవలన మోక్షమున కనిత్యత్వదోషము బ్రాప్తింపదు ఎవనికి మోక్ష ముత్పాద్య మని (పుట్టించుటకు యోగ్యత కలిగినదని) భావమో యట్టివాడు మానసిక వాచిక కాయిక మగు నేదియో కర్మచే మోక్షము గలుగునని సెప్పుట తప్పదు వికార్య మగునను నట్లే అట్లు మోక్ష ముత్పాద్యమనిగాని, వికార్య మనిగాని (జన్మాదులతో గూడిన షడ్వికారియనిగాని) తలచినచో నట్టి మోక్షమున కనిత్యత్వము ధ్రువంబగు లోకన్యాయముచే విచారించినచో వికార్యములగు దధ్యా దులుగాని (పాలు పెరుగగుట వికార్యము), ఉత్పాద్యము లగు ఘటాదులుగాని (మట్టినుండి పుట్టిన కుండ మూకుడు మున్నగునవి ఉత్పాద్యములు) నిత్యములుగా జూడబడుట లేదుకదా! ఇట్టి యుక్తిని పురస్కరించి వికార్యములు, ఉత్పాద్యములు మోక్షమును బొందజాలవని సిద్ధాంతము

పుట 174, పేరా 52 (ఆ) – బ్రహ్మరూపమగు మోక్షమునకు, ఆప్యత్వము (పొందదగిన యోగ్యత) ను

బట్టి కూడా కార్యాపేక్ష లేదు అనగా ఉపాసనాది కర్మాపేక్ష యుండజాలదు ఎందుకన, బ్రహ్మము సాధకుని యొక్క యాత్మస్వరూపమే యగుటవలన, బ్రహ్మమునకు కార్యాపేక్ష లేదు స్వరూపమునకు భిన్నమైనను బ్రహ్మము ఆకాశము వలె సర్వగత యగుటచేత సర్వప్రపంచముతో గూడినదై సర్వగతమగుటచేత నది ఆప్య మెన్నటికి కానేరదు అటులనే మోక్షము (బ్రహ్మము) నకు సంస్కార్యత్వముకూడ యుండుటకు వీలులేదు ఎందుకన, సంస్కార్యవస్తువునకు కూడ వృద్ధియో, దోషనివృత్తియో యుండవలయునుగదా! బ్రహ్మకు గుణదోషములు లేని హేతువుచే బ్రహ్మము (మోక్షము) సంస్కారము నపేక్షింపదు

పుట 176, పేరా 52 (ఇ) - మోక్షమునకు గుణాదాయక (వృద్ధిదాయక)ములైన సంస్కారములు ఘటింపవు. ఎందుకన, మోక్షము నిరతిశయ బ్రహ్మముగదా! అట్టి వస్తువునకు సంస్కారముచే గుణాతిశయము నాపాదించుట శక్యముగాదు అటులనే, దోషనివృత్తికై సంస్కారము గూడ బ్రహ్మమునకు వీలుపడదు ఏలయన, మోక్షరూపమగు బ్రహ్మము నిత్యశుద్ధత కలిగినదగుటచే, దోషనివృత్తికవకాశమే సంభవింపదు

పుట 176, పేరా 53 (అ) - పూర్వపక్షము మోక్షము స్వతస్సిద్ధముగా సిద్ధమైనను, అవిద్యచే ఆవరింపబడుచున్నదిగదా! కావున కర్మ, ఉపాసన, ధ్యాన మనాది క్రియాదులచే ఆత్మ సంస్కరింపబడినచో నిజరూపమభివ్యక్తమగును దీనికి నుదాహరణమేమన, శుద్ధమైన అద్దమును

మాలిన్యమావరింపగా నట్టి యావరణము నిఘర్షణక్రియచే (తెల్లగుడ్డతో రుద్దుటచే) తొలగగా భాస్వరత్వ ధర్మమును పొందును అట్లే అవిద్యావృతమైన బ్రహ్మము కర్మోపాసనాది క్రియచే సంస్కరింపబడగా భాస్వరత్వము నందు 'నని పూర్వ పక్షము దీనికి పరిహారమెట్లన, ఆత్మ క్రియాశ్రయముమాత్రము గాదు ఏ క్రియ దేని నాశ్రయించునో, ఆ క్రియ ఆ యాశ్రయ మున కెట్టి వికారము కలిగింపకుండ స్వస్వరూపమును బొంద నేరదు అనగా, ఆశ్రయమునకు వికారము కల్పింపక పోయినచో తాను క్రియ కానేరదు. ఆత్మ క్రియచే వికారింప బడినచో ఆత్మకు అనిత్యత్వము ప్రాప్తించి నాశప్రసంగము కూడ కలుగును ఇందుకు భగవద్గీతలో వాక్యము కలదు "అవికార్యోయ ముచ్యతే (ఆత్మ అవికారియని చెప్పబడు చున్నది) కావున ఆత్మకు నాశప్రసంగము ఎల్లరకు (అన్ని వైదిక మతములవారికి) అనిష్టమేకదా! కావున ఆత్మకు స్వాశ్రయక్రియ యెంతమాత్రము సంభవింపదు

పుట 178, పేరా 52 (ఇ) - వేఱొక వస్తువు నాశ్ర యించిన క్రియచే నాత్మకు సంస్కారము కలుగగూడదా యనినచో, అన్యాశ్రయమైన క్రియతో ఆత్మకు సంబంధము లేకపోవుటచే దానివలన నాత్మ కెట్టి సంస్కారము కలుగదు

పుట 178, పేరా 52 (ఈ) - పూర్వపక్షము, దేహ ముతో సంబంధించిన క్రియచే, అనగా స్నాన, ఆచమన, యజ్ఞోపవీతధారణాదిక్రియలచే, దేహికి (దేహధారునకు) సంస్కారము గన్పట్టుచున్నదిగదా! అటులే క్రియలచే నాత్మకు సంస్కారము కలుగుటయందు విరోధము లేదని యాక్షేపము ప్రవర్తించినచో

పుట 178 పేరా 52 (ఉ) - పరిహారము— ఈ నీ చెప్పిన సంస్కారము దేహాదులందు తాదాత్మ్యాది భావము గల నాత్మకు సంస్కారము గలుగునేమోగాని కేవల సాక్షి యగు నాత్మకు సంస్కారము కుదురదు అది యెట్లన స్నానాచమనాదులు దేహమునకు సంబంధించినవని ప్రత్యక్షముగా చూచుచున్నాముగదా! అట్టి క్రియలచే దేహమునం దజ్ఞానవశమున తాదాత్మ్యాభిమానము జెందినవానికే సంస్కారము కుదురగలదు మఱియు దేహమునకు సంబంధించిన చికిత్సచే ఆదేహ మాత్మగా నభిమానించు వానికి, నే నరోగినని మఱియు యజ్ఞోపవీతధారణాదులచే "నేను శుద్ధుడను, సంస్కృతుడను' అనియెడి బుద్ధి యెవనికి కలుగుచున్నదో వాడే సంస్కరింపబడుచున్నాడు 'అహం' యను నభిమానముచెంది 'నేను కర్త''నను అహంప్రత్యయమునకు విషయమైన వానికే సమస్తవైదిక లౌకిక సంస్కారములు వర్తించుచున్నవి అనగా దేహముతో తాదాత్మ్యము పొందినవానికే చికిత్సాదులు, సంస్కారములు, పరిహారములు ఇత్యాదులు సంభవించుచున్నవి మఱియు వాని ఫలములనుకూడ ననుభవించుచున్నాడు

పుట 180 పేరా (1) "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్ అన్యః అభిచాకశీతి" (ముండక) (వారిలో (జీవాత్మ పరమాత్మలలో) జీవాత్మ కర్మఫలమును మనోహరముగా భుజించుచున్నాడు. అన్యుడైన పరమాత్మ భుజింపక కేవలము ప్రకాశించుచున్నాడు—అని ముండకోపనిషద్వాక్యము)

(2) "ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుః మనీషిణః (కఠ) (దేహేంద్రియ మనస్సులతోఁగూడిన అనగా వీనిచే సంహతమైన ఆత్మను "భోక్త" యని విద్వాంసులు బల్కుచున్నారు)

(3) "ఏకో దేవః సర్వభూతేషు గూఢః, సర్వవ్యాపీ, సర్వభూతాంతరాత్మా కర్మాధ్యక్షః, సర్వభూతాధివాసః, సాక్షీ చేతా కేవలః, నిర్గుణశ్చ (శ్వేత) పైన సంహత భావమును జెప్పి యిక పరమాత్మకు అనాధేయ, అతిశయ నిత్యశుద్ధత్వమును ప్రదర్శించు శ్వేతాశ్వర శ్రుతిని జూపుచున్నాడు అది యేమన ఒకడే దేవుడు, సర్వభూతములందు గూఢముగా నున్నాడు సర్వజీవుల సర్వకర్మలకు ప్రభువై సర్వభూతములందు చక్కగా నివసించుచున్నాడు ఇతడే సాక్షి, చేతనుడు (జ్ఞానసంపన్నుడు), కేవలుడు, నిర్గుణుడు కూడ

(4) "స పర్యగాత్ శుక్రం, అకాయం, అవ్రణం, అస్నావిరం శుద్ధం, అపాపవిద్ధం" (ఈశ) ఆ పరమాత్మయే యంతటను నిండియున్నాడు, శుక్రుడై (జ్యోతిస్స్వభావము గలవాడై), అవ్రణుడై (దుఃఖరహితుడై), అస్నావిరుడై (నరములు మున్నగు దేహాంగములు లేనివాడై), శుద్ధుడై పుణ్యపాపములు లేనివాడై యున్నాడని ఈశావాస్య శ్రుతి గలదు.

ఈ రెండు మంత్రములు, అనాధేయాతిశయత్వమును నిత్యశుద్ధత్వమును బ్రహ్మకు సూచించుచున్నవి కావున మోక్షము సంస్కార్యముగాదు ఏవిధమైన క్రియతో

సంబంధము ఏవిధముగను ప్రతిపాదించుటకు శక్యముగాదు కావున కేవలము జ్ఞానమును వదలి క్రియతో మోక్షమునకు సంబంధము యుక్తముగాదు అనగా లేశమాత్రమయినను క్రియతో సంబంధము కల్పించుట ఆక్కరకు కుదురని పని

పుట 182, పేరా 54 (అ) - పూర్వపక్షము "జ్ఞానమన మానసక్రియగదా! అట్టి స్థితిలో క్రియచే (అద్వైత వాదమందు) మోక్షము కలుగదనుటెట్లు ?"

పుట 182 పేరా 54 (ఆ) - పరిహారము అటుల కాదు మానసిక క్రియారూపముగ జ్ఞానము తోచినను విధిచోదితమగు క్రియకంటె జ్ఞానము విలక్షణమై యున్నది క్రియ యనగా వస్తురూపముతో నిమిత్తము లేకుండా విధింపబడునది అనగా ఉపాసనలో ధ్యానింపబడువస్తు వొకటి (దేవతయొకటి) మరియు ధ్యానకాలములో మనస్సు కుదురుటకుగా నేర్పరచుకొనబడెడు ఆలంబనవస్తు వొకటి (విగ్రహాయంత్రాదులు) ఉపాసనవిధు లీ వస్తువులు 'ఇట్టివి, అట్టివి' యని భేదమును జెప్పవు 'ఇదియే యదిగా ధ్యానింపు' మని మాత్రము సెప్పును అటులచేయు ధ్యానము మానసక్రియయే అట్టి క్రియ పురుషుని చిత్తవ్యాపారములకు లోబడియుండును అదెట్లనగా, ఏ దేవతకొరకు ద్రవ్యము తీసుకొనబడుచున్నదో, ఆ దేవతనుగూర్చి 'వషట్' యని పల్కుచు ధ్యానముచేయవలెను. వీనికి ఐతరేయ బ్రాహ్మణము నందు "సంధ్యాం మనసా ధ్యాయేత్" (సంధ్యా

దేవతను మనస్సుచే ధ్యానింపవలయును ) అనెడు తార్కాణము గలదు 'ధ్యానము, 'చింతనము అనెడి మనస్సుతో జేయబడు క్రియయేయైనను పురుషునిచే జేయబడుటకు గాని, మానుటకుగాని, వేరొకరీతిగా జేయుటకుగాని శక్యమగుటచేత ధ్యానము పురుషుని యధీనమై యున్నది

పుట 184, పేరా 54 (ఇ) – జ్ఞానము మాత్రము ప్రత్యక్షాది ప్రమాణములవలన బుట్టుచున్నది ప్రమాణము వస్తుస్వరూపమెటులున్నదో యట్లే గోచరింపజేయగలదు కావున 'జ్ఞానము చేయబడుటకును మానివేయబడుటకును మరొకవిధమున జేయబడుటకును శక్యమై తమాత్రమును గాజాలదు జ్ఞాన మనునది వస్తుతంత్రమే చోదనాతంత్రము గాదు పురుష తంత్రముగాదు కావున జ్ఞానము మానసిక క్రియయే యైననూ గొప్ప భేదము గన్పట్టుచున్నది

పుట 184, పేరా 54 (ఈ) - పై భేదము సూచించు తార్కాణము వేదాంతములందు జెప్పబడుచున్నది పంచాగ్నివిద్యయందు పురుషుడే అగ్నియనియు, స్త్రీయే అగ్ని యనియు భావనచేయవలయునను యుపదేశముచే స్త్రీ పురుషులందు మానసికమగు నగ్నిబుద్ధి చోదనాజన్యమగుట చేత, మానసిక బుద్ధ్యధీనమగుటచే నది 'క్రియ' యే యైయున్నది ప్రసిద్ధమైన యగ్నియందు నగ్నిబుద్ధి కూడ మానసికమే యైననూ, యట్టిది చోదనాతంత్రమును పురుష తంత్రమునుకాక వస్తువగు అగ్నియధీనమగుటవలన వస్తుతంత్రమైన జ్ఞానమగునుగాని క్రియ యెంతమాత్రము గానేరదు కావున సమస్తప్రమాణములచే ( ప్రత్యక్ష, అనుమాన, శబ్ద, ఉపమాన, అర్థాపత్తి, అనుపలబ్ధి ఇత్యాది

(ప్రమాణములచే) తెలియబడు సర్వవిషయముల గూర్చియు, ఇటులనే తెలిసికొనవలయును

పుట 186, పేరా 54 (ఉ) - పై తెల్పిన న్యాయ బలముచే సిద్ధవస్తువగు బ్రహ్మమనెడి యాత్మతో సంబంధించిన జ్ఞానము వస్తుతంత్రమేగాని చోదనాతంత్రముగాదు. శాస్త్రముచే నియమింపదగిన విషయము లేకపోవుటవలన ఆత్మజ్ఞానవిషయమందు లిఙ్ లోట్ తవ్యత్ ప్రత్యయము లన్నియు వ్యర్థములగుచున్నవి (కుర్యాత్, కురు చేయుము) అనునది లిఙ్ లోట్ రూపము 'కర్తవ్యం' (చేయవలసినది) అనునది తవ్యత్ ప్రత్యయరూపము అది యెటులన, రాళ్ళమీద నుపయోగింపబడిన కత్తియొక్క వాడితనము వలె నిరుపయోగమై హేయోపాదేయము కానట్టి సిద్ధవస్తు విషయకమగుటవలన చోదనాతంత్రమంతయు నిరుపయోగ మగుచున్నది

పుట 186, పేరా 55 (అ) - ఇచ్చట శంక యొకటి పొడసూపుచున్నది "ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యః, మంతవ్యః, నిదిధ్యాసితవ్యః" అనెడి శ్రుతియందు విధిని బోలియున్న వాక్యముల గతియేమి అను విచారణ మావశ్యక మగుచున్నది

పుట 186, పేరా 55 (ఆ) - ఈ శంకాపరిహార మెటులన, ఇట్టి విధి ఛాయా' వాక్యములకు కొంచెము ప్రయోజన మున్నది స్వాభావసిద్ధమగు ప్రాపంచిక ప్రవృత్తికి కారణ భూతములగు విషయములనుండి పురుషబుద్ధిని మరలించుటయే యిట్టి వాక్యముల ప్రయోజనము

పుట 188 పేరా 55 (ఇ) - ఏ పురుషుడైతే బాహ్య విషయములందు ప్రవర్తించువాడై 'నాకిష్టమైనది కలుగవలయును, అనిష్టమైనది కలుగగూడదను నభిలాషతో కార్యము సలిపి బాహ్యవిషయములందు పుష్కలమగు పురుషార్థమును బొందజాలక పరమపురుషార్థము నెచ్చట లభించునని తీవ్రముగ నన్వేషించునో వానిని శబ్దాది విషయములనుండి విముఖునిగాజేసి "ఆత్మా వారే ద్రష్టవ్యః" ఇత్యాది వాక్యముల ప్రత్యగాత్మ చింతనమును ప్రవర్తింపజేయుచున్నవి

పుట 188, పేరా 55 (ఈ) - ఇట్టి యన్వేషణమును గూర్చి ప్రవర్తించు జిజ్ఞాసువునకు హేయోపాదేయరహితమగు ఆత్మతత్త్వము నుపదేశించు శ్రుతులేవన

1 "ఇదం సర్వం యదయ మాత్మా (బృహ)

2 "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ తత్ కేన కం పశ్యేత్ ? కేన కం జిఘ్రేత్ ? కేన కం విజానీయాత్ ? విజ్ఞాతారమరే, కేనవిజానీయాత్ ? (బృహ)

3. అయ మాత్మా బ్రహ్మ (బృహ)

(1 ఈ సర్వమంతయు ఆత్మయే, 2 ఏ స్థితియందితనికి సర్వ మాత్మపదార్థమాయెనో ఆ సమయమున ఎవ్వడే సాధనముతో దేనిని చూచును ? ఏ సాధనముతో దేనిని వాసన చూచును ? దేనితో దేనిని తెలిసికొనును ? సర్వము తెలిసికొనువానిని ఓమైత్రేయీ ! దేనితో తెలియ నగును ? 3. ఈ ఆత్మ (బ్రహ్మయే) ఇట్టి శ్రుతులచే హేయోపాదేయరహితమగు నాత్మతత్త్వ ముపదేశింపబడుచున్నది.

పుట 190 పేరా 56 (అ) - ఇచ్చట నొక శంక యున్నది పై శ్రుతులచే నుపదేశింపబడు కర్తవ్యప్రధానముగాని ఆత్మవిజ్ఞానము హేయము కాదు ఉపాదేయము కాదుగదా, అని

పుట 190 పేరా 56 (ఆ) - పరిహారము ఆత్మ కేవల జ్ఞానస్వరూపముగా నెరుగబడుచున్నది అనగా, హేయము (పాపకార్యము) గాని ఉపాదేయము (పుణ్యకార్యము) గాని కాదు ఇదియే మా యద్వైతులకు ప్రీతికరము (అలంకారము) అనగా, ఆత్మ బ్రహ్మయే యను జ్ఞానము కలుగగా కర్తవ్యత తొలగును కృతకృత్యత కలుగును ఇవి బ్రహ్మజ్ఞానమున కలంకారములై యున్నవి ఇందుకు శ్రుతి స్మృతి వాక్యము లేవన

(1) 'ఆత్మానం చేత్ విజానీయాత్ అయ మస్మీతి పూరుషః కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్'' (బృహ) (నేను ఈ పరమాత్మనైతినని యెప్పుడు పురుషుడు స్వస్వరూపమును తెలుసుకొనునో, అప్పు డీ శరీరముతో నెవని ప్రీతికొరకు తాదాత్మ్యనుజెంది తపించును ?) బ్రహ్మ జ్ఞాని కాయక్లేశరూపమగు కర్మలగూర్చి తపింపడని భావము

(2) '' ఏ తత్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్
కృతకృత్యశ్చ భారత (15-20 గీత)

(2) భారతవంశీయుడా ! ఈ బ్రహ్మమును తెలిసి కొని బుద్ధిమంతుడు పొందవలసినదానిని పొందినవాడును అగుచున్నాడు. )

కావున నుపాసన విధితో సంబంధించిన బ్రహ్మ సమర్పణ కుదురదు అనగా, స్వతంత్రముగనే బ్రహ్మ బోధింపబడుచున్నదని భావము

## తృతీయ వర్ణకము

పుట 190, పేరా 57 (అ) - ఈ వర్ణకమందు ప్రాభాకరీయుల పూర్వపక్షము దాని పరిహారమును చెప్పుచున్నారు కుమారిలభట్టు తరువాత ప్రభాకరమిశ్రుడను పూర్వమీమాంసకుని అనుయాయులను ప్రాభాకరీయులందురు. వారి యొక్క యాక్షేపణము ( పూర్వపక్షము ) ఇట్లున్నది "(1) ప్రవృత్తి విధులను సత్యంవద ధర్మంచర' 'యావజ్జీవం అగ్నిహోత్రం 'జుహుయాత్ అనెడి వాక్యములును, (2) నివృత్తివిధులను (నానృతం వదేత్ నపరదారాంగచ్ఛేత్) ఇత్యాది (3) విధి నిషేధములకు అంగములుగా నుండువానిని వేదము చెప్పునుగాని, అందుకు వ్యతిరేకముగా కేవల వస్తువును బోధించునట్టి వేదభాగము లేనేలేదు అని పూర్వపక్షము

పుట 192 పేరా 57 (ఆ) - పరిహారము అది సరిగాదు ఉపనిషత్తులందుపదేశింపబడిన పురుషుడు కర్మాంగముకాక స్వతంత్రముగనే యుపదేశింపబడు చున్నాడు ఇట్టి యౌపనిషదుడైన పురుషుడు అసంసారి, మరియు బ్రహ్మస్వరూపుడు (నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావుడు), మఱియును ఉత్పాద్యాదులగు నాలుగు ద్రవ్యములకంటె భిన్నమైనవాడు ఉత్పాద్యాదులనగా పూర్వము వర్ణింపబడిన ఉత్పాద్య వికార్య ఆప్య సంస్కార్యములను నాలుగు రకములగు ద్రవ్యములు (పేరా 52 నందు

విపులము చేయబడినది ) ఇట్టి పురుషుడు వేదాంతములందు గాక ఇతర స్థలములందు లభింపడని యట్టి పురుషుడు లేడని కాని, తెలియబడడనిగాని చెప్పుట కెంతమాత్రము వీలు లేదు మరియు నుపనిషత్తులందు జెప్పబడుచున్న పురుషుడు (అనగా ఆత్మ) 'ఇదికాదు' 'ఇదికాదు అని సర్వదృశ్య విషయములను నిషేధించుచు శ్రుతియందు 'ఆత్మ' శబ్దముచే దెలియవచ్చుచుండుటవలన ఆత్మను నిరాకరించుటకు నెంత మాత్రము శక్యముగాదు 'స ఏష నేతినేత్యాత్మా' (బృహా) ఇటుల సర్వమును నిషేధించు నిరాకర్తయే "ఆత్మ యగుటంజేసి సర్వనిషేధ అవధి భూతముగా తా నలరారు చుండుటవలన, తన్ను దాను నిషేధించుకొనుట నెక్కడ గానము కాన ఆత్మ యెంతమాత్రము నిషేధింపబడక స్వయంప్రకాశమానముగా నిలచియున్నది

పుట 194, పేరా 57 (ఇ) - ఇక్కడ శంకయొకటి పొడముచున్నది 'ఆత్మ అహం ప్రత్యయమునకు విషయ మగు వస్తువగుటంజేసి—అనగా, ప్రతివాడును 'నేను నే'నని అపరోక్షముగా తనను తెలిసికొనుటచే, ఆత్మపదార్థము ఉపనిషత్తుల చేతనే తెలియబడుచున్న దనుట ( శాస్త్ర నియోనిత్వాత్ అను సూత్రమున ) ఎట్లు సమంజసంబగు ? ( ఇది పూర్వపక్షము )

పుట 194 పేరా 57 (ఈ) - శంకాపరిహారము ఈ నీ శంక సరియైనదిగాదు ఏలన అహం ప్రత్యయమునకు విషయమగు కర్త దేహేంద్రియ సంఘాతముతో గూడు కొనిన జీవాత్మయై యున్నాడు కాని ఆత్మమాత్రము అట్టి జీవాత్మకు సాక్షిరూపమున నుండుటచే ఆత్మకు 'అహం'

ప్రత్యయ విషయత్వము నిరాకరింపబడుచున్నది అహం ప్రత్యయ విషయకర్త వాస్తవముగా ఆత్మకాదు అట్టి వాస్తవమగు ఆత్మ యుపనిషత్తులవలననే తెలియవచ్చెడి పురుషుడు కాన అహం ప్రత్యయ విషయమగు కర్తగాని, కర్మకాండయందు తెలియవచ్చెడి పురుషుడుగాని, వేరొక విధముగా నైయ్యాయికాది యుక్తిదర్శనములందు ప్రకటింప బడిన పురుషుడుగాని ఉపనిషత్పురుషుడు కాడు ఇతడు కేవలము ఉపనిషత్తులవల్లనే గోచరించును ఇతడు సర్వమున కాత్మస్వరూపుడు

పుట 194, పేరా 57 (ఉ) - ఈ ఉపనిషత్పురుషుడు జగత్తునకు ఆత్మయగు స్వరూపమగుటచే నెవ్వరికి త్రోసి పుచ్చుటకుగాని లేక విధికి అంగముగా నిరూపింపబడుటకు గాని శక్యముగాదు సమస్తప్రాణులకు నాత్మయగుటంజేసి హేయముగాని, ఉపాదేయముగాని యగుటకు వీలులేదు లోకమందలి నశించునట్టి వికారసమూహమంతయు పురుషుని పర్యంతము నశించి తీరును పురుషుడటుల నశించుటకు గారణము లేమింజేసి "అవినాశి" యగుచున్నాడు పురుషుడు విక్రియరహితుడగుటచేత, 'కూటస్థనిత్యు' డనబడు చున్నాడు అందుచేతనే పురుషుని నిత్యుడనియు, శుద్ధుడనియు, బుద్ధుడనియు, ముక్తస్వభావుడనియు చెప్పట జరుగుచున్నది ఈ విషయమును నిర్ధారించు శ్రుతులేవన,

(1) "పురుషాన్నపరం కించిత్
సా కాష్ఠా సా పరాగతిః" (కఠ)

పురుషునికంటె శ్రేష్ఠమయిన దెద్దియును లేదు. అతడే సర్వమునకు పరమావధి అతడే గమ్యస్థానము

(2) 'తం త్వౌపనిషదం పృచ్ఛామి (బృహా)'

ఉపనిషత్తులందు దెలియవచ్చెడి పురుషునిగురించి అడుగుచున్నాను ఇచట ఔపనిషదత్వ విశేషణము ఉపనిషత్తులందు పురుషుడు ప్రధానముగా దెలియబడునపుడే యుపపన్నమగును

పుట 196, పేరా 57 (ఊ) – కావున సిద్ధవస్తుబోధకమగు భాగము వేదమందు లేదని చెప్పుట సాహసమాత్రమగును అనగా యుక్తిరహితమును, శాస్త్రదూష్యము నగునని అభిప్రాయము పూర్వమీమాంసకులు "వేదమంతయు క్రియాపర మని చెప్పుచు కర్మను బోధించుటయే శాస్త్రముయొక్క అర్థమనుట ధర్మజిజ్ఞాసకు సంబధించిన దగుటచే జేసి విధిప్రతిషేధశాస్త్రములను దృష్టిలో నుంచుకొని చెప్పబడినదిగా గ్రహించవలయును

పుట 198, పేరా 57 (ఋ) – మఱియు జైమినియ సూత్రములలో జెప్పబడిన క్రియార్థత్వమే వేదమునకు ముఖ్యమని క్రియార్థత్వములేని వాక్యము లనర్థకములని ముఖ్యముగా గ్రహించువారలకు, సిద్ధవస్తువును గురించి (బ్రహ్మమును గురించి) చెప్పబడు వాక్యములకు ఆనర్థక్యము ప్రాప్తించును

పుట 198 పేరా 58 (అ) – పూర్వపక్షము : 'ప్రవృత్తి నివృత్తి విధి తదంగములకంటె భిన్నముగ పెద్ద వస్తువు (బ్రహ్మము) ఉప దేశింపబడినను అది కర్తవ్యము

త్మైన క్రియలకు అంగముగానే చెప్పవలయునుగాని కూటస్థ నిత్యునిగురించి యుపదేశింపవు" అనెడి శంకగల్గినచో,

పుట 198, పేరా 58 (ఆ) - ఆ శంకకు వేదాంతి ఎదురుప్రశ్న చేయుచున్నాడు అదేమన, "నీ వట్లు చెప్పుట యందు విశేషమేమి? సిద్ధవస్తువునుగురించి చేసిన యుపదేశము క్రియకాదుగదా?" దీనికి పూర్వపక్షి సమాధాన మిట్లియ్యవచ్చును (ఇ) భూతవస్తువు అనగా బ్రహ్మము క్రియ కాకపోయినను, క్రియకు సాధనమగుట వలన బ్రహ్మోపదేశము క్రియార్థమే యగుచున్నదిగదా!" అనుచో

పుట 198 పేరా 58 (ఈ) - దీనికి అద్వైత సిద్ధాంతి పరిహారము సెప్పుచున్నాడు నీవు చెప్పునది యొక దోషము కాదు భూతవస్తువు క్రియలకొరకు పదేశింపబడినను క్రియను నిర్వర్తింపగలశక్తితోగూడిన వస్తువు లుపదేశింపబడినవని తప్పక చెప్పవలసినదై యున్నది అనగా, అట్టి వస్తువునకు ప్రయోజనమేమన, క్రియను నిర్వహించుటయే ఇంతమాత్రముచే వస్తువుపదేశింపబడలేదని చెప్పుట యుక్తముకాదు వస్తువునకు (బ్రహ్మకు) క్రియతో ప్రయోజనమున్నంత మాత్రమున క్రియతో సంబంధమున్నను లేకపోయినను వస్తువుపదేశింపబడుటకు ప్రతిబంధమెంతమాత్రమును లేదు

పుట 200, పేరా 59 (అ) - పూర్వపక్షము "కర్మతో సంబంధము లేకుండగా బ్రహ్మ ముపదేశింపబడుగాక అద్దానితో నీకేమి ప్రయోజనము?' అని

పుట 200, పేరా 59 (ఆ) - పరిహారము క్రియలందు ప్రయోజనముల బడయునట్టి భూతవస్తువుల నుపదేశించిన

విధముననే, పొందబడని ఆత్మరూపమగు భూతవస్తువుయొక్క యుపదేశముకూడ ప్రయోజనకారియగు క్రియాసాధన వస్తూపదేశమువలన నెట్లు ప్రయోజనము ఘటించుచున్నదో, యట్లే ఆత్మోపదేశమువలన ఆత్మవస్తువును పొందుటచే సంసారహేతువగు మిథ్యాజ్ఞాన నివృత్తి యనెడి ప్రయోజనము లభించుచున్నది కాన, వేదమందు సిద్ధవస్తూపదేశము (బ్రహ్మోపదేశము) సప్రయోజనమే కాని నిష్ప్రయోజనము గాదు మరియును, కర్మకాండయందు 'బ్రాహ్మణుడు చంపదగడు అనునట్టి నివృత్తి నుపదేశించు వాక్యములుగూడ గలవు

పుట 202, పేరా 59 (ఇ) - శంక ''బ్రాహ్మణుడు చంపదగడు' అనువాక్యముచే బోధింపబడు నివృత్తి, క్రియ కాదు క్రియాసాధనముకూడ కాదు కాన నట్టి యుపదేశ మనర్థకమగుచున్నది అని శంకించినచో

పుట 202, పేరా 59 (ఈ) - పరిహారము 'బ్రాహ్మణుడు చంపదగడు' అనునట్టి వాక్యముల కానర్థక్యము ప్రాప్తించుచున్నదిగదా! అట్టి అనర్థక్యము సర్వుల కనిష్టమేకదా! కాబట్టి వేదప్రామాణ్య మంగీకరించువారు వేదమందలి నివృత్తివాక్యమందు "నఞ్" ప్రత్యయము క్రియార్థపదములకు చేర్చినప్పుడు అనగా "నహంతవ్యః", చంపదగడు' అని యర్థము వచ్చినప్పుడు, "చంపవద్దు" అనగా "కొట్టవచ్చును తిట్టవచ్చును" అను నితరక్రియా కార్యములను సూచించుచున్నదనుట విరుద్ధార్థమునకు త్రోవ

తీయును కావున హననక్రియకంటె భిన్నమగు ( తాడన క్రియ నిందన క్రియ) మరొక క్రియార్థము సూచించుచున్నదనుట చెల్లదు చంపునట్టి కార్యమునందే యుదాసీనతను ఉత్కృష్టముగా చెప్పవలెను 'నఞ్'అను ప్రత్యయమునకు స్వభావసిద్ధమగు అర్థమేమన, ఏది యద్దానితో సంబంధించునో, అద్దాని లేమిని మాత్రమే బోధించుచుండును అది కర్తను కర్తవ్యతనుండి మరల్చుచున్నది ఆ అభావబుద్ధికూడ తసంతటతానే యుపశమించును ఏలన, కట్టెలు కాలుచూ కాలుచూ చివరకు తమంతటతామే ఉపశమము నొందును అటులనే "బ్రాహ్మణో నహంతవ్యః మున్నగు ప్రదేశములందు 'నఞ్' కి ప్రసజ్యప్రతిషేధార్థమే గ్రహింపబడి రాగతః ప్రసక్తమగు హననాది క్రియలనుండి నివృత్తిరూపమగు ఔదాసీన్యమే ముఖ్యాభిప్రాయమందు నిశ్చయింపవలెను

( ఈ విచారమంతయు 205-వ పేజీలో చదువుకొనవలెను )

పుట 206, పేరా 60 (అ) - పూర్వపక్షము కర్తవ్యరూపమైన విధితో సంబంధములేని యర్థవాదవాక్యములకు అప్రమాణ్యముకాని, ప్రయోజనముగాని లేదని చెప్పబడినదిగదా! అటులనే ఏడు ద్వీపములుగలది భూమి" అని చెప్పుటచే ప్రయోజనమేమి కలదు? అటులనే సిద్ధవస్తుమాత్రమును చెప్పుటచే ప్రయోజనమేమి అని పూర్వపక్షియొక్క యభిప్రాయము

పుట 206, పేరా, 60 (ఆ) - పరిహారము మీ యాక్షేపణ వెనుకనే త్రోసివేయబడినది "ఇది త్రాడు కాని ఇది సర్పముకాదు" అని వస్తుమాత్ర కథనముచే

కూడ ప్రయోజనము కన్పట్టి భ్రాంతునకు భయము నివృత్త మగుటచే, సిద్ధమైన వస్తువుయొక్క ధనముకూడ ప్రయోజన కారి యగుచున్నది

పుట 206, పేరా 60 (ఇ) - శంక మీరు చెప్పిన యుపమాన సామ్యము ఉపమేయమందు గన్పట్టుటలేదు నివృత్తిరూపములైన వేదాంతవాక్యములను శ్రవణముచేసిన వారికికూడ పూర్వమువలెనే సంసారిత్వము లోకమందు కన్పట్టు చున్నది కావున రజ్జుస్వరూప కథనమువలె, వస్తుమాత్ర కథనము ప్రయోజనకారి కాదుగదా!

పుట 206, పేరా 60 (ఈ) - పరిహారము ఇచట చెప్పబడుచున్నది బ్రహ్మాత్మభావము తెలిసికొనినవానికి పూర్వమువలె సంసారిత్వమున్నదని చెప్పుటకు వీలులేదు వేదప్రమాణముచే గలిగిన బ్రహ్మాత్మభావమునకు, సంసారిత్వ మునకును చాల విరోధముగలదుగదా! శరీరాదులందు ఆత్మయను నభిమానముగలవానికి దుఃఖభయాదికము కన బడుచున్నదికదా యని, వానికే వేదప్రమాణజనిత బ్రహ్మాత్మభావము కలుగగా, శరీరాదులం దభిమానము నశింపగా నతనికి పూర్వమునందువలె మిథ్యాజ్ఞాన నిమిత్త మైన దుఃఖభయాదులు గలవని కల్పించుటకు శక్యముగాదు. ఈవిషయములో పూజ్యపాద శంకరులు రెండు దృష్టాంతవ ముల నిచ్చిరి (1) ఒకానొక గృహస్థుడైన ధనికునకు ధనాభిమానికి ధననష్టమైనప్పుడు దుఃఖము కనబడుచున్నది గదాయని, వానికే వైరాగ్యముచే సన్యసించిన వానికి ధనాభి మానము లేనివానికి, ధనాపహార నిమిత్తమగు ఆ దుఃఖము

కలుగనేరదు (2) కుండలములను ధరించి కుండలిత్వాభిమానము గలవానికి సుఖము కనబడుచున్నదిగదా యని వానికే కుండలముల వీడి కుండలిత్వాభిమానరహితమైన వానికి కుండలిత్వమువలన కలుగు సుఖము కలుగదుగదా ! ఈ దృష్టాంతమువలన నివృత్తివాక్యములచే ప్రయోజనమున్నదని ధ్రువమగుచున్నది దీనినే చెప్పు శ్రుతి యొకటి కలదు "అశరీరం వా వసంతం నప్రియాఽప్రియే స్పృశతః" (ఛాం) శరీరము లేని (శరీరమందభిమానము లేని) ఆత్మజ్ఞానిని సుఖదుఃఖములు (ప్రియాప్రియములు) అంటవు దీనివలన శరీరాభిమానమే సుఖదుఃఖ కారణమని తేలుచున్నది

పుట 208 పేరా 61 (అ) - ఆక్షేపము "శరీరపాతానంతరము (మరణానంతమున) అశరీరత్వము సిద్ధించును గాని జీవించియుండగనే 'అశరీరత్వము' సిద్ధింపనేరదుగదా ! '

పుట 208, పేరా 61 (ఆ) – సిద్ధాంతి సమాధానము అది సరిగాదు శరీరాభిమానమునకు మిథ్యాజ్ఞానమే కారణము మిథ్యాజ్ఞానరూపమగు అజ్ఞానము హేతువుగా గలది గావున (రజ్జు సర్పమగునట్లు), వాస్తవముగా దేహము లేనే లేదు (వాస్తవముగా సర్పము లేని యట్లు భావించినచో సర్పాభావము కలుగును అటులనే దేహముకూడ) దేహమున్నది యనుట భ్రాంతిమూలకమగును ఆత్మకు సశరీరత్వమునకు మిథ్యాజ్ఞానము తప్ప మరియొక కారణమును కల్పించుట శక్యముకాదు మరియు, 'అశరీరత్వము' కర్మజన్యముకాదు కావున నిత్యము అది స్వాభావికమైనదే యని ఇదివరలో చెప్పబడినది

పుట 210, పేరా 61 (ఇ) - శంక "సశరీరత్వము మిథ్యాజ్ఞాన నిమిత్తకముగాక ధర్మాధర్మముల వలన కలుగుచుండును ధర్మాధర్మములు నశింపకుండగా 'అశరీరత్వము ప్రాప్తింపచాలదు'

పుట 210, పేరా 61 (ఈ) - పరిహారము అట్లుగాదు ఆత్మకు శరీరసంబంధము లేదు ధర్మాధర్మములు ఆత్మకృతములుగావు ఈ నీ శంక పరస్పరాశ్రయ దోషగ్రస్తము ఇందు అంధపరంపరాన్యాయము గోచరించుచున్నది అనగా ఆత్మకు శరీరసంబంధము లేకుండా ధర్మాధర్మములు కుదురవని ధర్మాధర్మములు లేకుండా శరీరము ప్రాప్తింపదని చెప్పుటచే పరస్పరాశ్రయ దోషము (పెండ్లి కుదిరినగాని పిచ్చి కుదురదు, పిచ్చికుదిరినగాని పెండ్లికాదని చెప్పినట్లు) ప్రాప్తంచును ఆత్మకు శరీరసంబంధము అనాదినుండి యున్నదను కల్పన అంధపరంపరను పోలియున్నది ఆత్మమాత్రము నిష్క్రియమగుటచేత నది క్రియతో నెన్నడును సంబంధము పొందదు కావున ఆత్మకు కర్తృత్వము కలుగదు అట్టిదానిచే ధర్మాధర్మముల నాచరించుటయు, తిరిగి ఆ ధర్మాధర్మములచే శరీరము కలుగుటయు యనెడి వ్యావహారిక వాదము నెంతమాత్రము వేదాంతములందు సమంజసముకాదు

పుట 210, పేరా 61 (ఉ) - శంక "లోకములో భృత్యులచే చేయుబడు క్రియలయందలి గుణదోషముల కర్తృత్వము సన్నిధి గతుడగు (ప్రక్కన కూర్చున్నవాడైన, రాజునం దెటుల నంటగట్టబడుచున్నదో, అటులనే శరీర ఇంద్రియ, అంతఃకరణాదులచే జేయుబడు క్రియలందలి

కర్తృత్వము సన్నిధానమాత్రముచే నాత్మయందు దెలియ బడుట యనగా ఆత్మకంటగట్టుట సమంజసమేగదా ! ”

పుట 210 పేరా 61 (ఊ) – పరిహారము నీవు చెప్పిన యుపమానము సరిగాదు రాజులందు భృత్యులందు, సేవకులందు, ధనదానాది సంబంధము గలిగినవారియందు చెల్లునుగాని యట్టి సంబంధము లేనటువంటి యాత్మకు శరీరాదులందు నట్టి యుపమానము కల్పించుట తగని పని ధనదానాదులచే సంపాదితమైన (అనగా కూలియిచ్చుట పనిచేయుట మున్నగు) సంబంధము కలవారలకుటచే భృత్య కర్తృత్వము రాజకర్తృత్వముగా గల్పించుట యుక్తమే అచ్చట స్వస్వామి భావసంబంధము గలదు ధనదానాది సంబంధము కలదు ఇట్టి ధనదానాదికమువంటి సంబంధ మేమియు ఆత్మకు, శరీరాదులకు లేమిచే నీ యుపమాన మనుప పన్నము మిథ్యాభిమానమే సంబంధహేతువు

పుట 212 పేరా 62 (అ) – ఈ పై వాదముచే నాత్మకు దేహేంద్రియాదులతో సంబంధ మెటుల మిథ్యాభిమాన కల్పితమో, యటులనే యజ్ఞయాగాదులందు యజమానునికి కర్తృత్వముకూడ మిథ్యాభిమాన కల్పితమే యని నిశ్చయింప నగును

(ఆ) పూర్వపక్షము “దేహాదులకన్న భిన్నమగు నాత్మకు, తనదగు దేహాదిక మందున్న యభిమానము గౌణమేకాని మిథ్యకా’దని పూర్వపక్షము ప్రాప్తించగా,

పుట 212, పేరా 62 (ఇ) – ఈ పూర్వపక్షము సరియైనదిగాదు. గౌణత్వ ముఖ్యత్వ వ్యవహారము వస్తువుల

యొక్క భేదమును చక్కగా గ్రహించినపుడే ప్రసిద్ధమగు చున్నది ఎవనికైతే వస్తుభేదముండునో వానికి ముఖ్యార్థ ప్రయోగమని, గౌణార్థప్రయోగమని రెండు విధములుగా వస్తుభేదము గోచరింపగలదు ప్రయోగము గౌణార్థ ప్రయోగమని, ముఖ్యార్థప్రయోగమని రెండు విధములు జూలు భయంకరత్వము గలిగిన ఆరణ్యక జంతువును 'సింహ' మనుట ముఖ్యార్థప్రయోగము సింహముకన్న భిన్నమైన నౌకానొక మానవుడు జుట్టు విరియబోసుకుని క్రౌర్యశౌర్యాదులను గలిగియున్నప్పుడు, అట్టివానిని జనులు 'వీడు సింహమురా' యని చెప్పుట గౌణార్థ ప్రయోగమందురు గౌణార్థప్రయోగమందు గుణములనే గ్రహించి ముఖ్యవస్తువును మరచిపోయి యా గుణముల కనుగుణమైన వస్తువుగా జెప్పుట గౌణార్థప్రయోగ మందురు కావున వస్తుభేద జ్ఞానముకలవానికి శౌర్యాది విశిష్ట పురుషునియందు సింహశబ్ద ప్రయోగము, తద్ జ్ఞానము గౌణమగునుగాని వస్తుభేదము నెరుంగనివానికి కావు కాని ప్రసిద్ధవస్తుభేదము లేని వానియొక్క అనగా, ఒకదానియందు మరియొక వస్తువుయొక్క శబ్దప్రయోగముగాని, తత్ జ్ఞానముగాని భ్రాంతినిమిత్తమేగాని గౌణము కాదు, స్థాణు పురుషభ్రాంతిలో అనగా, చీకటిలో ఒక రాతిగుండును జూచి యితడు పురుషుడను శబ్దప్రయోగముగాని తత్ జ్ఞానముగాని, భ్రాంతి నిమిత్తము లగుచున్నవి. కావున పరిశీలింపలేని చోట అది యిదిగాగాని ఇది యదిగాగాని,

అనుకొనినచో నట్టి పొరపాటునకు కారణము భ్రాంతిగాని గౌణము కాదు ఇది యెట్లనగా, స్థాణు పురుషభ్రాంతి, శుక్తి రజతభ్రాంతి (ముత్యపుచిప్పను వెండియని జెప్పుట), దేహాది సంఘమందు ఆత్మయను భ్రాంతి— ఇట్టివానిని గౌణములని జెప్పరాదు ఆత్మానాత్మ వివేకము పడసిన పండితులు కూడ వెర్రిగొల్లలకువలె దేహాదులందు ఆత్మబుద్ధి కలుగుచుండగా అది గౌణమెట్లగును? కావున దేహాదుల కంటె నతిరిక్తముగ ఆత్మయొక్క అస్తిత్వమును చెప్పువారికి దేహాదులందు 'అహం' అనెడి జ్ఞానము మిధ్యాభూతమే కాని గౌణము కాదు

పుట 214, పేరా 63 – కావున 'నేను శరీరము కలవాడ' నను జ్ఞానము రజ్జు సర్ప జ్ఞానమువలె మిధ్య యగుటం జేసి విద్వాంసునకు (అద్వైతజ్ఞానికి) జీవించియుండగనే 'అశరీరత్వము సిద్ధించుచున్నది

పుట 216 పేరా 63 (అ) – బ్రహ్మవిత్తును గురించి శ్రుతు లిట్లు జెప్పుచున్నవి

(1) "తత్ యథాఽహి నిర్ల్వయినీ వల్మీకే మృతా ప్రత్యస్తాశయీత ఏవమే వేదం శరీరం శేతే - అథాయ మశరీరోఽమృతః, ప్రాణో బ్రహ్మైవ తేజ ఏవ (బృహ) అజీవన్ముక్తుండెట్లనగా—ఏరీతిగా పాముయొక్క కుబుసము విడువబడినదై పుట్టయందు జీవము లేనిదై పడియుండునో, ఆ రీతిగా విద్వాంసునిచే విడువ బడిన శరీరము పడియుండును అనగా, ఆరీతిగా విడువబడిన కుబుసముగల పామువలె జీవన్ముక్తుడు శరీరమం దభిమానము లేకపోవుటచే శరీరరహి-

తుడై, మరణ రహితుడై ప్రాణః (చేతనా స్వరూపుడై) బ్రహ్మమై, స్వయంప్రకాశుడై యున్నాడు

(1) "స చక్షు రచక్షు రివ, స కర్ణోఽకర్ణ ఇవ,
స వాగవా గివ, స మనా అమనా ఇవ,
స ప్రాణోఽప్రాణ ఇవ" ఇతిచ

వాస్తవముగా నేత్రము లేనివాడయ్యును నేత్రములున్న వానివలెను, చెవులు లేనివాడయ్యును చెవులున్నవానివలె, వాగింద్రియ రహితుడయ్యును వాగింద్రియ సహితునివలెను, అంతఃకరణ లేనివాడయ్యును అంతఃకరణ సహితునివలెను, ప్రాణము లేనివాడయ్యును ప్రాణసహితునివను రెండును

(3) స్మృతియగు భగవద్గీత సాంఖ్యయోగములో 54-వ శ్లోకమునుండి చివరి వరకు (ప్రజహాతి యదా కామాన్ ఏషాబ్రాహ్మీస్థితిః పార్థ) స్థితప్రజ్ఞునియొక్క లక్షణములు జీవన్ముక్తునికి జెప్పుచు విద్వాంసునకు సర్వప్రవృత్తులతో సంబంధము లేకపోవుటను చూపుచున్నది కావున బ్రహ్మాత్మ భావము బొందినవానికి పూర్వమందువలె సంసారిత్వమెంత మాత్రము కలుగనేరదు ఒకవేళ వేదాంత శ్రవణముచేసిన వానికి పూర్వమువలె సంసారిత్వము గోచరించుచున్నదనినచో, అతనికి బ్రహ్మసాక్షాత్కారము కలుగ లేదనుట నిరాక్షేప మైనది అనగా, శ్రవణ మతనికి మరల మరల చేయవలసి యున్నదని తాత్పర్యము

## చతుర్థ వర్ణకము

పుట 218 పేరా 64 (అ) – ఇచ్చట మరియొక పూర్వపక్షము వేదాంత శ్రవణము తరువాత నుత్తర

కాలమున మనన నిది ధ్యాసములయొక్క విధులు వేదములో జెప్పబడుటచే బ్రహ్మమునకు విధిశేషత్వము (బ్రహ్మజ్ఞాన విధియందంగత్వముగా) సంప్రాప్తించుచుండుటవలన ఆ శ్రుతి యొక్క యభిప్రాయము బ్రహ్మముయొక్క స్వరూపమును బోధించుట మాత్రమేకాదు అనగా మనన నిది ధ్యాసము లనే క్రియలు అవసరమగుచున్నవని ఇది పూర్వపక్షము

పుట 218, పేరా 64 (ఆ) – పరిహారము నీ పూర్వ పక్షము సరికాదు శ్రవణమువలె మనన నిది ధ్యాసలు కూడ బ్రహ్మజ్ఞానముకొరకే అని చెప్పవలెను కాన శ్రవణ ముచే జెప్పబడిన జ్ఞానము కర్మమునకుగాని ఉపాసన యందుగాని వినియోగింపబడినచో, అప్పుడా బ్రహ్మము నకు విధిశేషత్వము కలుగును అటులలేదు గాన మనన నిది ధ్యాసములు కూడ బ్రహ్మావగతి (బ్రహ్మజ్ఞానము) కొరకే యని నిశ్చితార్థము శ్రవణ మనన నిది ధ్యాసము లను మూడింటికి బ్రహ్మజ్ఞానమే ప్రయోజనమని చెప్పతీరవలెను

పుట 218, పేరా 64 (ఇ) – కావున బ్రహ్మమును ఉపాసనావిధుల కంగముగా శాస్త్రము సెప్పుటచే బ్రహ్మ శాస్త్రప్రమాణముగాదు వేదాంతవాక్యములన్నియు బ్రహ్మ యందే సమన్వయమగుటచేత బ్రహ్మము స్వతంత్రముగనే, శాస్త్రప్రమాణకంబై గోచరించు ననుట సిద్ధమైనది.

పుట 220, పేరా 64 (ఈ) – వేదాంతములు (ఉపని షత్తులు) విధికి అంగము గాక స్వతంత్రముగా బ్రహ్మను బోధించినప్పుడే "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' యని బ్రహ్మను గురించి ప్రత్యేకముగ శాస్త్రారంభము న్యాయమగును

అటులగాక, బ్రహ్మము విధికి సంగమే యగుచో విధి శాస్త్ర మునకు ప్రవర్తించిన జైమినీయ తంత్రము చేతనే యిదికూడ గతార్థమై జైమినీయతంత్రములో నొకభాగమై యుండెడిది కాని జైమినీయములో "అథాతో ధర్మజిజ్ఞాసా" యని గ్రంథారంభము కాగా, ఆరంభింపవలసిన గ్రంథములో "అథాతః పరిశిష్ట ధర్మ జిజ్ఞాసా' (ఇంతటనుండి మిగిలియున్న ధర్మజిజ్ఞాస చేయతగియున్నది) అను శీర్షిక క్రింద జైమినీయ గ్రంథాంతమున యుండవలసియుండెను. 'ఇంతటనుండి కర్తవ్యార్థ పురుషార్థములయొక్క జిజ్ఞాస యని చెప్పియున్నట్లు గనే, జైమినీశాస్త్రమున బ్రహ్మైకాత్మ్యావగతి ప్రతిజ్ఞ చేయబడియుండలేదు గనుకనే తదర్థమై (బ్రహ్మైకాత్మ్యావగతి కొరకు) యీ శాస్త్రము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యని నూతనముగా ప్రారంభింపబడుట యుక్తమైయున్నది

పుట 220 పేరా 64 (ఉ) - కావున సకలములగు విధులును, ప్రత్యక్ష అనుమానాది ప్రమాణము లన్నియును "నేను బ్రహ్మ'మను జ్ఞానము పరిసమాప్తిగా కలిగియున్నవి "హేయోపాదేయరహితమగు నద్వైత జ్ఞానము కలుగుచుండగా ప్రత్యక్షాది ప్రమాణము లన్నియు నిర్విషయములై ప్రమాత లేనివై యుండుట న్యాయము కాదుగదా!" అని.

పుట 222, పేరా 65 - పరిహారము పై విషయములనే పురస్కరించుకొని బ్రహ్మవేత్తల వాక్యములిట్లున్నవి

(1) గౌణ మిథ్యాత్మనోఽసత్త్వే
పుత్ర దేహాది బాధనాత్

సత్ బ్రహ్మాత్మాఽహామిత్యేవం
బోధే కార్యం కథంభవేత్ ॥

పుత్రులందలి ఆత్మాభిమానము గౌణము స్వదేహమందలి ఆత్మాభిమానము మిథ్య ఈ రెండాత్మలతోనే లోకయాత్ర జరుగుచున్నది ఛాందోగ్యమందు జగత్కారణము 'సత్' శబ్దముచేతను, తైత్తిరీయమందు 'బ్రహ్మ' శబ్దముచేతను, ఐతరేయమందు 'ఆత్మ' శబ్దముచేతను నుపదేశింపబడినది ఈ మూడును (సత్ బ్రహ్మ ఆత్మ) ఏకార్థబోధకములని సూచించునట్లుగా అహం శబ్దముచే నిందు చెప్పబడినది ఇట్టి 'అహం బ్రహ్మైవ అను వాక్యముచే నేను అబాధితమును పూర్ణమును అగు సాక్షిని అను జ్ఞానము కలుగుచుండగా పుత్రుడు దేహము మున్నగునవి మాయాకల్పితములను నిశ్చయముచే బాధితములు కాగా గౌణాభిమానమును, మిథ్యాభిమానమును నశించగా నిక లోకవ్యవహారము (విధి నిషేధాది వ్యవహారము) ఎట్లుండును? ఉండజాలదని యభిప్రాయము

(2) అన్వేష్ట వ్యాత్మ విజ్ఞానాత్
ప్రాక్ ప్రమాతృత్వమాత్మనః
అన్విష్ట స్స్యాత్ ప్రమాతైవ
పాప్మ దోషాది వర్జితః ॥

అన్వేషింపదగిన ఆత్మవిజ్ఞానమునకు పూర్వమందు మాత్రమే, ఆత్మకు (జీవునకు) ప్రమాతృత్వభావము (కర్తృత్వభావము)

ఉండును ఆ యద్వితీయాత్మ అన్వేషింపబడగా నట్టి ప్రమాతయే సకల ధర్మాది దోషశూన్యుడగు పరమాత్మయే యగుచున్నాడు

(3) దేహాత్మ ప్రత్యయో యద్వత్
ప్రమాణత్వేన కల్పితః
లౌకికం తద్వదే వేదం
ప్రమాణం త్వాత్మ నిశ్చయాత్

దేహేంద్రియాదులందు ఆత్మబుద్ధి నే రీతిగా ప్రమాణముగా కల్పింపబడుచున్నదో ఆ తీరుననే లోకమందలి ప్రత్యక్షాది ప్రమాణ సముదాయములు ఆత్మజ్ఞానము కలుగువరకు ప్రమాణములే యగును ఆత్మనిశ్చయానంతరము ప్రమాణ భావము సమసిపోవును అద్వితీయాత్మజ్ఞానము కలుగగా ప్రమాణములయొక్క ప్రయోజనమునకు పరిసమాప్తి కలుగుచున్నది కావున బ్రహ్మము శాస్త్రప్రమాణకమని భావము

చతుస్సూత్రీ టీకా సమాప్తా

# INTRODUCTION

This book is primarily intended for those that have some taste in the doctrine of Sankara s Advaita and who have some working knowledge of Sanskrit There is always an urge in man to acquire knowledge from the original source rather than from the commentaries in matters of this type Somehow there is a lurking feeling that Brahma Sutras are only for advanced scholars and not for the common man To dispel that attitude this book is attempted in a lucid and simple style faithfully sticking to the original rendering of Aadi Sankara Secondly most of the early books on this subject were not correctly punctuated and it is difficult to state where the sentence ends or where there is a real controversy Proper attention is paid for punctuation paragraphisation and necessary quotation Thirdly scrupulous literal translation into Telugu was given on the opposite page to avoid any extra labour for the casual reader In Telugu care is taken to write grammatically and avoid the lose and layman style The English summary in the beginning is a mere bird s eye view and is meant to satisfy modern graduates and post graduates More than all the original verbatim is a must for the mendicants for daily Paaraayana, and in half an hour they will exhaust the whole book with ease everyday

Brahmasri Bhavaraju Narasimha Rao Garu of Triveni Press had taken extra pains to produce the book